కొడవటిగంటి
కుటుంబరావు

# అహింసాప్రయోగం

నవభారత్ ప్రచురణ

# ఇందు

# అంతరాత్మ

నేనూ, ప్రకాశరావూ పార్కులో కూచుని కళల్లో వాస్తవికతను గురించి చర్చించుకుంటున్నాం. ఆ చర్చ యెట్లావచ్చిందీ నేనిప్పుడు సరిగా చెప్పలేనుగాని, అభ్యుదయ రచనల్లో దుష్టపాత్రలను సృష్టించేటప్పుడు ఆ పాత్రలు తమ వర్గానికే దుర్మార్గంగా వుండేటట్టు చిత్రించటం వాస్తవికత కాదని నేనన్నాను ఆ దుర్మార్గం వర్గ వైషమ్య నిజతంగా వుంటే నేతప్ప అభ్యుదయ దృక్పథం వ్యక్తంకాదని నేనంటున్నాను. ప్రకాశరావు ఇంచుమించు నాతో ఏకీభవిస్తున్నాడు.

ఈ సమయంలో, “క్షమించండి,” అంటూ ఆయువకుడు మా సమీపంలో వచ్చి కూర్చున్నాడు. నేనతనికేసి ఆశ్చర్యార్థకంగా చూశాను. చాలా చిన్నవాడు, పాతికేళ్ళు కూడా వుండవేమో. పట్నంలో యెంతకాలంనుంచి వుంటున్నాడో తెలీదుగాని, తెలుగువాళ్ళ ఆకారవైఖరులు మార

లేదు. పుట్టెరంగు మిల్లుబట్టలు కట్టుకున్నాడు. నిండు చేతుల షర్టు, సైకిలుకట్టు ధోవతి, పైన ఉత్తరీయంకూడా వుంది. అప్పుడే ఏ బెజవాడనుంచో దిగినట్టుగా వున్నాడు.

"మీరిప్పుడన్నమాట విన్నాను," అన్నాడా యువకుడు. "మీరు చెప్పే మాటలో నాకు నమ్మకం కుదరలా!"

"ఏమైనా తప్పు చెప్పానా?" అన్నాను.

"మీకు అమ్మా, నాన్నా వున్నారా?" అని అడిగాడు.

ఎందుకిట్లాఅడుగుతారాఅని ఆశ్చర్యపడుతూ, "లేరు" అన్నాను

"పోనీ అన్నదమ్ములున్నారా?" అన్నాడు.

"దగ్గర్లో యెవరూ లేరు" అన్నాను.

"మీ బంధువులెవరూ మీకు దగ్గర్లో లేరనుకుంటాను?"

"అవును."

"అందుకే మీకు సవర్గ దుర్మార్గం గురించి ఏమీ తెలీదు" అన్నాడతను.

"సవర్గ దుర్మార్గం నేనూ చూశాను. అన్నదమ్ముల మధ్య కలహాలూ, భార్యా భర్తలమధ్యకలహాలూవుంటాయి కాని వాటికి ప్రత్యేక కారణాలుంటాయి. ఒకే వర్గానికి చెందిన కారణంగా వ్యక్తులమధ్య వైషమ్యం వుండదు. ఆ కారణాలు వ్యక్తిపరంగా వుంటాయిగాని వర్గపరంగా వుండవు". అన్నాను.

"అయితే మధ్యతరగతిలో కొన్ని వర్గాలనుగురించి మీాకేమీా తెలియదు" అన్నాడా యువకుడు.

"చెబితే తెలుసుకుంటాను" అన్నాను,కపటవినయం నటిస్తూ.

ఆ యువకుడు కొంచెం ఆలోచించి, "నాకథ చెబు తాను, వినండి," అన్నాడు.

* * *

నాపేరు సుదర్శనం (అన్నాడుయువకుడు) నేను మద్రాసులోనే పుట్టాను. పెరిగాను. నా అవతారంచూసి పొరపాటుపడకండి. రెండేళ్ళనుంచీ నేను ఆంధ్రలో వుంటు న్నాను. మీాబోటివారంతా ఆంధ్రను వదలి పట్నంవస్తే నేను పట్నంవదలి అటువేపు వెళ్ళాను. మానాన్న చాలా ఏళ్ళు పట్నంలో ఉద్యోగంచేసి రిటైరై మూడేళ్ళక్రితం పోయినాడు. ఆయన పేరు చెబితే మీారు బహుశా గుర్తించ వచ్చు. కాని చెప్పను. అది మీాకు అనవసరం. మా నాన్న పోయేవరకూ మేం బాగా బతికాం. నాకిద్దరన్నలున్నారు. ఒక అక్కా, ఒక చెల్లెలుకూడా వున్నారు. మా అమ్మ బతికున్నది.

మానాన్న "ఆధునికుడు". ఆయన ఈ మద్రాసు లోనే చదువుకున్నాడు. ఆరోజుల్లో వీరేశలింగంగారినికూడా యెరుగును. ఆయనకు మూఢ విశ్వాసాలంటే కోపం. మమ్మల్ని—కనీసం మా ముగ్గురు మగపిల్లల్నీ—తన ధోరణిలో పెంచాడు. ఆయన బతికున్నంతకాలం మా అమ్మ

కూడా ఆయన పద్ధతులే అవలంబించింది. ఆవిణ్ణి చాలా సంస్కారం పొందిన మనిషల్లే చూసేవారు. ఆవిడ మహిళల సభలకు వెళుతూ వుండేది. కొన్ని మహిళాసమాజాలలో సభ్యురాలుగా వుండేది.

రాజకీయాల విషయంలో మా నాన్నను నాస్తికుడన వచ్చు ఆయనకు ఏ రాజకీయోద్యమంలోనూ విశ్వాసం లేదు. ఒక్క సంఘసంస్కారం విషయంలో తప్ప మిగతా ఏవిషయంలోనూ ఆయనకు విశ్వాసం లేదు. కాంగ్రెసు ఉద్యమాలన్నిటినీ ఆయన ఖండించాడు. వాటివెంట ప్రజలు సంస్కారం పొందలేదని, కొన్ని కేకలువెయ్యటంమటుకే నేర్చుకున్నారని ఆయన నమ్మాడు. ఆయనదృష్టిలో సంస్కార హీనులుగా ఉండి కాంగ్రెసు ఉద్యమంతో పైకివచ్చిన ప్రతీ వ్యక్తినీ ఉదాహరణగా తీసుకుని, ఆయన కాంగ్రెసు ఉద్యమాలను ఖండించాడు. సంస్కారం గురించి ఆదర్శవాదం అవలంబించిన వారంతా ఇట్లాగే ప్రవర్తించారేమోననుకుంటాను మా అన్నలిద్దరూ కాంగ్రెసు భక్తులుగా తయారు కావటం ఆయనకు చెప్పరాని బాధ కలిగించింది. "ఫలాని కాంగ్రెసు కార్యాధ్యక్షుడు తనకూతురికి పదో ఏట పెళ్ళి చేశాడు. పన్నెండో ఏట అది ముండమోసింది. దానికి పెళ్ళి చెయ్యడు నాకడుపునపుట్టినవాళ్ళు వాడి రాజకీయాలకా?" అని ఆయన ఆక్రోశించటం నే నెరుగుదును.

భారతదేశానికి స్వాతంత్ర్యం రావటం ఆయన ఎరుగడు. దానికూడ ఆయన చలించలేడు. "ఈ కాంగ్రెసు

వాళ్ళువచ్చి ఆఖరుకు శారదా చట్టమైనా గట్టిగా అమలు చేస్తారని నాకు నమ్మకంలేదు దొంగలూ దొంగలూ చేరి ఊళ్ళు పంచుకుంటారు. చూస్తూ ఉండండి!" అనేవా డాయన

ఆయనకు కమ్యూనిస్టులన్నా కోపమే. సంస్కారానికి వాళ్ళు పరమశత్రువులనీ, దరిద్రులనూ, మూఢవిశ్వాసపరులనూ వాళ్ళు వెనక వేసుకువస్తారనీ, అందరికంటె గట్టిగా అరవటంతప్ప వాళ్ళ కింకో ఆశయం లేదనీ ఆయన దృఢ నమ్మకం.

ఇక హిందూమహాసభలంటే ఆయనకున్న ఆగ్రహం చెప్పనలవికాదు. వాళ్ళు కమ్యూనిస్టులల్లే అసంస్కారులేగాక కుసంస్కారులనికూడా ఆయనవాదం.

ఇదంతా ఎందుకు చెప్పానంటే ఆయనపోయిన మరుక్షణంనుంచీ మా కుటుంబంలో కలిగిన సాంస్కృతిక పరిణామం చూస్తే ఆయన ఏమనుకునేవాడో అని నే నిప్పటికీ ఆశ్చర్యపడుతూంటాను. ఆయన పోగానే ఆయన భీమా చేసిన మొత్తం పదమూడువేల చిల్లర మా అమ్మపేర వచ్చింది. అప్పటికే మాఅన్నలిద్దరూ ఏవో ఉద్యోగాలు చేసుకుంటున్నారు. నేనుమట్రిక్యులేషన్ పాసై ఎమ్మేలో ప్రవేశించాను. అప్పటికే మా అక్కకు వివాహమయింది. ఆవిడ తాను కోరిన వరుణ్ణి పెళ్ళాడింది. మా నాన్న కోరినప్రకారమే దమ్మిడీ కట్నంలేకుండా, దుర్వ్యయం ఏమీ లేకుండాఆవిడ పెళ్ళిఅయింది. ఆవిడభర్తబియ్యేబీయీడీపాసైమనప్రాంతాల ఉపాధ్యాయుడుగా ఉంటూండేవాడు. వారికిద్దరు పిల్లలుకూడా కలిగారు. మా చెల్లెలుకుమాత్రం ఇంకా వివాహం కాలేదు.

మా నాన్న పోయేనాటికి దానికి పధ్దెనిమిదేళ్ళు మాత్రమే. ఇంటరు రెండోఏడు చదువుతూ ఉండింది.

మా నాన్న పోగానే మా అమ్మలో కలిగిన మార్పు వర్ణనాతీతం. ఆవిడ ఒక్కసారిగా పదమూడు, పధ్నాలుగు వేలరూపాయలకు అధికారిణి అయింది. ఆ డబ్బును ఆవిడ ఎట్లా ఖర్చుచెయ్యాలో మా నాన్న నిర్ణయించలేదు. మా నాన్న అనేక స్వల్ప విషయాలనుగురించి కూడా ఆవేశంగా మాట్లాడటం నే నెరుగుదునుగాని, ఆయన డబ్బును గురించి ఎన్నడూ ఆలోచించినట్టుగాని, దానికి విశిష్టమైన ప్రాధాన్యమూ ఇచ్చినట్టుగాని నాకు జ్ఞాపకం లేదు. తాను అభిమానించేవారిలో ఎవరికి డబ్బుతో అవసరంవచ్చినా, తనదగ్గిర సిద్ధంగాడబ్బుంటే ముందూ వెనుకా ఆలోచించకుండా ఆదుకొనేవాడు.

మా అమ్మమటుకు తనదగ్గిర ఉన్నడబ్బులు ఒక్క క్షణం మరిచిపోలేకపోయింది. భర్తపోయినందుకు ఎరిగిన వాళ్ళు పరామర్శించే స్థితి ఇంకా దాటకపూర్వమే ఆవిడ ఆ పదమూడు వేలతోనూ, ఇళ్ళు కట్టించటమేకాదు, కాసు - వడ్డీకి చవకలో వచ్చేది. పాతదేదైనాసరే పోసి కొనటమేకాదు. మా అక్కపిల్లలకు తోపుడుబళ్ళు కొనటమేకాదు. మా అక్కకు, చెల్లెలికి బంగారుతొడుగులు చేయించటమేకాదు - లక్షలకు విలువైన ఆలోచనలుచేసి అన్నీ నిజమైనట్టే ఆనందించింది. ఆవిడ ఆ డబ్బును ఒక్కక్షణం మరచిందనుకోను. ఎవరెవరికి ఎంతెంత ఆస్తి అనుకోకుండా సంక్రమించినా ఆ ఆ కథలను పవిత్రంగా చెప్పుకునేది. మానాన్న ఎప్పుడెప్పుడు

ఎంతెంత మొత్తాలు దానధర్మాలు చేసిందీ చెప్పి, అటు వంటిపనులు చెయ్యకుండావుంటే మాకు ఆదాయం యాభై వేలు రొఖ్ఖం ఉండి ఉండాలిసిందే ననేది ఆ మధ్య రైలు ప్రమాదంలో చచ్చిపోయినవారి పిల్లలకు ప్రభుత్వం ఎంతో పరిహారం ఇచ్చినట్టు విని, "పోనీ, పాపం! సంపాదనపరుడు పోయినాక పిల్లలకు ఆపాటి ఇవ్వకపోతే ఎట్లా?" అన్నది. ఆవిడమాటలు వింటుంటే రైలుప్రమాదంలో చచ్చిపోవటం కంటె పోయినవాడి పిల్లలకు డబ్బురావటం చాలా ముఖ్య మనిపించింది! ఎవరు ఏంలేదనుకున్నా సరే మా అమ్మ "కొందాం!" అనేది. "కొందాం" అనేమాట ఎవరు ఏ క్షణంలో అన్నా అనవచ్చు. కాని ఆరోజుల్లో మా అమ్మ అన్నప్పుడు ఆ "కొందాం" అన్నమాటకు పదమూడువేల తులాల బరువుండేదంటే మీరు నమ్మవచ్చు.

నేను మా అమ్మనుగురించి ఎరగనివారిఎదట ఇట్లా మాట్లాడుతుంటే, వీడెంత అసహజమైన కొడుకు! అని మీ రాశ్చర్యపడవచ్చు. అదే నే చెప్పబోతున్నది కూడా. నేను సహజమైన కొడుకును కాను. నా కెదుంకో ఆవిడ తల్లిలాగా కనిపించదు. నేను ఆవిడను ఎవరోఅల్లే పరిశీలించాను. ఆవిడముఖంలో కలిగే ప్రతి మార్పునూ, ప్రతిమాటలో ప్రతినొక్కునూ బద్ధవైరిలాగా గమనించి మనసారా ద్వేషించాను ఆ డబ్బు నాకు రాకుండా ఆవిడచేతికి వచ్చిందని నాకు లోపల అక్కసు అనుకునేరు. అదెంతమాత్రంకాదు. నేను కాస్త కపటంగా ప్రవర్తించి ఉంటే నా కా డబ్బులో కొంత వచ్చివుండేది.

ఆవిడమీద నామగల అసహ్యాన్ని బయటపెట్టి నేనా డబ్బును దూరంగాకూడా ఉంచాను. ఆవిడ షరతుమీద ఆ డబ్బు ముట్టుకునేకంటె తిండికి మాడి చావటం మేలనిపించింది నాకు. ఆ డబ్బుకూ నా ఆత్మగౌరవానికీ మధ్య మా అమ్మ మనస్తత్వం సైంధవుడల్లే అడ్డుపడింది. నాకథవినండి?

మా అమ్మలో మార్పు నాకే అసహ్యం కలిగిస్తే, మా చెల్లెలు నాకన్నకూడా మరింత అసహ్యపడింది. "అమ్మకి నిజంగా మతిపోయింది." అని అది యెన్నోసార్లు నాతో అన్నది. నేనూ మా చెల్లెలూ ఒక వయసువాళ్ళం కావటంచేతనేమో, చాలా విషయాలలో ఏకీభవించేవాళ్ళం. కాని ఏ విషయంలోకూడా మా అమ్మ విషయంలో కలిగినంత ఏకాభిప్రాయం కలగలేదన్నమాట. మాఅమ్మ తనకేది కొంటానని ఉబలాటపడినా సరే మా చెల్లెలు తడుముకోకుండా, "నాకది అక్కర్లేదు. నాకదంటే అసహ్యం!" అనేసేది. ఒకసారి మా అమ్మ బజారునుంచి ముచ్చటగా జరీచీరె తెస్తే మా చెల్లెలు, "ప్రాణంపోయినా నేను చీరె కట్టుకోను మా కాలేజీలో ఆడపిల్లలంతా గేలిచేస్తారు. మగపిల్లలంతా వెంటబడతారు." అని ఖచ్చితంగా చెప్పేసింది.

కొద్దిరోజులపాటు మా అమ్మ నాలోనూ విరోధభావం వున్నట్టు గమనించలేదు. కనీసం గమనించినట్టు నటించింది. గమనించక విధిలేని పరిస్థితి యేర్పడ్డాక మేం తనను యేడుచుకుంటున్నామని ఆరోపించింది. "నిన్నుచూసి ఏడుచుకోవటానికి నీలో ఏముంది?" అని మా చెల్లెలు అడిగేసింది. దానికి మా అమ్మ నేరుగా సమాధానం చెప్పక, "మీనాన్న

అన్నది. "వెనకటిలాగేం ఖర్మం ? అంతకంటె బాగానే చూస్తున్నారు" అన్నది మా చెల్లెలు.

మా చెల్లెలనే మాటలు మనసులోనుంచి వస్తున్నట్టే వుండేవి. కాని నేనా మాటలు అనగలిగివుండను. మాఅమ్మ మనస్తత్వానికి నేను చలించినంతగా మా చెల్లెలు చలించ లేదని, అందుకే నే ననలేనిమాటలు అది అనేసేదని నా అనుమానం.

ఏమైనా మాఅమ్మకు కావలసినంత తృప్తి మే మివ్వ లేకపోయాం. అటువంటి సంతృప్తి ఇచ్చినవాడు మా బావ మా అక్కమొగుడు. ఆ భార్యాభర్తలు మానాన్న పోయి నప్పుడు వచ్చారు. నాలుగు రోజులుండి వెళ్ళారు. మళ్ళీ వాళ్ళు నాలుగునూసాల అనంతరం, వేసవి సెలవుల్లో పట్నం వచ్చారు. మా అమ్మ తనకు నామీదా మా చెల్లెలి మీదా ఉన్న కోపమంతా ప్రేమరూపంలో మాఅక్కమీద కనిపించింది. మా అక్కకూడా మా అమ్మకు తగ్గట్టుగానే ప్రవర్తించింది. ఆవిడ మా అమ్మ చెప్పే కబుర్లన్నీ ఎంతో ఆత్రంగా విన్నది. ఆత్రంగా వినటమేకాదు ఆవిణ్ణి బాగా ఎగ దోసిందికూడానూ. మా అక్కా బావా వచ్చినరోజే మా అమ్మ వాళ్ళిద్దర్నీ వేసుకుని బజారుకు బయలుదేరింది. దీని కెంత ఉపోద్ఘాతం! మా అమ్మచేసిన హడావుడేనా? ఒరే, అబ్బాయ్? బాంకునుంచి ఓ వందైనా డ్రా చెయ్యాలిరా! కాస్త ఈపూట బాంకుకు పోయిరావూ? మా నాయనా! అన్నట్టు వెయ్యా విడిగా ఫిక్సెడ్ డిపాజిట్టు వేశాంచూడూ?

దానికి గడువెప్పుడో!—ఆవిడ ఈ ధోరణిలో మాట్లాడు తుండగానే నేను అవతలికి వెళ్ళిపోయినాను. నామీద కొంతదాకా కోపం వచ్చివుంటుందిగాని అంతకుమునుపే రైలుదిగిన అల్లుడు కూతుళ్ళ యెదుట తన నిత్యజీవితం అసంతృప్తికరంగా వుంటోందని బయటపడనిస్తే యెట్లా? అందుకని నన్నేమి అనకుండా మాట్లాడక ఊరుకుంది. ఆ రాత్రి దీపాలు పెట్టాక మా అమ్మ, మా అక్కా, బావా టాక్సీలో దిగారు—తోపుడుబండీ, ఆటవస్తువులూ మొదలైనవాటితో సహా!

కొన్నిరోజులపాటు మా అక్కా, అమ్మా అతుక్కొని ఊడిరాలేవంటే నమ్మండి. మా అమ్మ నాకోసమూ, మా చెల్లెలికోసమూ తలపెట్టిన ఖర్చును మేమిద్దరం యెంత ప్రతిఘటించామో, మా అక్క తనకోసం మా అమ్మ చెయ్యబూనిన ఖర్చును అంతగా ప్రోత్సహించింది. ఆవిడ ఒక చీర కొంటానంటే మరొకటికూడా కొనమనేది. మా అమ్మ మా బావకు ధోవతులు కొంటానంటే ఏకంగా సిల్కువి కొనమనేది. న్యాయం ఆలోచిస్తే, నేనూ, మా చెల్లెలూ మా అమ్మకు అసంతృప్తి కలిగించివుండాలి. కాని అట్లా కలిగించిందని నేననుకోను. మా అక్కమీద అసంతృప్తి ఎప్పుడు ఏ రూపంలో బయటపడుతుందో చూడాలని నేను పొంచివున్నానన్నమాట. మా అక్క నిచ్చిన మూడోనాడు మా అమ్మ మా అక్కపిల్లలకు వీధిలో అమ్మే బెలూనులు అణాపెట్టి కొంటూ. "ఎంతడబ్బు పాడైపోతోంది. ఏం

చిత్రమో!" అన్నది. నాకు కలిగిన ఆనందం ఇంతా అంతా కాదు. గొప్ప పరిశోధకుడికి కొత్తవిషయం తెలిసినా అంత ఆనందం కలగదు.

ఇక మిగిలిన పరిణామాలేవీ నా దృష్టిలో ఆశ్చర్యకరమైనవికావు. ఒక లంచాధికారి మన సత్యం అణాదగ్గర ఎప్పుడైతే పిల్లిమొగ్గవేసిందో అప్పుడే నేను రాగలవి కొంత వరకు వూహించ గలిగాను.

మా బావ శలవులు అయిపోయాయి. కాని మా అక్కకు పట్నం విడిచిపోబుద్ధి కాలేదు. వెధవది నూట డెభ్భైరెండు రూపాయలన్నర జీతానికి పట్నం వొదిలేసుకుని దిక్కూ దివాణం లేనిచోట పడివుండటం వృథా. కాస్త నింపాదిగా విచారిస్తే తన భర్తకు పట్నంలోనే ఏదో ఉద్యోగం దొరక్కపోదని మా అక్కయ్య అభిప్రాయపడింది. మా బావను ఉద్యోగానికి రాజీనామా ఇప్పించటానికి ఒప్పించింది. ఆయనకు అనుకున్నంత సులభంగా ఉద్యోగం దొరకలేదు. కాని మునిగిపోయిందేం? ఖర్చుచేసేటందుకు డబ్బున్నది. కాలం హాయిగా వెళ్ళిపోతోంది.

తనదగ్గర డబ్బున్నందుకు మా అమ్మ సంతోషించిన మాట నిజమేగాని ఆవిడపడ్డబాధ ఆవిడకన్న నేను బాగా గుర్తించాను. విరుద్ధ భావాల మధ్య ఆవిడ నలగ సాగింది. మా అక్కా ఆవిడా ఒకే కట్టగానే వున్నారుగాని లోలోపల యేదో రగులుతూవున్నట్టు మధ్యమధ్య సన్నటి పొగలు వచ్చేవి. మా అక్క ఏదన్నా ఖర్చుచెబితే, మా అమ్మ

దమ్మిడీల దగ్గర్నుంచీ పొదంగా వాడుతున్న దానల్లే, "అబ్బ అది లేకపోతే ఇప్పుడేమే? అన్నీ దండగమారి ఆలోచనలూ" అనేది. ఆమర్నాడే దానికి పదింతలు దండగమారి ఖర్చు చేసేది.—మా అక్కకోసమే. ఒకసారి మా అక్క రెండు రూపాయలిమ్మని అడిగితే, "నన్నడగాలి టే? తీసుకోరాదూ" అనేది. ఆమర్నాడే మా అక్క గూట్లోనుంచి అర్థరూపాయి తీస్తే మా అమ్మ దానికోసం వెతుక్కుని, రాద్ధాంతంచేసి, "క్షణం కిందట పెట్టిన డబ్బులు మాయమవుతై" అనేది. "నేను తీశానమ్మా! ఎందుకింత ఆర్భాటం చేసావ్? అని మా అక్క అంటే. "కాస్త చెప్పకూడదు? నాకు వెతకటం తప్పునుగా" అనేది.

ఎంతసేపూ మా అమ్మకూ డబ్బుకూ గల చుట్టరికం గురించే మాట్లాడుతున్నానని విసుక్కోకండి. ఇంకా ఇతర విషయాలు—మానాన్న చూస్తే నిర్ఘాంత పోయ్యేవి కొన్ని జరిగాయి మా అక్కపిల్లలు వచ్చాక వాళ్ళు తుమ్మినా, చీదినా మాఅమ్మ వాళ్ళకు దిష్టితీసేది. మా నాన్న హాయాంలో ఈ దిష్టి ఎరగం. దిష్టితోబాటు దేవుళ్ళకు మొక్కోటాలు వరాలు వర్జాలూ చూడటాలూ. శకునాలు పాటించటాలూ ప్రారంభమైనాయి వీటికి మాబావ ఊతం యివ్వసాగాడు. ఆయనకు జ్యోతిషంలోనూ, హాస్తసాముద్రికం లోనూ, అంకెల శాస్త్రంలోనూ కొంత ప్రవేశంవుంది. నేను చూస్తుండగానే తిరపతి యాత్రకూడా ఒకటి జరిగింది.

ఇవన్నీ ఉండగా మా చెల్లెలి పెళ్ళి సమస్య ఒకటి

వచ్చింది. మా అక్క పెళ్ళిగురించి మా నాన్న ఎన్నడూ ఆదుర్దా పడలేదు. సంబంధాలు వెతికినా మా అక్కకు తెలీకుండా ఎన్నడూ వెతకలేదు. మా చెల్లెలితో చెప్పకుండా కూడా మా అమ్మ సంబంధాలు స్థిరపరచటానికి ప్రయత్నించింది. "మనకులం, మనశాఖ" చాలా ప్రాముఖ్యం వహించాయి. నా సహాధ్యాయి అన్న ఒకడు మా చెల్లెల్ని చేసుకోవటానికి ఇష్టపడినట్టు తెలియజేశాడు. కాని "మావాడు" కాడని మా అమ్మ కొట్టిపారేసింది.

"కావలిస్తే అమ్మాయికి నేను కట్నంఇస్తాగా! మంచి సంబంధమే చేద్దాం!" అనేది మా అమ్మ.

మా అమ్మకు ఇష్టమైందని తెలిశాక మా చెల్లెలు ఏ సంబంధమైనా కొట్టిపారేసే స్థితికి వచ్చింది. దీనివల్ల కొన్ని మంచి సంబంధాలు పోయాయేమో కూడానూ! కాని అది లక్ష్యపెట్టలేదు.

మా అమ్మకూ అక్కకూ మధ్య పొగలురావటమల్లా మంటలు రేగటందాకా వచ్చింది. ఎవరూ తక్కువతిన్న వాళ్ళు కారు.

"తే, తే, అంటావు, ఎక్కణ్ణించి తెచ్చేదే? నీకన్న చిన్నవాళ్ళున్నారు. వాళ్ళిద్దరూ నాడబ్బు కానీ ముట్టరు. ఎంతపెట్టినా నీకు మెప్పులేదు. తే, తే అనటంతప్ప నీకింకేమీ తెలీదు!" అని మా అమ్మ!

"నిన్నసలెవరు పెట్టమన్నారూ? నీమాటలకు మోస

పోయికాదూ మేం నిక్షేపమంటి ఉద్యోగం మానుకుని ఈ ఈ దిక్కుమాలినచోట పడింది? నీ మిగిలినపిల్లలకు పెట్టొద్దని నే నన్నానా? అది మా అక్క!

మా అక్క ఆగ్రహం మామీదికికూడా తిరగసాగింది తన సొత్తేమో మేం అపహరిస్తున్నట్టు!

నేను ఎమ్మేపరీక్షకు కూచున్న ఏడు మాఅన్నలిద్దరూ శలవులకు వచ్చారు. కుటుంబాలతోసహా. మా అమ్మ తన ధనికత్వంతా. ఆప్యాయతా వాళ్ళమీద చూపింది. కొద్ది రోజులపాటైనా వాళ్ళు మా అక్కలాగా ప్రవర్తిస్తారనుకున్నది మా అమ్మ. కాని ఆ ఆశ పారలేదు. వాళ్లు ఆవిడ డబ్బు ఖర్చుచెయ్యటానికి ఒప్పుకున్నారుగాని దానికి ప్రతిఫలంగా ఆవిణ్ణి ఉబ్బెయ్యటానికిమటుకు సిద్ధపడలేదు. మా బావకూ వాళ్ళకూ అసలు పడలేదు. అతను సంవత్సరం నుంచీ ఇక్కడే తిష్టవేసిఉండటం వాళ్ళకేమీ రుచించలేదు. మొగుణ్ణి వెనకేసుకొచ్చి మా అక్కవాళ్ళతో చచ్చేట్టు పోట్లాడింది. తన కొడుకుల్ని వెనకేసుకొచ్చి మా అమ్మ మా అక్కతో పోట్లాడింది. వాళ్ళున్నన్నాళ్లూ. కొంప ఎట్లా ఉండాలో అట్లా ఉంది. చాలారోజులకు ఆప్తులు కలుసుకున్న వాతావరణం ఏకోశానా నాకు కనిపించలేదు. అన్నలు తమ్ములకేమవుతారో, చెల్లెళ్ళు అక్కల కేమవుతారో, పిల్లలు తల్లికేమవుతారో మా కుటుంబాన్ని చూసినవాళ్ళకి అర్థమై ఉండేదికాదు.

దురదృష్టవశాత్తూ ఈ శలవలై పోయేలోగానే మా

రెండో అన్నకు పట్నం బదిలీఅయింది. ఆయన మళ్ళీ వెళ్ళిపోలేదు. మా ఇంటి వాతావరణం చెప్పటానికి వీల్లేదు. రోజూ కొట్లాటలే. ఈ కొట్లాటలకు కారణాలుండేవేగాని ఆ కారణాలకు అర్థం ఉండేదికాదు.

నేను సమ్మెలు చూశాను. పోలీసుల లాఠీచార్జీలు చూశాను. ఎన్నో ఘోరాలుచూశాను. కాని మాఇంట్లో జరిగే పోట్లాటలంత అర్థరహితమైన సంఘటనలు ఎక్కడా చూడలేదు. ఇంత తినడానికుండి బతకటం చేతకాని మధ్యతరగతి కుటుంబంలో పుట్టినవాడు తప్ప ఈ కొట్లాటలను ఊహించుకోలేడు. ఇంట్లో డజనుమంది ఉంటే ఏఇద్దరిమధ్యనయినా శత్రుత్వం ఉండేది. అది అచ్చంగా స్వార్థంతో కూడుకున్నదికూడాను.

ఒక ఉదాహరణ చెబుతాను: మా చిన్నన్నవచ్చాక ఆయన మా బావగారికొక ఉద్యోగం ఇప్పించటానికి ప్రయత్నించాడు. జీతంతక్కువ. నూటపాతిక. మా అక్క మా చిన్నన్నమీద మండిపడింది. «నువ్వు మూడొందలరూపాయల ఉద్యోగం చెయ్యాలా? మా ఆయనకు నూటపాతికా! చేతకానివాడివి ఊరుకోరాదూ? తగుదునమ్మా అని రాకపోతే ఏం? నిన్ను ఉద్యోగం ఇప్పించమని కాళ్ళా వేళ్ళా పడ్డామా?» అని గంయ్ గంయ్‌లాడింది మా చిన్నన్న నాలుగూ పెట్టాడు. ఇంతకూ మా బావ ఆ ఉద్యోగం ఒప్పుకున్నాడు- ఒప్పుకుంటే ఏమయింది? రోజూవచ్చి మాచిన్నన్నను దెప్పేశాడు. పనిజాస్తిట! తనను తగినంత గౌరవంగా

మూడకుట ఆఫీసులో! శనివారంకూడా పనిచెయ్యాలిట! ఉద్యోగం మాష్టరు పనల్లే లేదుట!

ఎవరు ఏ క్షణాన ఎవరిపక్షమో ఎవరికీ తెలీదు. ఒక రోజున, ముహూర్తబలాన్నిబట్టి మాఅమ్మ మా చిన్నన్నను వెనకవేసుకొచ్చి మా అక్కతో ఏదో అన్నది. మాఅక్కకు కోపం రెచ్చిపోయి మొగుడితో "ఈ వెధవకొంపలో నే నొక క్షణం ఉండను. ముందు వెళ్ళి ఇల్లు చూస్తారా చూడరా?" అన్నది. అసలు మా అక్క వారానికోసారి వేరేఇంటికి వెళ్ళినంతపనీ చేసేది. ఇల్లులేకనో, సామాను పట్టుకెళ్ళటానికి సమయానికి డబ్బులేకనో మానేస్తేది.

ఇట్లావుండగా మా చెల్లెలు—ఇంటరు పూర్తిచేసి ఇంటిదగ్గిరే వుంటున్నది — తన పెళ్ళి ప్రయత్నాలు తానే చూసుకోసాగింది, ఈ సంగతి కొన్నాళ్లు మావాళ్లకి తెలీదు. అందరికన్న ముందు తెలిసింది నాకే. అప్పటికే ఉభయ పక్షాలూ పెళ్ళి స్థిరంచేసుకున్నారు. నే నెవరితోనూ చెప్ప లేదు. కాని మా చెల్లెల్ని చేసుకోబొయ్యేవాణ్ణి గురించి మటుకు కొంత ఆరా తీసి కొంతవరకు తృప్తిపడ్డాను.

మా చెల్లెలి రహస్యం మా అక్క కనిపెట్టింది. చెల్లెలు డ్రాయరు వెతికి అందులోంచి ఒక చిన్న ఉత్తరం తీసింది. చెల్లెలి రంకు కనిపెట్టినట్టుగా మాట్లాడింది మాఅక్క. చెల్లెలు పోట్లాడింది. "నీ విషయాలు నువుచూసుకో. నా జోలికి రాకు!" అని అది సలహా చెప్పింది.

మా అమ్మ పంచాయతీ చేసింది. ఆ వుత్తరం రాసినవాడిపేరు చెప్పమని మా చెల్లెల్ని నిలవేసింది. నేనూ, మా చిన్నన్నా మా చెల్లెలి పక్షం అయినాం, మా బావ భార్యపక్షం అయినాడు. ఆ చర్చ వర్ణనాతీతం. ఎవరో సంబంధంలేనివాళ్ల రంకు గురించికూడా అంత ఆసక్తి కనబరచం మా చెల్లెలుమటుకు పరీక్షకు నిలబడింది. దాని నోట ఒక్కమాట రాలేదు.

తరవాత కొద్దిరోజులకే దాని పెళ్లి అయింది. మా అమ్మ రాజీకి వచ్చి ఈపెళ్లికి కనీసం వెయ్యిరూపాయలైనా ఖర్చుపెట్టటానికి యత్నం చేసింది. అనేక వస్తువులు కొన్నది కూడా. మా చెల్లెలు వాటిలో ఒక్కటి ముట్టుకోలేదు.

ఈ పెళ్ళికి ముందే నేను ఉద్యోగం సంపాదించుకుని పట్నంవదిలేశాను. మా ఇల్లు వొదిలేసినాకనే నాకు మనుష్యులమీద అభిమానమంటూ పుట్టింది. ఇంకొకరిని అర్థం చేసుకోవటమూ, ఇంకొకరి కష్టసుఖాలు పంచుకోవటమూ మొదలైనవి నాకు బయటిప్రజలు నేర్పారుగాని, ఇంట్లో వాళ్ళుకారు. ఈయింట్లో వాళ్ళమీదనైనా దూరంవెళ్ళాకనే యేదో అభిమానం పుట్టింది. మొన్ననే మళ్ళీ వచ్చాను.

నేను మా ఇంట్లో అడుగుపెడుతుండగానే మా వాళ్ళంతా ఎగబడి పెద్ద శుభవార్త చెప్పేటట్టు ఎంతో ఆనందంతో ఒకరికొకరు అడ్డంవస్తూ చెప్పారు. తీరావింటే మరేమీలేదు. మా బావగారికి ఉద్యోగం ఊడిందిట.

అందులో మా అమ్మ పట్టలేనంత ఆనందం పొందటాని కేముందో, మా వదినె అందరికీ అడ్డంవచ్చి అందరికన్నా గొంతుచించుకుని పరవశమై పోవటానికేముందో నాకర్థం కాలేదు. ఇది ఒకటే కాదు, మా బావ ఒక్కడికే కాదు; ఆ కొంపలో ఎవరికి ఎదురుదెబ్బ తగిలినా మిగిలినవారంతా ఏకగ్రీవంగా నవ్వటానికి సిద్ధంగా వున్నారు. ఇది మా ఇంటి కథ. దీనికి అర్థం ఏమన్నావుంటే మీరు చెప్పండి. తెలుసు కోవటానికి నేను సిద్ధంగా వున్నాను.

# మంత్రగాడు

ఆ కొండలమీద విషపు పాములు జాస్తి. ఏటా అయిదారువేల మంది పాముకాటుతో చస్తూఉంటారు. అప్పుడప్పుడు కొందరు ఉద్రేకంగల కుర్రవాళ్ళు పాముల వేటకు బయలుదేరి సామాన్యంగా ఇళ్ళకు తిరిగిరారు.

ఆ ప్రాంతాల మంత్రాలువేసి పాముకాట్లు నయం చేసేవాళ్ళున్నారు గాని, నిజంగా పామువిషం శరీరంలో ప్రవేశించినతరవాత మంత్రం ఏమీ చెయ్యలేదు. అదృష్ట వశాత్తు నూటికి ఎనభై పాముకాట్లు గోరుగిచ్చులంటివి. అటు వంటి కాట్లమీద ఏ మంత్రమైనా అమోఘంగా పనిచేస్తుంది.

అర్జునుడు పద్ధెనిమిది, పందొమ్మిదేళ్ళ కుర్రవాడు; అందగాడు; కష్టపడి పనిచేసేవాడు; చాలా పట్టుదల, న్యాయ బుద్ధి కలవాడు. వాడు పసివాడై ఉండగా వాడి అన్న పాము కాటుతో చచ్చిపోయినాడు. ఇటీవల వాడి తల్లిదండ్రులిద్దరూ నెలరోజులు తేడాగా పాములవాత పడ్డారు.

వాడికి మొదటినుంచీ పాములంటే ప్రీతి. ఎన్నడూ

వాటిజోలికి పోయిఎరగడు. తోటికుర్రాళ్ళు పాములవేటకు బయలుదేరుతుంటే ఏదోసాకుచెప్పి వాళ్ళవెంట వెళ్ళకుండా తప్పించుకునేవాడు. తను ఒంటరిగా వుండగా పాము కంట బడితే ఏమీ చేసేవాడుకాడు.

ఒకసారి అర్జునుడు నలుగురు స్నేహితులతో పొద్దూకేవేళకు ఇళ్ళకు తిరిగివస్తుండగా దారిలో ఒక బూడిద రంగు పాముపిల్ల—మూరెడు పొడుగుది—దారిపక్కన ఉన్న ఒక దుబ్బులోకిపోతూ కనిపించింది.

వెంటనే నలుగురు కుర్రాళ్ళూ దుబ్బును కమ్ముకుని కర్రలతో దుబ్బును నాలుగువేపులా అదిలించారు. పాము బయటికి రాగానే నాలుగు కర్రలూ నడుముమీద పడినై. అప్పుడా క్షుద్రప్రాణి తలఎత్తి నలుగురికేసి చూసింది. అది నలుగురి మొహాలూ గుర్తుంచుకుని దేవుడిదగ్గర వర్ణించటానికే ప్రయత్నిస్తున్నదో, "నేను మీకేంచేశాను? నా ప్రాణంతో మీరేంచేసుకుంటారు?" అని వాళ్ళని అడుగుతున్నదో అర్జునుడికి అర్థంకాలేదు. అది తనచిన్నకళ్ళతో ఒకరితరవాత ఒకర్నిచూసి ఏమీ అనకపోవటం చూస్తుంటే అర్జునుడి కడుపు తరుక్కుపోయింది. దాన్ని పూర్తిగా చంపక వినోదం చూస్తున్న కుర్రాళ్ళే విషసర్పాలో, వాళ్ళచేత నడుం విరగగొట్టించుకున్న ఆ క్షుద్రప్రాణే విషసర్పమో అతనికి అర్థంకాలేదు. వాడు చప్పున ముందుకొచ్చి తనలావుపాటి కర్రతో దాని తల చితకపొడిచేశాడు.

ఇది జరిగిన మూడురోజులదాకా అర్జునుడికి ఆ

నీరెండలో అ పాముచూపే జ్ఞాపకంవచ్చి రొమ్ముల్లో బిగబట్టినట్టుండేది.

పాము మనిషిని చంపటంలోనూ, మనిషి పాముని చంపటంలోను తేడావేమిటి; పాము మనిషినించి తప్పించుకుపోవటానికే ప్రయత్నిస్తుంది. మనిషి పామును చంపటానికే చూస్తుంటాడు. ఎట్లాగో చచ్చేమనిషి పాముకాటువల్ల చస్తే మాత్రమేం? మనిషి చేత పడకపోతే పాముకు చావు లేదు. అది ఎన్నివందల ఏళ్ళన్నా బతుకుతుంది.

ఇటువంటి వేదాంతం అవలంబించిన అర్జునుడు తల్లి చావుతో పూర్తిగామారిపోయినాడు. పాములూ మనుష్యుల వంటి ప్రాణులే అనేతత్వం వాడికి తప్పుగా తోచింది. అవి మరోజాతి. కనకనే దేవుడు వాటికీ, మనుష్యులకూ వైరం పెట్టాడు. మనుష్యులూ, పాములూ ఒకరిప్రాణం ఒకరు తీసుకోవటానికి పుట్టారు. పాములు మాత్రమే మనుష్యులను చంపుతూ మనుష్యులు పాములజోలికి పోవటం మానితే ప్రపంచంలో మనుష్యులు లేకుండాపోయి పాములే మిగులుతై. అదీకాక తల్లిలేకపోవటం ఏమిటో పాముకేం తెలుసు? పాములు తమ తల్లులు చచ్చిపోతే వాటికోసం రాత్రిళ్లు నిద్రపోకుండా ఏడవగలవా? అటువంటి తుచ్ఛ ప్రాణాలుంటేనేం పోతేనేం? ఈకొండలమీాద ఒక్కపాము కూడా లేకుండాపోతే జీవితం ఎంత ఆనందంగా వుంటుంది. ప్రపంచం స్వర్గమైపోదూ?

ఆలోచించినకొద్దీ అర్జునుడికి పాముల్ని నిర్మూ

లించటం సాధ్యంగానే కనిపించింది. ఇది ఒక మనిషి జీవితం యావత్తూ ధారపొయ్యదగినపని. దీనికి తోడు కూడా అక్కర్లేదు. నలుగురుకలిసి చంపేది ఒక్కొక్క పామునే. అందులో ఎవడన్నా అజాగ్రత్తమనిషి ఉంటే వాడికేమన్నా జరగ్గానే మిగిలినవాళ్ళందరికీ నిరుత్సాహం కలుగుతుంది. కనక ఈ పనికి తను స్వయంగా, ఒంటరిగా పూనుకోవాలి.

అర్జునుడు తన సొంతపన్లమీద విరక్తిపుట్టి ఉదయం లేచింది లగాయతూ పొద్దూకేవరకూ పాములవేట ప్రారంభించాడు. వాడు పాములమీద పట్టినపగ ఏపామూ ఎవడిమీదా పట్టిఉండదు రోజుకు అధమం నాలుగైదు పాములన్నా కొట్టంది ఇంటికొచ్చేవాడు కాడు. ఒక్కొక్కరోజు పదిపన్నెండు పాముల్నికూడా పొట్టన పెట్టుకునేవాడు ఆరోజుకారోజు వాడికి పాములమీద పగ జాస్తి అయిందిగాని తగ్గలేదు

చిత్రమేమిటంటే వాడి పాములవేట మొదలుపెట్టిన తరవాత వాడికి పాములమీద ఎంత అసహ్యం ఏర్పడిందో మనుష్యులమీదా అంత అసహ్యం ఏర్పడింది. ప్రతిమనిషీ జానెడు బెత్తెడు పురుగుకు లోకువుగా కనిపించాడు. తను ఒక్కడే వాటికి నిజమైన మొగుడు. సరిగా తిండీ, పోషణా లేక తనకు పిశాచపుమొహం పట్టుతున్నా తన జీవితమే వాడికి స్వర్ణజీవితం కానట్టూ, మిగిలిన మానవజీవితాలన్నీ వ్యర్థజీవితా లయినట్టూ తోచింది.

ఈ మనస్థితి జబ్బుతో కూడుకున్నదీ తాత్కాలికమైనదనీ అర్జునుడు కనిపెట్టలేదు.

ఆ మంత్రగాడు చాలా దూరదేశంనించి వస్తున్నాడు. వాడికి ప్రాంతాలు కొత్త. వాడు ఉంటూవచ్చిన దేశంలో మంత్రగాళ్ళకు బతుకుతెరువు లేకుండా పోతున్నది. వాడు కేవలం మంత్రాలేకాక కొన్నికొన్ని మాయలుకూడా నేర్చినవాడుకావటంవల్ల అక్కడివాళ్ళు వాడిమీద కక్షకట్టి వాడికి చోటులేకుండా చెయ్యటానికి ఉపక్రమించారు. మంత్రగాడు బతకనేర్చినవాడుకనక పెండ్లాడే తనకూతురిని వెంటబెట్టుకుని మకాం ఎత్తాడు.

మంత్రగాడూ, వాడికూతురూ ఎన్నోవారాలు ప్రయాణం చేశారు. ఎన్నో ఊళ్ళూ, దేశాలూ, నదులూ, కొండలూ దాటారు. కాని వాళ్ళకి ఎక్కడ నిలిచిపోవటానికి మనస్కరించలేదు. ఆఖరుకు ఈ ప్రాంతపు కొండలమీదికి రాగానే మంత్రగాడి కూతురు ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆమె ఉల్లాసానికి అక్కడి ప్రకృతి సౌందర్యమే కారణమో, లేక అప్పుడే ప్రారంభమవుతూన్న వసంతశోభే కారణమో తెలీదు. కాని మంత్రగాడు ఈ ప్రాంతాల కొంతకాలం ఉండిపోవడానికి తన మనస్సులో ఒక తాత్కాలిక తీర్మానం చేసుకున్నాడు.

ఒకనాటి మిట్టమధ్యాహ్నంవేళ తండ్రికూతుళ్ళిద్దరూ ఒక నీటి మడుగుదగ్గిర రాళ్ళెట్టిని నీళ్ళుతాగి చెట్లనీడన విశ్రమించారు. త్వరలోనే మంత్రగాడికి కాస్త కునుకుపట్టింది. వాడికూతురుమటుకు ఏమాత్రమూ అలసట తోచక సన్నగా పాడుకుంటూ రాళ్ళగుట్టలు ఎక్కి-దిగటం మొదలుపెట్టింది.

అకస్మాత్తుగా పాట ఆపి ఆపిల్ల తనకళ్ళను తానే నమ్మలేనట్టు చూడసాగింది, అంతదూరాన ఒక పెద్ద బండ రాయి నీడలో ఒక కుర్రవాడు నిద్రపోతున్నట్టుపడివున్నాడు. ఆపిల్ల గబగబా రాళ్ళమీద గెంతుకుంటూ కుర్రవాణ్ణి సమీపించింది. దగ్గరనించిచూస్తే అతని నోటివెంట, నురుగు కనిపించింది అతని రొమ్ము నిశ్చలంగా వుంది. తాకిచూస్తే అతని శరీరం మంచుముండమాదిరిగా ఉంది.

ఆపిల్ల అతన్ని భుజం పట్టుకుని కదిలించింది. ఆతని పెదవుల మధ్యగా మరికొంచెం నురుగువచ్చింది గాని ఇంకేమీ రాలేదు. అతని మొహంగాని, శరీరంగాని వివర్ణం కాలేదు.

అర్జునుడు కళ్ళుతెరచి చూసేటప్పటికి అతనికి ఒక గడ్డంవాడి మొహమూ, ఒక పడుచుపిల్ల మొహమూ కనిపించినై.

"ఏంజరిగింది? నేనెక్కడున్నాను? నన్ను పురుగు ముట్టింది" అన్నాడర్జునుడు.

"నీకేమీ ఫరవా లేదు, మానాన్న నిన్ను బతికించాడు" అన్నది మంత్రగాడి కూతురు.

"నీకేమీ ప్రాణభయంలేదు, మీ యిల్లెక్కడ?" అన్నాడు మంత్రగాడు.

"నాకిల్లూ వాకిలీ ఏమీలేదు. నాకెవరూ లేరు... మీ

రిద్దరూ నన్ను బతికించారా? నాకు ప్రాణదానం చేశారా? మీ రుణం ఎట్లా తీర్చుకోగలను?" అన్నాడర్జునుడు.

మంత్రగాడి మొహాన ఆశాభంగం కనిపించింది.

"పోనీ ఈ ప్రాంతాల గొప్పవాళ్ళ నెవరినన్నా ఎరుగుదువా?" అన్నాడు మంత్రగాడు.

"గొప్పవాళ్ళెవరో నాకు తెలీదు. కాని ఇక్కడ అందర్నీ ఎరుగుదును. నాకు ప్రాణదానం చేసిన దేవుడవి, నీ రుణం ఎట్లా తీర్చుకోను? ఈ క్షణంలగాయతు నేను తీసివిడిచే ప్రతిశ్వాస మీదే. నా ఒంట్లో ఉన్న శక్తిలో ప్రతిఅణువూ మీదే, నన్ను మీ యిష్టం వచ్చినట్టు ఆజ్ఞాపించండి" అన్నాడర్జునుడు.

మంత్రగాడాలోచించాడు. అంతకుపూర్వం తనవల్ల లాభాలు పొందామని నమ్మినవాళ్ళు చాలామంది ఉన్నారు గాని తనకింతగా కృతజ్ఞత కనపరిచినవాళ్ళెవరూ లేరు.

అర్జునుడు మంత్రగాడి కాళ్ళమీద పడ్డాడు. వాడికి ప్రపంచంలో ఈ మంత్రగాడు తప్ప ఇంకెవ్వరూ లేనట్టనిపించింది. చచ్చిపోయిన తన తల్లీ, తండ్రీ, తనచేత చచ్చిన పాములూ పూర్వజన్మకు చెందినవిగా తోచినై. వాడు మంత్రగాడి వెంట ఉండటానికి సమ్మతించాడు.

మంత్రగాడు ఆ ప్రాంతాలనే బిచాణా వేశాడు. అర్జునుడు తన కొత్తయజమానిని ఆ పరిసరాల పెద్దమనుషుల

లోపుగా వున్న ప్రతిమనిషికీ పరిచయం చేశాడు. మంత్రగాడి మహాత్మ్యంలో అందరికీ విశ్వాసం కలిగింది. చచ్చిపోయిన అర్జునుణ్ణి మంత్రగాడు మరి బతికించలా?

అర్జునుడు మంత్రిగాడికి సకలోపచారాలు చేసేవాడు. ఇంటిపని యావత్తు చేసేవాడు. వంటచేసేవాడు, కట్టెలు కొట్టేవాడు, మందులు నూరేవాడు, ఒళ్ళుపట్టేవాడు. ఈ చాకిరిలో తన శరీరం ఎంత హూనమవుతుంటే అర్జునుడికంత ఆనందంగా ఉండేది.

తన యజమాని మాయలను గురించి అర్జునుడు చాలాకాలం తెలుసుకోలేదు. మంత్రిగాడిమీద తనకు మొట్టమొదటి సందేహం కలిగినప్పుడు దాన్ని చప్పున అణుచుకున్నాడు. సందేహం రూఢి అయినతరువాత తన ప్రాణదాతను విమర్శించడం తన ధర్మం కాదనుకున్నాడు.

క్రమంగా మంత్రిగాడిలో ఉన్న మహాత్మ్యం యావత్తు మాయేనని తెలిసిపోయినప్పుడు అర్జునుడికి ఆశ్చర్యం కలిగింది ఈ మాయలవాడు తనను చావునుంచి ఎట్లా తప్పించాడు. తనమీద పారిన మంత్రం ఇతరులు కొందరిమీద పారటం లేదెందుకు !

ఈ మంత్రిగాడిమీద ఆ ప్రాంతాలవాళ్ళకింకా గురి తగ్గలేదు అక్కడి మంత్రగాళ్ళు కూడా ఈ మంత్రిగాడికింకా దాసోహమంటున్నారు. దానికి కారణమేమీలేదు. అక్కడి మంత్రగాళ్ళు ఈ మంత్రగాడి మాదిరిగా మాయలెరుగరు ?

ఈ మాయలు సాధించటానికి మంత్రగాడు అర్జునుణ్ణి సాధనంగా వినియోగించసాగాడు. అర్జునుడి అంతరాత్మ ఆ పనులు చెయ్యటానికి ఎదురు తిరిగింది.

కాని, నేను చెయ్యనటానికి తనకేమి హక్కుంది? తన ప్రాణమూ, శరీరమూ - సమస్తానికీ తన యజమానేగా అధిపతి?... ఆమాట అని ఈ మంత్రగాడికోసం తన కయిన వాళ్ళందరిమీదా తను అత్యాచారం చెయ్యక ఎట్లా?

ఈ సమస్య అర్జునుడికి తెలలేదు. కాని అర్జునుడు మంత్రగాడిమీద తిరుగుబాటు చెయ్యక వాడు చెప్పినట్లా అమిత అయిష్టంగా చేస్తూ వచ్చాడు. ఇప్పుడు అర్జునుడు యజమానికి చేసే సేవ హృదయపూర్వకమైనది కాదు.

మొదట్లో మంత్రగాణ్ని దేవుడల్లే చూసిన జనం ఏకారణంచేతనో ఇప్పుడు వాడంటే దడుచుకుంటున్నారు. వాడికి కోసం తెప్పించినవాళ్ళ ఇల్లు కాలిపొయ్యేవి. వాళ్ళ పశువులు మాయమైపోయి, వాటి తాలూకు కళేబరాలు ఎక్కడో కనుపించేవి. అక్కడక్కడా మనుష్యులు ఆశ్చర్యకరమైన చావులు చస్తున్నట్టుకూడా ఒక పుకారు పుట్టింది.

అర్జునుడితో కూడా పూర్వపరిచితులు వెనకటంత చనువుగా మాటలాడటంలేదు. వాణ్ణి చూసి భయపడట్లు కనిపిస్తున్నారు. ఒకరిద్దరు మంత్రగాడిని గురించి వాడితో చెప్పుకుని ఏడిచినప్పుడు అర్జునుడి గుండె ఆగిపోయింది.

తనమూలంగానే ఈ మంత్రగాడికీ ప్రదేశంలో స్థావ

రం చిక్కింది. వీణ్ణి అందరికీ పరిచయం చేసినవాడు తనే. వీరి ష్టను ప్రజలమీద ప్రయోగిస్తున్న మహాశక్తికి మూలకార ణం కూడా తనే. మహామారి వస్తే జనం ఎట్లా ఖిన్నులై పోతారో అట్లా వున్నారు మంత్రగాడిమూలాన ప్రజలు.

తనపునర్జన్మ ఇంతతుచ్ఛపుజన్మ అయిందేం? ఈ పరి స్థితుల్లో తనధర్మం ఏమిటి? తనను ఈసంఘం కోల్పోయింది. తను సాతాత్తు చచ్చిపోయినాడు. ఇప్పుడు బ్రతికున్న తను సంపూర్ణంగా మంత్రగాడి సొత్తు.

“నాతో ఏమీ చెప్పకండి. నేను వెనకటి అర్జునుడు గాను. మంత్రగాడే ప్రాణాధిదేవత, నా యజమాని. ఆయన మీద ఎటువంటి అపనిందలూ నా చెవిన పడరాదు” అని తనతో మాట్లాడినవాళ్ళకు సమాధానం చెప్పాడర్జునుడు.

ఈలోపుగా అర్జునుడి జీవితంలో మరో ప్రతిబంధకం ఏర్పడ్డది. మంత్రగాడి కూతురు అర్జునుణ్ని మోహించింది. వాడి ప్రేమను ఆజ్ఞాపించింది, అర్జునుడు ఆ పిల్లను మోహించ లేడు. కాని మంత్రగాడి ఆజ్ఞలు శిరసావహించినట్టే ఆమె శిరసావహించాడు.

ఆ పిల్ల ప్రణయం బహుచిత్రంగా ఉండేది. ఆమెకు అంతలో కోపం వచ్చేది. అంతలో జాలి కలిగేది, అంతలో కామోద్రేకం కలిగేది అంతలోనే విరక్తి కలిగేది! ఆమె వాణ్ని ఆధారం చేసుకుని కామతృప్తి కలిగించుకున్నప్పు డైనా ఆమె మోహం పగసాధనగా ఉండేదే కాని ప్రేమ

మాదిరిగా ఉండేది కాదు. ఆమె తనను ఆలింగనం చేసుకున్నా, చెంపమీద కొట్టినా, తనతో గంటలకొద్ది మాట్లాడకుండా కూర్చున్నా. గంటలతరబడి తనతో సోది చెప్పినా అర్జునుడికి తేడా లేనట్టే ఉండేది. ఆమె వికారాలు అర్జునుడి ఆత్మలో ఎటువంటి చైతన్యమూ కలిగించలేక పోయేవి.

అదీకాక అర్జునుడి ప్రాణం ఆ పాములవాడి కూతురు ఆ గుడ్డిపిల్లమీద ఉంటూ వచ్చింది. దాన్ని వాడు చాలా పసితనం నుంచీ ఎరుగును. వాడి జన్మకు ప్రణయం అదే. అది పాపం, కళ్ళులేని పిల్ల. దాన్ని చూసినప్పుడు ఎవరి గుండె కాని కరగకుండా ఎట్లా ఉంటుంది? అది ఎవర్నీ ఒక పౌరుష మైన మాట అని ఎరగదు. దాని చెయ్యి పట్టుకుని చెట్ల మధ్యగ నడిపించటం కన్న ఆనందం ఏమిటో అర్జునుడు ఊహించలేకపోయినాడు. నువ్వు ముళ్ళకంచెల్లోకి తీసుకు పోయినా ఒప్పుకున్నదానికి నీకు దగ్గర మనిషి ఎవరు? నువ్వు తనకు ఎటువంటి ఆపదా కలక్కుండా కాపాడతానని మన స్ఫూర్తిగ నమ్మటంకంటె ఆడది నిన్నెట్లా ప్రేమించగలదు? నువ్వు వెళ్ళిపోతానంటే అది చేతివేళ్ళతో నీ మొహం తడివి, వర్ణించటానికి వీల్లేని విషాదకరమైన నవ్వొకటి నవ్వి మళ్ళీ ఎప్పుడొస్తావు అని అడిగితే నీ ప్రాణం ఎలా తటతట లాడుతుంది? ఏ మనిషికాని గుడ్డిపిల్లకోసం ప్రాణాలిచ్చినట్టు రెండు కళ్ళున్న మనిషికి ప్రాణం ఎలా ఇవ్వగలడు?

మంత్రిగాడి బానిసత్వం వల్ల తన ఆత్మకు గలిగే బాధకు గుడ్డిపిల్ల సాహాసమే విరుగుడనిపించింది అర్జునుడికి.

మంత్రగాడికూతురు అర్జునుణ్ణి అనుమానించసాగింది. వాడు ఉన్నట్టుండి మాయమై జాములతరబడి కనిపించక, ఎక్కడినించో చాటంత మొహంతో ప్రత్యక్షమవాతాడు. వాడి మొహం అట్లా వికసించి వుండటంచూస్తే దానికి మండిపొయ్యేది. వాడి ఇష్టంలేకుండా వాడివల్ల తను ఆనందం పొందటమే ఆపిల్ల కెక్కువఇష్టం. వాడిమొహాన కొంచెంగా సంతోషవచ్ఛాయ కనిపిస్తే దానికి వాడిమీద చెప్పరాని అసహ్యం పుట్టేది.

వీడెక్కడికిపోయి ఏంచేస్తున్నదీ ఆరాతియ్యాలని మంత్రగాడి కూతురుకు బాగాస్పట్టింది అది త్వరలోనే గుడ్డి పిల్ల రహస్యం కాస్తా తెలుసుకున్నది.

“నువ్వు గుడ్డిపిల్లను చూడటానికి మళ్ళీవెళ్ళు చెబుతాను” అన్నది మంత్రిగాడి కూతురు.

అర్జునుడు దానికేసి వింతగా చూసి జవాబివ్వలేదు.

“ఈసారి మళ్ళీ దానిదగ్గిరికి పోతావా?” అన్నది మంత్రగాడి కూతురు మళ్ళీ

“పోతాను. ఏంపోతే?”

“పోయి దానితో ఏంచేస్తావు?”

మాట్లాడుతాను. దాన్ని చెయ్యిపట్టుకునినడిపిస్తాను.”

“నన్నిప్పుడు చెయ్యిపట్టుకుని నడిపించు.”

మారుమాటాడకుండా అర్జునుడు దాన్ని చెయ్యిపట్టుకుని నడిపించసాగాడు. అది అంతలో బుద్ధి చలించి,

ఎంతో వికారంపుట్టించే ఆపేక్షతో "నన్నిట్లా నడిపిస్తుంటే నీకు చాల సంతోషంగా లేదూ?" అన్నది.

"లేదు" అన్నాడు అర్జునుడు సంగ్రహంగా.

మంత్రగాడికూతురు చర్రున కోపం తెచ్చుకుని "ఆ గుడ్డిముండను పట్టుకుంటే ఉండే ఆనందం నన్నుపట్టుకుంటే నీకెందుకు లేదు?" అని అడిగింది

"ఏమో నిన్ను పట్టుకు నడిపించడం అర్థంలేదు. నీకు కళ్ళున్నైగా!" అన్నాడు అర్జునుడు.

"నువ్వింక గుడ్డిదాన్ని చూడటానికి వీలులేదు, అది నా ఆజ్ఞ. మానాన్న సిపాయిలనుంచి రక్షించాను నీప్రాణమూ శరీరమూ అన్నిమావి!"

దాని నోటివెంట ఆమాట వింటుంటే అర్జునుడికి చెప్పరాని అసహ్యం వేసింది. అవన్నీ తను అందించిన ముక్కలే.

"ఆజ్ఞ అయితే ఎదన్నా పని చెయ్యమనాలి. ఏమీ చెయ్యవద్దనటం ఆజ్ఞకాదు," అన్నాడు అర్జునుడు.

"ఆజ్ఞే?"

"కాదు."

"అయితే నువు గుడ్డిదాని దగ్గిరకిపోయి సుఖంగా ఉండు, అని నన్ను ఆజ్ఞాపించమన్నావా?"

"నీతో వాదించి ఏం లాభం?"

"ఇంక సిక్కులెంత నెత్తికొచ్చినై. ఎటువంటి పాపిష్టివేళ

నీశవం నా కంటబడ్డదో గాని, ఛీ, నీమొహం చూస్తేనే అన్నం వెళ్ళుకొస్తుంది. ఫో, నాయెదట్నించి" అని మంత్ర గాడి కూతురు ఈసడించుకున్నది.

తనకూతురు చెప్పిన చాడీలన్నీ విన్నమీదట మంత్ర గాడికి మహాకోపం వచ్చింది వాడు అర్జునుణ్ణి పట్టుకుని ఝూడించేశాడు

"నేను నీ ప్రాణదానం చేశానని నీకింకా కృతజ్ఞత ఉన్నదనుకున్నాను. నీఅంత కృతఘ్నుణ్ణి నేనెక్కడా చూడ లేదు. నీకు నా విద్యలన్నీ చెప్పి నా అంతవాడిని చేద్దామను కున్నందుకు నాకూతుర్ని ధిక్కరించి మాటలాడతావా? ఇంత అహంకరించి మాటలాడటానికి నీ కూపిరి పోసిం దెవర్రా?" అని అడిగాడు మంత్రగాడు.

అర్జునుడి గుండెలవిసినై. కొంతకాలం బానిసత్వంలో ఉన్నమీదట వాడి మనోదార్ఢ్యం మట్టికొట్టుకుపోయింది. కాని వాడి అంతరాత్మ ఇంకా బొత్తిగా చచ్చిపోలేదు.

"మీరు నన్ను బ్రతికించినప్పుడు ప్రాణంకన్న ఎక్కు వయింది లేదనుకున్నాను. ఇప్పుడుచూస్తే అన్నీ ప్రాణం కన్న ఎక్కువగానే కనిపిస్తున్నై. నావాళ్ళు ... నన్ను చిన్నప్పు డెత్తుకుని ఆడించినవాళ్లు... నాకు రోగంవస్తే సేవ చేసినవాళ్ళు నా మూలంగా సుఖమంటే ఏమిటో మరిచి పోయినారు. ఇదేనా నాప్రాణంఘనత? నాప్రాణం రక్షించా మంటున్నారు. దానివల్ల నాకు బాధేగాని సుఖంకలగలేదు. నాప్రాణంతో మీ కేమన్నా ప్రయోజనముంటే ఈక్షణం

పుచ్చుకోండి. లేదా నన్ను ఆ రోజున కనికరించే ప్రాణం రక్షించారు గనక, అట్లాగే కనికరించి ఇప్పుడు నన్ను వెళ్ళి పోనివ్వండి. నేనెంత ప్రయత్నించి ఏంలాభం? మీరుణం ఎట్లాగూ తీర్చుకోలేను" అన్నాడర్జునుడు దైన్యంతో.

మంత్రగాడు చప్పున తన వైఖరిమార్చి "పిచ్చివాడా, నేను నిన్ను కనికరించకనా? నీమంచికోసమే చెబుతున్నాను. నువ్వు పొగరుగా ప్రవర్తిస్తున్నావని కోప్పడ్డానుగాని నీకు బాధ కలిగించటంకుటుకు నా ఉద్దేశ్యమా? నువ్వెక్కడికీ పోనక్కరలేదు, నాదగ్గిరే వుండు" అన్నాడు. తెగేదాకా లాగటం మంచిదికాదని వాడెరుగును.

ఆరోజు సాయంకాలం మంత్రగాడి కూతురు తండ్రి ఏం బోధించాడో ఏమో, అర్జునుడితో చాల మంచిగా "నా మొహం ఎటువంటిదో నువ్వెరుగవుకదా! నువ్వు చచ్చినట్టు పడివుండటం చూచినప్పుడే నిన్ను మోహించాను" అన్నది.

ఆముక్కలు పదేపదే స్మరించుకుంటూ పడుకున్న అర్జునుడికి అర్థరాత్రివేళ వాటి అంతరార్థం బోధపడింది. పాముకాటుకు తను వికారంగా అయిపోలేను. పాము విషం తన ఒంట్లో ప్రవేశించనేలేదు నిజంగా పామువిషంతో చచ్చినవాణ్ణి ఏ ఆడది మోహిస్తుంది? ... దొంగముండా కొడుకు. తనకు ప్రాణదానం చేసినట్టు నటిస్తున్నాడు. తను ఎటువంటి మాయలో చిక్కాడూ? ఈ మంత్రగాడ్ని ఇక్కడే

ఉం చెయ్యటం తనవాళ్ళకెంత ఉపకారమనుకున్నాడూ? ఆ ఉపకారం ఎందుకు లభించలేదో తన కిప్పు డర్థమయింది.

ఇప్పుడు తన ధర్మం ఏదో అర్జునుడికి తెలిసివచ్చింది. తనవాళ్ళకి మంత్రగాడి పీడ వదిలించే బాధ్యత తనమీదే ఉంది...

అర్థరాత్రివేళ "మామా, మామా" అనే పిలుపు వినిపించి పాములవాడు బయటికొచ్చి అర్జునుణ్ని చూసి ఆశ్చర్యపోయినాడు.

"నువు నిన్నపొద్దున పట్టిన కోడెతాచొకసారి ఇయ్యి మామా" అన్నా డర్జునుడు.

పాములవాడు అర్జునునివంక ఒకక్షణం ప్రశ్నార్థకంగా చూసి లోపలికిపోయి బుట్టతెచ్చి ఇచ్చాడు.

అర్జునుడు బుట్టచంకన పెట్టుకుని తిరిగి మంత్రగాడి ఇంటికివచ్చేశాడు. మంత్రగాడు గుర్రుపెట్టినిద్రపోతున్నాడు. అర్జునుడు చేతిలో ఉన్న బుట్ట ఎత్తుగా పట్టుకుని పైమూత మెల్లిగా తీసి పామును అంత ఎత్తునుంచి మంత్రగాడి మెడ మీద పడేటట్టు జార్చి చప్పున బుట్ట దూరాన చెట్లలోకి విసిరేశాడు.

మరుక్షణం మంత్రగాడికి మెళుకువొచ్చింది. ఏం జరిగిందీ వాడు తెలుసుకునేలోపుగా పాము మెడమీదా, విదిలించబోతే చేతిమీదా కాట్లేసింది.

"పురుగు,పురుగు" అని గట్టిగా కేక వేశాడు అర్జునుడు కర్ర తీసుకుని పారిపోతున్న పాము వెంట పడి బాదుతూ.

"ఏమిటది?" అన్నాడు మంత్రగాడు.

"ఇంకానయం - కాటెయ్యలేదు !" అన్నాడు అర్జునుడు.

మంత్రగాడు ఖంగారుగా లేచి కూర్చుంటూ "కాటేసింది, కాటేసింది" అన్నాడు.

"కాటేస్తేమాత్రమేంలే! నువు పాముకాటుకు చావవుగా! ఎంతఅదృష్టం" అన్నా డర్జునుడు పామును చంపేసి ఈడ్చిపారేస్తూ.

కాని మంత్రగాడిమొహం అంతలోనేవివర్ణమయింది. వాడు గిజగిజా తన్నుకోసాగాడు.

ఈ అలజడికి లేచివచ్చిన మంత్రగాడి కూతురు తండ్రిని చూసి లబలబ లాడసాగింది.

"అన్నీ తెలిసినవాడే అల్లాడిపోతున్నాడు. పురుగు ముట్టింది. ఖర్మచాలకపోతే ఇంతే - ఏ మంత్రాలూ అడ్డుపడవు, పాపం ఎంత హైరాన పడుతున్నాడో... అయిపోయింది" అన్నా డర్జునుడు.

వాడు తన గొంతులో ఉన్న ఆనందాన్ని దాచటానికి ప్రయత్నమూ చెయ్యలేదు.

మంత్రగాడి కూతురు చర్రున ఎక్కణ్ణించో పొట్టి బాకు తీసి చెయ్యి పైకెత్తింది.

"ఆ! ఆ! అంత తొందర పనికిరాదు" అంటూ అర్జునుడు దాని చెయ్యి పట్టుకున్నాడు.

"అట్లా పెనుగులాడకు, సుకుమారి ప్రాణానివి. తగలరానిచోట మొన తగిలితే తరవాత అనుకుని లాభం లేదు. కత్తివిడిచెయ్యి." అని అర్జునుడు హితం చెపుతున్నా వినక మంత్రగాడి కూతురు తన చెయ్యి చీరుకుపొయ్యేదాకా పెనగులాడింది.

అంతటితో ఆ ప్రాంతాల మంత్రగాడి పీడ అంత మయింది. గుడ్డిదాన్ని పెళ్ళిచేసుకుని అర్జునుడు సుఖంగా ఉన్నాడు.



# అహింసాప్రయోగం

పుణ్యప్రదేశ్ లో డాక్టర్ జీవకారుణ్యం ఎం. ఏ. డి. ఎఫ్. ఆర్. ఏ. (యూ. డీ.) గారి నెరగనివారు లేరు. "సాధు ప్రకృతి" ఆయన రచించిన ప్రసిద్ధగ్రంథం అందులో ఆయన చాలా శాస్త్రీయంగా నిరూపించిన దేమంటే, గ్రహాలు సూర్యుడిచుట్టూ తిరగడంలోగాని, రేడియో తరంగాలు గాలిపొరనుదాటి చంద్రమండలాన్ని తాకటంలోగాని ఎటువంటి హింసా ప్రక్రియగాని లేదు; సముద్రంలో అలలు అహింసాయుతంగా లేస్తాయి, అగ్నిపర్వతాలు నిప్పులు కక్కటం పిడుగుపడటం, తుపానులు గావటం, భూకంపాలు కలగటం మొదలైన వాటికన్న భయోత్పాదనకరమైన ప్రకృతి స్వభావం మనం కనలేం; మానవుడు అనేకశక్తులను హస్తగతం చేసుకున్నాడు – ఆవిరిశక్తి, విద్యుచ్ఛక్తి, ఇప్పుడు పరమాణుశక్తి, అణువు బాంబు పేలటంలోకూడా హింస ఏమాత్రమూ లేదు. అయితే వీటివెంట మనం కాక తాళీయంగా హింసను చూస్తున్నాం. మతిస్థిమితం చెడిపోయి

తనను శత్రువులు తరుముతున్నారని భ్రమిసినవాడు ఆరో అంతస్తు కిటికీలోనుంచి కిందపడి చచ్చిపోతున్నాడు. తప్పు భూమ్యాకర్షణదికాదు. అట్లాగే హిరోషిమామీద అణువు బాంబు వేసినప్పుడు ఆనగరంలో ఎవరూ లేకుండాఉంటే హింసే జరిగేదికాదు. హైడ్రోజన్ బాంబు వెయ్యడాన్ని హింస అని సిద్ధాంతరీత్యా ఎవరమూ అనలేము. అది పేలే చోటికి వందమైళ్ళ దూరంలో ఉండేవాడు హింసాచరణకు కారకుడౌతాడు—అంతే!

"సాధు ప్రకృతి"లో ఉండే అమూల్య విషయా లన్నిటిని ఇక్కడ చెప్పటం సాధ్యంకాదు. అది 1116 పేజీల గ్రంథం, ఖద్దరుబైండు, దాన్ని అమెరికాలో జనరల్ నట్స్ దగ్గరనుంచీ, ఆఫ్రికాలో జనరల్ స్మట్స్ దాకా ఎంతోమంది కీర్తించారు. ఈ గ్రంథం రాసినందుకు ప్రభుత్వం డాక్టరు గారికి అవక్రచక్ర బిరుదం మొదటి తరగతి ఇవ్వడమేగాక "సాధుప్రకృతి" తాలూకు ఒక లక్షకాపీలు అచ్చు వేయించింది. అన్ని పేవ్‌మెంట్లమీద కాపర్ వెయిట్ ధరకు దొరుకుతుంది.

కాని "జంతుబలి" అన్న అధ్యాయం గురించి కనీసం రెండు ముక్కలు చెప్పడం కథకుడి విధి. అధ్యాయంపేరు "జంతుబలి" అని ఉన్నప్పటికీ అందులో చెప్పిన విషయాలు కేవలం రోగక్రిములకు సంబంధించినవి. రోగకారకాలైన క్రిములను కనిపెట్టడమూ, వాటినిగురించి పరిశోధనలు

చెయ్యటమూ, క్రిమి విధ్వంస ఔషధాలూ, ప్రత్యేకించి ఆంటీ బయాటిక్ ఔషధాలూ, అవి చేస్తున్నపనీ మొదలైన అంశాలమీద సంగ్రహంగా 1-3 పేజీలలో చెప్పబడివుంది. అణువు బాంబుకన్న మైక్రోస్కోపు ఎక్కువ గొప్ప మారణాస్త్రమని డాక్టరుగారు యుక్తియుక్తంగా రుజువుచేశారు. "ఈ క్రిములనుగురించి పరిశోధించుటలో బహుళముగ జీవహింస జరిగెను. ప్రయోగముల ఫలితముగ అనేకమంది చచ్చెను ఇట్టి హింసాయుత ప్రయోగముల మూలమున కనిపెట్టిన చికిత్సలు హింసగాక మఱి యేమనిపించుకొనునో నాకు తెలియకున్నయది" (తెలుగు తర్జుమా పుట 822 చూడండి.)

"భగవంతుని దృష్టియందు పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రాణులన్నియు నొక్కటియే. క్షయక్రిములను, సన్నిపాతక్రిములను చంప మానవునకు నధికార మెవరిచ్చిరి? అది యెప్పుడు వచ్చెను?" అని ఈయన ప్రశ్నించాడు. "కమ్యూనిస్టులతో సహజీవనము అదెంత దుస్సాధ్యమైనను యత్నింపవలెనని మన మహానాయకులు వేనోళ్ళ వక్కాణించెను. అది సరియే, కాని ఈ సూక్ష్మక్రిములతో సహజీవనము సాధ్యముకాదా? శరీరములయందు క్షయక్రిములు గల వారందరూ క్షయవ్యాధితో తీసుకొనుచున్నారా? లేదే? హానిని నివారణముచేయు ప్రయత్నమేల చేయవలెను?"

హనుమంతుడు, మార్కండేయుడు మొదలైన చిరం

జీవులు పెనిసిలిన్ ఇంజెక్షనులు ఎన్నడైనా పుచ్చుకున్నారా? అని ఈయన అడిగాడు. పుచ్చుకోలేదని తానే సమాధానం చెప్పాడు. మద్యపానం, పొగతాగుడు, కాఫీ మొదలైన దురభ్యాసాలద్వారా పిల్లలూ పెద్దలూ, స్త్రీలూ పురుషులూ "రోగకిృములు నోసంగు వానిని" శత్రువులుగా చేసుకుని, వాటితో సహజీవనంచేసే శక్తిని కోల్పోతున్నారని ఈయన వక్కాణించాడు. ఇక్కడ ఒక చిన్న ఫుట్‌నోట్ ఇచ్చి, సూక్ష్మక్రిములు పుణ్యప్రాణులనీ, అవి భగవంతుడికి సన్నిహితంగా వున్నాయనీ, మనిషి కష్టపడి నేర్చుకోలేని సద్వర్తన వాటిల్లో సహజంగా ఉన్నదని వ్యాఖ్యానించాడు. మనుషులు ఆనందంతో సేవించే సారా, పుగాకు, కాఫీ మొదలైన విషాలు ఈ క్రిములకు పడకపోవటం ఆశ్చర్యకరమన్నాడు.

డాక్టర్ జీవకారుణ్యం అచ్చగా శాస్త్రవిజ్ఞానికుడే గాక, తన సిద్ధాంతాలమేరకు గొప్ప సంఘశాస్త్రవేత్త, రాజకీయవేత్తకూడానూ. తన ఉద్గ్రంథానికి అనుబంధంగా ఆయన ఎన్నో చిల్లరవ్యాసాలు రాసి ఎన్నో మల్లర పత్రికల్లో వేశాడు, వీటిని మేధావులంతా పరిశీలించారు. కొందరు దుర్మార్గులైన రచయితలు డాక్టర్ జీవకారుణ్యం గారిని ఏకేస్తూ పత్రికల్లో – దుర్మార్గమైన పత్రికల్లో – రాయటం జరగకపోలేదు. కాని దేశంలో హింసావాదులున్న మాట తెలియనిదికాదు. "నేపాల్మ్ బాంబుల్లో హింస వుందా?" అన్న తనవ్యాసాన్ని హింసావాదులు చించి చెండాడా! "అణ్వస్త్రాలే ఎక్కువ అహింసాయుతమైనవి.

అన్న వ్యాసాన్ని బండబూతులు తిట్టారు. తనను "యుద్ధో న్మాది" అన్నారు. సాంఘిక హింస యావత్తూ పేదవాళ్ళ మూలంగా కలుగుతున్నదని నిరూపించినప్పుడు తనను వాళ్లు "కోటీశ్వరులతొత్తు" అన్నారు. వాళ్ళ భాషలోనే ఎంత హింస అయినా ఉంది. ఈ విషయాలు డాక్టర్ గారికి తెలియనివికావు.

కాని ప్రజాసామ్యం తనవెంట ఉన్నారనే విషయం జీవకారుణ్యం గారు కలలోకూడా సంశయించలేదు తన గ్రంథాన్ని సమీక్షిస్తూ ఒక విమర్శకుడు, "తలకింద దిండును నోచుకోనివారంతా తప్పక దగ్గర ఉంచవలసిన గ్రంథం" అన్నప్పుడు డాక్టరుగారు చాల సంతోషించారు. నిజంగా తన గ్రంథం పామరులకోసమే రాశాడు. ప్రొఫెసర్ ఐన్‌స్టయిన్‌లాంటి వాళ్ళు చదవటానికి ఎంతమాత్రం కాదు.

కాని "ప్రేమమైదాన్"లో తను మీటింగు పెట్టి మాటలాడినప్పుడు డాక్టరు గారికి పెద్దగా కనువిప్పయింది. ఆ మీటింగుకి అత్యధిక సంఖ్యలో వచ్చినవారు. విద్యార్థులూ కార్మికులూనూ. వాళ్ళు తను చెప్పేది మొదటి నుంచీకూడా సరిగా వినలేదు. వారి హృదయాలలో ఉండే వైషమ్యం కొద్ది సేపటికల్లా ఆయన అవగాహన చేసుకున్నాడు. మీటింగు పూర్తిగా అభాసయింది. శ్రోతలు రెండుపక్షాలై కొట్టుకున్నారు. ఇద్దరు ముగ్గురుకంటె చావలేదు. ఓ వంద మందికి గాయాలు తగిలాయి. పోలీసులను పిలుస్తామంటే

డాక్టరుగారు వద్దన్నాడు. దీనినికూడా తెప్పుడువ్యాఖ్యానం చేసిన వాళ్ళున్నారు. అదెలా జరిగిందంటే తరువాత అంచనా వేయగా, దెబ్బలు తిన్నవాళ్ళలోనూ, చచ్చినవాళ్ళలోనూ «మెజారిటీ» హింసావాదులదే! ఎవడో హాస్యగాడన్నట్టు దొమ్మీల్లో వాళ్ళదే "గెలుపు"... అందుకే తాను పోలీసులను పిలవవద్దన్నట్టు వ్యాఖ్యానించారు.

సరిగా ఇటువంటి అనుభవమే డాక్టరుగారికి కొరియా యుద్ధమప్పుడు జరిగింది. ఎవరో కొందరు ఆయనవద్దకు వచ్చి ఒక అప్పీలుమీద సంతకం పెట్టమన్నారు. కొరియాయుద్ధం నిలుపుచెయ్యాలన్న అప్పీలది ఆయుద్ధం ఎవరుప్రారంభించారో నాకు తెలీదు. యుద్ధంలో ఎవరికి ఎక్కువ హింస జరుగుతున్నదో నాకు తెలీదు. ఎట్లా సంతకంపెట్టను!" అని అడిగాడు. «తామే ఎక్కువ హింస చేస్తున్నట్టు అమెరికావాళ్లే చెబుతున్నారుగదా? అన్నారు వాళ్లు «వాళ్లు ప్రగల్భాలు చెప్పుకుంటారు. యుద్ధంలో ఎవరూ తమ నిహతుల సంఖ్య బయటపెట్టరు" అన్నాడు అతను. "యుద్ధోన్మాదుల భృత్యుడు!" అని తనపై వ్యాఖ్యానించారు.

మీటింగు అనంతరం పత్రికా విలేఖరులతో మాటలాడుతూ డాక్టరుగారు. "మీటింగు భగ్నమయినందుకు నాకు విచారంలేదు. భావిపౌరులైన విద్యార్థులూ, దేశానికి వెన్నుపూసలాటి కార్మికులు ఈ పుణ్యప్రదేశ్‌లో ఇంకా హింసామార్గం అవలంబిస్తున్నారంటే నా కెంతబాధగా ఉందో చెప్పలేకుండా ఉన్నాను. ఒక విద్యార్థి నాలో

మూడవవంతు వయసుకుకూడాలేదు – లేచి నిలబడి, "బుద్ధుడేమన్నాడు?" అనిఅడిగాడు!...వీళ్ళను నేను తప్పుపట్టను. వీళ్లు మరొకరి చేతిలో కీలుబొమ్మలు, వాళ్లు అసలైన రాక్షసులు. వాళ్లు భగవంతుడితోబాటు ఆస్థి హక్కులనుకూడా ఉద్వాసన చెప్ప యత్నిస్తున్నారు. జమిందార్లమీద రైతులను ఉసికొల్పి, కాల్పులకు దారి తీసి రక్తపాతం కలిగించారు. మిల్లులలో కార్మికులచేత సమ్మెలు చేయించి పోలీసు కాల్పులద్వారా రక్తపాతం కలిగించారు" అన్నాడు.

"పెట్టుబడిదారీ, భూస్వామ్య విధానాలు హింసాయుతమైనవన్న విషయంలో మీ అభ్యంతరం ఏమిటి?" అని ఒక విలేఖరి అడిగాడు.

"శుద్ధ అబద్ధం!" అన్నాడు జీవకారుణ్యంగారు.

"కార్మికులు, రైతుకూలీలు తిండికి మాడుతున్నమాట అబద్ధమా?"

"మీరు పొరబడుతున్నారు. కడుపునిండా తినకపోతే కోటీశ్వరుడైనా మాడతాడు. అది ప్రకృతి నియమం. నా "సాధుప్రకృతి" చదవండి. ప్రకృతిలో హింస ఏమీలేదు" అన్నాడు డాక్టరుగారు.

"దేశంలో హింస జాస్తి అవుతున్నదన్నారుగదా! అది అరికట్టి, ప్రజలు హింసావాదుల కీలుబొమ్మలు కావడానికి బదులు అహింసావాదుల చేతుల్లో కుమించాలి,

కీలుబొమ్మలుగా ఉండేలాగు చెయ్యటానికి ఏమైనా ఆలో చిస్తున్నారా?" అని ఇంకో విలేఖరి అడిగాడు

"ఏదో ఒకటి చెయ్యవలసిన అవసరాన్ని నేను గుర్తించకపోలేదు. త్వరలో సాధారణ ఎన్నికలు వస్తు న్నాయి. అందుచేత కొన్ని ప్రయోగాలు చెయ్యబోతు న్నాను. వాటి ఫలితాలను మీరంతా కళ్లచూద్దురుగాని, దేశంయొక్క భవిష్యత్తు, అహింసయొక్క భవిష్యత్తు ఈ ప్రయోగాలపై ఆధారపడి ఉందని నేనంటే మీరు దాన్ని ఎంత మాత్రమూ అతిశయోక్తిగా భావించవద్దు."

అంతే_ఆతరవాత నాలుగు రోజులకే పేలుడు జరిగింది. శాస్త్ర పరిశోధనా చరిత్రలో అటువంటి పేలుడు దాదాపు అపూర్వమనే చెప్పాలి. ఆ పేలుడుకు అనేకవందలమంది చచ్చారు. అనేక వేలమంది గాయపడ్డారు. హింసాపత్రికల్లో చచ్చినవారి ఫొటోలుకూడా వేసి ప్రచారానికి వినియో గించుకున్నారు. పేలుడుగురించి బహిరంగ విచారణ చెయ్యాలని పార్లమెంటులో ప్రశ్నలువేశారు. "ఇంకా వేడి జాస్తీగావుంది. కొంచెం అది తగ్గాక తప్పక అట్లాగే విచా రణ చెయ్యవచ్చు" అని మంత్రిగారు సమాధానం చెప్పారు.

విలేఖరులు డాక్టరుగారిని చూడబోయారు. ఆయన తలకూ, చేతికీ కట్లున్నాయి.

"నేను చేసింది చాలానిర పాయమైన ప్రయోగం.ఒకఅర తులం భాషారాష్ట్రసమస్యా,అర్థశేరు అసత్యమూ, అర్థశేరు

అహింసా నెచ్చబెట్టికలపటానికియత్నించాను. మొత్తంపేలింది సత్యంలో పరమాణువు కన్న ఎక్కువ శక్తి ఉందని నాకు తెలుసు. కాని చెయిన్ రియాక్షన్ గాకుండా రిటార్ట్ చెయ్యటానికి అహింస వేశాను. అయినా పేలింది. జనం చచ్చినందుకు నాకు విచారం లేదు. పేలుడు జరిగినప్పుడు సమీపంలో ఉండేవాళ్లు ఒక్కొక్కప్పుడు చస్తారు. నేను ఎంతోదూరాన ఉండికూడా గాయపడ్డాను. కాని వచ్చే ఎన్నికల మాటేమిటని? అంటూ డాక్టర్ జీవకారుణ్యం ఏం. ఏ. డి., ఎఫ్. ఆర్ ఏ. (యూ. డీ.) గారు పెద్ద నిట్టూర్పు విడిచారు.

---

# సోదరి క్షేమం

తనకూ సుభద్రకూ పెళ్ళయినట్టే భావించుకుంటూ వస్తున్నాడు శోభనాద్రి. వెధవది మనలో ఎంగేజిమెం టంటూ ఉడకపోబట్టికాని తనూ సుభద్ర పెళ్ళికావటానికి ఎంగేజి అయివున్న వాళ్ళల్లో లెక్కే-మరి!

"నన్ను పెళ్లాడతావా?" అని శోభనాద్రి నోరు చేసుకుని సుభద్రనింకా అడగలేదనుకోండి. ఐనా తను అడగ టానికి రూఢిచేసుకున్నట్టేగా, తను అడగటం వ్యవధిగా సుభద్ర. "ఎప్పుడు మనపెళ్ళి" అంటుందనే విషయంకూడా రూఢైనాయెను.

ఎంచేతనంటే తను సుభద్ర నెంతగా ప్రేమిస్తున్నదీ ఆమెకు తెలుసునని తనకు తెలుసు. లేకపోతే తన సాటి కుర్రవాళ్లెవరితోనూ నిలబడి క్షణం మాటలాడటానికి ఒప్పు కోని సుభద్ర తనతో గంటల తరబడి ఉత్సాహంగా ఎందుకు మాటలాడుతుందీ? తన అన్నల వెంటకూడా బయటికి షికారు వెళ్ళని మనిషి తనవెంట సినిమాల కెందుకు బయ

ర్ధేరుతుందీ? తన సొంతపనులు చేసుకోవటంలో బధకించే మనిషి తనకు మంచినీళ్ళో, వక్క పొడో కావాలంటే చివాలున ఎందుకు లేస్తుంది ?

తనను పెళ్ళాడమని సుభద్రను తనడుగుట మెంత తథ్యమో, ఆమె ఒప్పుకోవడమూ తథ్యమే. కాకపోతే తను నోరుచేసుకుని ఆ మాట పైకనటం అక్కే ఉండిపోయింది. పోతేనేం? ఒకసారి తమ వివాహం స్థిరమయిందో తమమధ్యవున్న ఈ ఉత్సాహమూ స్వేచ్ఛా సన్నగిల్లుతై. నా కాబోయే భార్యా, నా కాబోయేభర్తా అనే ఆలోచనలు మాటి మాటికీ అడ్డొచ్చి తమని తాము మరచిపోలేకుండా చెయ్యటం కలుగుతుంది. ఎందుకొచ్చింది. ఇంకా ఆర్నెల్లు. ఈ మార్చితో తన డాక్టరు చదువూ సుభద్ర ఇంటర్ చదువూ రెండూ పూర్తయిపోతై. ఈ ఆర్నెల్లూ ఓపికపడితే అప్పుడే పెళ్ళి సెటిల్ చేసి, వెంటనే ముహూర్తం ఏర్పాటు చేసుకోవచ్చు. అందాకా — ఈ ఆర్నెల్లూ — ఈ అవ్యాజానందం అవిచ్ఛిన్నంగా పొందుతూ ఉండొచ్చు.

ఈ అవ్యాజానందంలో ఓ భాగం వారఫలితాలు తెలుసుకోవటంగా ఉంటూ వస్తున్నది. ఓ నెల్లాళ్ళక్రితం ఓ వింతసంగతి బయటపడింది. సుభద్రదీ శోభనాద్రిదీ ఒకే తులాలగ్నం—జన్మనక్షత్రం ఓటికాదుగాని, లగ్నం ఫలితాలు చూసుకునేప్పుడు తమరిద్దరూ కలిసే చూసుకోవచ్చు. అవి ఎట్లా ఫలించిందీకూడ కనుక్కోవచ్చు.

జోస్యమూ, ప్రశ్నలూ, సంవత్సర మాస వార ఫలితాలూ-ఇదంతా వొట్టి మూఢనమ్మకమని తాను అదివరలో ఘంటాపథంగా చెప్పినవాడే, వాటిల్లో విశ్వాసం ఉన్నవాళ్ళతో పోట్లాడినవాడే, కాని ఇప్పుడు తల్చుకుంటే ఆరోజుల్లో తను నాగరికతలేకుండా ప్రవర్తించినట్టుగా కనిపించేది. ఈ మూఢవిశ్వాసం విషయంలో సుభద్ర శోభనాద్రికి నాగరికత నేర్పింది. ఆమె వైఖరి ఏమంటే ఆమెకు జోస్యంలో నమ్మకంలేనట్టు ఉండేది. ఉన్నట్టు ఉండేది. జోస్యంలో పూర్తి నమ్మకం కలవాళ్ళమీద ఎగిరిపడటుగా శోభనాద్రి సుభద్రమీద ఎగిరిపళ్ళేకపోయినాడు ఎట్లాగయినా నాగరికత గొప్పపదార్థం! శోభనాద్రికూడా సుభద్ర నాగరికత అవలంబించి జోస్యంలో ప్రత్యేకించి వారఫలితాలలో-విశ్వాసం ఉందో లేదో తెలిసికుండా ప్రవర్తించసాగాడు.

వారఫలితాలతో చిక్కేమిటంటే అవి దబ్బునరుజువు కావు. సిద్ధహస్తుడైన హంతకుడి మర్మాలమల్లే వాటిని కష్టపడి రుజువు చెయ్యాలి. అటువంటి హంతకుణ్ని పట్టుకునే పత్తేదారుకిచ్చినట్టు వాటికి, నిజం కావటానికి, చాలా టైమివ్వాలి. వారఫలితాలలో ఆసక్తి తెచ్చిపెట్టుకోటం ఒక శిల్పమని చెప్పొచ్చు.

ఆ శిల్పాన్ని శోభనాద్రి కష్టపడి సంపాదించాడు. సుభద్ర అతనికీ విషయంలో చాలా సహాయకారి అయింది. అదంతా చాలా బాగానేవుందిగాని శోభనాద్రికిప్పుడు

కొత్తగా ఒక సమస్య ఏర్పడింది. నాగరికత ఎప్పుడూ ఇటు వంటి చిక్కులే తెచ్చిపెడుతుంది. నీకు జోస్యంలో నమ్మకం ఉందీ లేందీ పైకి తెలీరానీకుండా ప్రవర్తించటం తేలికే;గాని అందులో నమ్మకం ఉండీ లేనిస్థితిలో ఉండటం కష్టం. "నీకు జోస్యంపిచ్చి ఉన్నట్టా, లేనట్టా? ఎటో ఓ అటు తేలి చావ్వేం?" అని నీలోఉన్న ప్రోలిటేరియన్ అంతరాత్మ నిల దీసి అడుగుతుంది.

దానికి సమాధానం చెప్పాలిపొస్తే శోభనాద్రిదిక్కున పడ్డాడు. జోస్యం పిచ్చిలేకపోతే ప్రతిసారి వారఫలితాలు చూడటం దేనికి? అయితే మరి తనకు జోస్యంపిచ్చివుందా? ఈ వారఫలితాలు పొరపాటునైనా నిజమయి చూడవ్వు. ఎట్లా?

ఆడది కావటంవల్లనో ఏమో సుభద్రకి ఇబ్బంది లేక పోయింది. ఆమె ప్రతివారమూ అధమం రెండు పత్రికల్లో వారఫలితాలు చూసేది. అవి తనకు మంచిసూచిస్తే నిర్లిప్తంగా సంతోషం కనబరిచేది. కష్టంసూచిస్తే ఉత్సాహంగా విచారపడేది. చివరకు వారాంతానికి ఈ జోస్యం నిజమయిందా లేదా అనిచూసుకోనైనా చూసుకునేదికాదు. ఇంకా శోభనాద్రి, దారితప్పి తనకు సంబంధించిన జోస్యం నిజమైనప్పుడు, నలుగురితోనూ ఆశ్చర్యంగా చెప్పుకునేవాడు... ఒక్కొకసారి అతనికి కష్టమేసేది—తను సుభద్రకోసం ఈ పిచ్చి జోస్యంలోఆసక్తి తెచ్చిపెట్టుకోవటమేమిటి. ఆమెకు అందులో తనకున్నంత ఆసక్తికూడా లేనట్టు కనిపించటమేమిటి?

7)

ఒకానొక పత్రిక ఆ వారపు తులాలగ్న ఫలితాలను ఈవిధంగా ప్రకటించింది.

"మిమ్ము ప్రేమించేవారికి మీహృదయం అర్థమయిందా లేదా అనేబాధ మిమ్ము వేధిస్తూయుండును. ఈ వారములో మీరు మీ స్నేహితులను, మీస్నేహితులు మిమ్ములను బాగుగా యర్థముచేసికొందురు 16 ఉత్సాహం, 17 తలవనితలంపుగా చిన్నప్రయాణం, 19, 20 ప్రణయానుభవం, 21 విచారము, స్వల్పప్రయాస."

15 తేదీన శోభనాద్రి, సుభద్రా ఈఫలితాలుకలిపి చదువుకున్నారు. సుభద్ర మనస్సులో ఏమేమి ఆలోచనలు కలిగిందీ శోభనాద్రి ఎరుగడు. కాని అతని మనస్సుమాత్రం పగ్గాలు తెంచుకుని పరుగెత్తిపోసాగింది. ఈవారంలో తన ప్రేమకథ మొగ్గతొడుగుతుందా ఏం? నిజంగా 20, 21 తేదీలలో తనకూ సుభద్రకూ ప్రణయానుభవం రాసిపెట్టి ఉందా? ఆమెను పెళ్ళిచేసుకుని సంసారపక్షంగా, లోక విడ్డూరం ఏమీలేకుండా ఆనందంపొందటానికిమాత్రమే కలలు గంటూండిన శోభనాద్రికి సుభద్రతో ప్రణయానుభవమనే ఆలోచనకలిగతేనే మతిపోయినట్టయింది. అమాంతం అక్కడే సుభద్రను తన రొమ్ముకేసి అదుమేసుకుందామనుకున్నాడు. కాని 20 తేదీదాకా ఆగటం ఎందుకైనా మంచిదనిపించింది. అన్నాళ్లు ఆగటానికి తయారైన శోభనాద్రికి 20 వ తేదీ చాలా దూరానవున్నదే అనిపించింది. ఈ నాలుగురోజులూ ఎట్లా గడుస్తాయో అతనికి బోధపడ్లేదు...

తన మనస్సులో ఏఆలోచనలు రేగుతున్నదీ సుభద్ర చెప్పేస్తే ఎంతబాగుణ్ణు! మనుష్యులట్లా హృదయాలు విప్పలేకపోతారెందుచేతనో? వెధవ గోడలు! ఆ గోడలుంటేగాని ప్రపంచం వెళ్ళదు గామాలు?

తనకు జోస్యంమీద అఫీషియల్‌గా నమ్మకంలేదనేవిషయం కూడా అప్పట్లో శోభనాద్రికి జ్ఞాపకంరాలేదు ఆవారపు లగ్న ఫలితాలతని ప్రాణానికి జోస్యంమాదిరిగా లేవు-గట్టిగా ఋజువయి త్వరలో ప్రత్యక్షం చెయ్యబడనున్న పూర్వచరిత్రగా తోచింది.

మర్నాడు నిజంగానే ఉత్సాహంగా గడిచింది శోభనాద్రికి. మామూలుగానే అసలు కొంటెది, ఆనాడు సుభద్ర అల్లరిలో చెలరేగిపోయింది. మాటలసందర్భంలో వచ్చిన ప్రతిమనిషినీ వెక్కిరించింది అందరి నడకలూ నడిచి చూపించింది. మంచి ఉషారుమీదఉన్న కోతిలాగా ప్రవర్తించింది. అదంతా శోభనాద్రికి చెప్పరాని ఆనందం కలిగించింది.

సుభద్రను కొంచెం ఏడిపిద్దామనే సదుద్దేశంతో శోభనాద్రి 'ఇరవయ్యో తారీకెప్పుడొస్తుందా అనిచూస్తున్నా' అన్నాడు.

"ఏం పందొమ్మిదో తారీఖు వెళ్ళగానే వస్తుంది... ఏం? దానికోసం అంత ఎదురుచూడాలిసిన పనేమిటి?" అంది సుభద్ర.

"ఉందిలే... ఒకసారి లగ్నఫలాలు చూస్తు."

"పాపం! అలవాటైన ప్రాణంకనక తహతహలాడిపో తున్నది!" అన్నది సుభద్ర.

"ఇంకేం? తెలిసేనా అడిగావ్?...నాప్రాణం తహ తహలాడిపోతున్నదని చెప్పటందేనికి? నీదో? నీప్రాణం తహ తహ లాట్టలా? అన్నాడు శోభనాద్రి చొరవగా.

"అబ్బో! మీరు మహాశౌరుగాబోల్ను!" అన్నది సుభద్ర.

మొత్తానికి పదహారో తేదీ వారఫలితాల ప్రకారం వెళ్ళిపోయింది. రేపు తలవనితలంపుగా చిన్నప్రయాణం. ప్రయాణం తనకూ సుభద్రకీ కలిసే తగలాలి. ఎక్కడి కవు తుందో? ఏ పిక్నిక్ మీదనన్నా వెళ్ళితే బాగుండును. అటు వంటిచోటే ప్రయాణానుభవంకూడా వుండవలసినట్టుంటుంది.

మర్నాడు పదిహేడు తేదీనాడు శోభనాద్రికో ఉత్తరం వచ్చింది. అతని చెల్లెలు నాలుగు రోజుల్నించీ జబ్బుగా మంచాన పడివున్నది. నాటువైద్యుడు సన్నిపాతమని చెప్పాడు. శోభనాద్రి ఒకసారివచ్చి చూసిపోవలసిందని ఉత్తరం.

వారఫలితాల మహాత్మ్యనుగురించి విస్మయపడటానికి బదులు శోభనాద్రి ఉత్తరంచూసి కంగారుపడిపోయినాడు. అతనికి చెల్లెలంటే పంచప్రాణాలూను. ఆపిల్లమీద తనకున్న గాఢమైన మమకారంలో నూరోవంతైనా ప్రకటించే అవ కాశం దొరక్కపోవటాన్నిగురించి ఆలోచన వచ్చినప్పుడల్లా అతని మనస్సు చివుక్కుమనేది.

ఇప్పుడీ ఉత్తరం చూడగానే శోభనాద్రికి తనచెల్లెలు పోతుందేమో నన్నభయం పట్టుకుంది. టైఫాయిడుగురించి విద్యావిహీనులకన్న అతనికి జాస్తిగా తెలిసుండటం మరింత భయకారణమయింది. ఇంగ్లీషువైద్యంలో ఆ దిక్కుమాలిన జబ్బుకు మందులేదు. నాటువైద్యులు సన్నిపాతాన్ని నయం చేసినట్టు కొన్ని దాఖలాలున్నప్పటికీ దానంతటనయంగాని సన్నిపాతాన్ని ఏవైద్యుడూ నయంచెయ్యలేడని అతనికి తెలుసు.

చెల్లెలిగారూరు వెళ్ళటానికి సన్నాహమంతా చేసుకు న్నాక ఈవిషయం సుభద్రతో చెప్పాలనే ఆలోచన కలి గింది శోభనాద్రికి. అతను వాళ్ళింటికి వెళ్ళేటప్పటికి, అప్పుడే ఒక గంటక్రితం, సుభద్ర అర్జంటుగా వాళ్ళ పిన్నిగారూరు బయలుదేరినట్లు తెలిసింది. సుభద్ర పినతల్లి కిందటిరోజే ప్రసవం అయింది. ఆమె భర్త ఏవో సరుకులూ, సామా నులూ కొనటానికివచ్చి సుభద్రను వెంటబెట్టుకెళ్ళాడు.

"చిత్రం!" అనుకున్నాడు శోభనాద్రి.

చెల్లెల్ని చూసినమీదట శోభనాద్రి ఆదుర్దా చాలా తగ్గింది. అతననుకున్నంత ప్రమాదంగా లేదామెకు. నాటు వైద్యుడే మందిస్తున్నాడు. శోభనాద్రికూడా ఒక వైద్యుడే నని తెలిసినమీదటకూడా ఆనాటువైద్యుడు "ఈరోగి నాది, నీ పటాటోపంచూస్తే నాకేమీ భయంలేదు. నీకసలు నాడే మిటో ఏం తెలుసులే?" అన్న వైఖరి అవలంబించాడు.

శోభనాద్రికి వైద్యుణ్ణిచూస్తే కోపంరాలేదు. రోగిలో

దుర్లక్షణాలేమీ లేకుండా పట్టుకొస్తున్నందుకు గౌరవంకూడా కలిగింది.

తనచెల్లెలు ఆడబిడ్డ కొంతకాలంనించీ ఇక్కడేఉంటున్నది. ఆ అమ్మాయి పదెనిమిది, పందొమ్మిదేళ్ళది. ఆమెను శోభనాద్రి అదివరలో ఒక్కసారి మాత్రమే చూశాడు. కాని ఆమెనుగురించి అదివరకే అంతా తెలుసుకున్నాడు.

ఆ అమ్మాయిపేరు జయలక్ష్మి. ఆమె చాలా నాసిరకం. ఒకడి భార్యగా ఉండటానికి బొత్తిగా పనికిరానిది. కొంతమందికి సంగీతం పాడటం బొత్తిగా రానట్టు, ఆమెకు నీతిగా ఉండటం బొత్తిగా చాతకాదు. తేనెమీద ఈగలు వాలకుండా చెయ్యటం ఎంత కష్టమో ఆమె ఇతరమొగవాళ్ళమీద పడకుండా చెయ్యటం అంతకష్టం.

పోనీ ఆమనిషికి తాత్కాలికంగానైనా మగవాణ్ణి ప్రేమించేశక్తిఉందా అంటే అదీ లేదు! ఇంకో ప్రాణిని ప్రేమించటానికి ప్రయత్నించాలనే ఆలోచనకూడా ఆమెకు లేదు.

ఇంకోవింత ఏమిటంటే ఆమెకు ఆత్మక్షేమమైనా తెలీదు. అందుచేత ఆమె తనుచేసే రంకుప్రయత్నాలు చాటుగా చెయ్యటానికి ప్రయత్నించక ప్రతిసారీ మొగుడికో అత్తగారికో దొరికిపొయ్యేది. ఆమెను భర్త ఒకసారి వెళ్ళగొట్టి, మళ్ళీ తెచ్చుకుని, మళ్ళీ వెళ్ళగొట్టాడు. ఆమెను దగ్గిరికి తీసి చూసిన అక్కలూ, అన్నలూ, అంతా చివరకామెను వెళ్ళగొట్టారు. ఇప్పుడు శోభనాద్రి బావమరిదివంతు. ఈ

మనిషి ఇక్కడమాత్రం ఎంతకాలం ఉంటుందో శోభనాద్రి ఊహించలేకపోయినాడు.

శోభనాద్రి జయలక్ష్మిని అదివరకే మనస్ఫూర్తిగా అసహ్యించుకున్నాడు. ఎదురుగా మనిషినిచూస్తే ఆఅసహ్యం రెట్టింపయింది. ఆ మనిషి చరిత్రయావత్తు ఆమె మొహానే తాండవిస్తున్నది.

“బాల్యవివాహాలు చేసుకునేవాళ్ళు ఇటువంటిపిల్లాం దొరక్కుండా తమనుతామెట్లా కాపాడుకోగలరు? అనుకున్నాడు శోభనాద్రి.

ఒకరోజు గడిచింది. జయలక్ష్మి తనమీద ఒక కన్ను వేసి ఉంచినట్టు శోభనాద్రికి రూఢిఅయింది. జూలో పాములుండే అర్రల్లో కప్పలుకూడా ఉంటై. ఆ పాములనుగురించి ఆ కప్పల కెటువంటి అభిప్రాయం ఉండదగునో శోభనాద్రి కటువంటి భావంకలిగింది.

కాని ఆభావం వెనకాలే జయలక్ష్మినిఏమైనా చెయ్యాలనే ఉద్రేకం తన అంతరంగంలో కరుడుకట్టుకుని ఉండటం గ్రహించి శోభనాద్రి ఆశ్చర్యపోయినాడు. జయలక్ష్మిఅంటే తనకు వర్ణించరానంత అసహ్యం. ఆమెమీద తనకు ప్రేమ కాదుకదా మోహమైనా.లేదు మోహంలేని కామంతో ఆమెను హింసించాలని అతనిలో ఒక ప్రోద్బలం బయలుదేరింది. ఆలోస్తే అందులోనూ అర్థం కనిపించలేదు. ఎందుకంటే ఆమెద్వారా కామతృష్ణ తీర్చుకోవటం ఆమెకు శిక్షే కాదు. అయినా అతని కామం పగ మాదిరిగానే ఉంది.

ఇంకొకందుకు కూడా శోభనాద్రి ఆశ్చర్యపోయినాడు. సుభద్రవంటి దేవతను అరచేతులో పెట్టుకుని తన కిటువంటి పశువునుగురించి ఆలోచించవలసిన ఆవసరమేమిటి? తన సంస్కారంలో ఏదో పెద్ద లోటున్నదా? సుభద్రను ఆరాధించే శోభనాద్రి జయలక్ష్మిని ద్వేషంద్వారా కామించ గలడా?

ఎంత ఆత్మపరీక్ష చేసుకున్నా, ఎంత ఆత్మబోధ చేసుకున్నా అతనికామం అరికట్టక సన్నిపాతరోగి జ్వరంలాగా క్షణక్షణ ప్రవర్ధమాన మవుతున్నది.

పదేనిమిదో తారీకురాత్రి అతనికి నిద్రపట్టనేలేదు. ఆ దిక్కుమాలినజంతువు జయలక్ష్మితో పోతేగాని తన జీవిత శైలు ముందు కొక్క అడుగైనా దాట్లేట్టులేదు. అయిదారు సార్లుశోభనాద్రి పక్కమీదినుంచి లేచాడు. జయలక్ష్మి దగ్గరికి పోదామనే సంకల్పంతో, ఒకసారి జయలక్ష్మి పడుకున్నచోటికి వెళ్ళి ఆమెకేసి ఎంతోతృష్ణతో చూసి తిరిగివచ్చాడు కూడాను. ఏంచెయ్యటానికీధైర్యం చాలలేదు.

తిరిగివచ్చి పడుకుని ఆలోచించాడు. సుభద్ర విషయంలో అంత నిగ్రహం చూపగలిగిన తనకు ఈ జయలక్ష్మి విషయంలో ఇంత నిగ్రహం లేకుండా పోవటానికేమిటి కారణం? ఇవాళ ఈ జయలక్ష్మి సన్నిపాతం తగిలి చస్తే రేపటికి రెండూ! తనకేమీా చింతలేదు. అటువంటప్పుడు ఈ మనిషికోసం ఇంత తపించటందేనికి? తనతాలూకు నగ్న సత్యం ఈ జయలక్ష్మిగాని సుభద్ర కాదనుకోవాలా?...

ఏ రెండుగంటలకో అతనికి నిద్రపట్టింది. మర్నాడుద యం నిద్రలేచి శోభనాద్రి తనను తాను మనస్ఫూర్తిగా ద్వేషించుకున్నాడు. నిద్దట్లో కూడా అతని కామాని కేటు వంటి మార్పూ కలగలేదు. ఎంతసేపటికీ అయిపోని చండా లపు సినిమా చూస్తున్నవాడి మనస్తత్వంతో అతను బాధ పడసాగాడు.

ఆరోజు మధ్యాహ్నంవేళ జయలక్ష్మి వంటింట్లో అత నికి వంటరిగా దొరికింది. అతని బావమరది ఎక్కడికో వెళ్ళాడు. రోగి నిద్రపోతున్నది.

"బాగానేఉంది!" అన్నది జయలక్ష్మి నిర్వికారంగా. అతనామెను పట్టుకోగానే, ఒక మగవాడు తనను పట్టుకున్న ప్పుడు ఆడది ఇష్టమైనా ప్రకటించాలి, జయలక్ష్మి "బాగానే ఉంది" అన్నదేగాని అతనిపట్టు విడిపించుకోవటానికి ప్రయ త్నించలేదు

శోభనాద్రికి జయలక్ష్మిని గురించి కనువిప్పు కావల సిన అవసరం ఏమైనా ఉంటే అదికూడా ఇప్పుడయింది. కామ తృప్తి నిజంగా తుచ్ఛమైనదికాదు. దానిద్వారా హృదయాలకువన్నె హెచ్చుతుంది. అది స్త్రీపురుషులకు కలి గించే పారస్పర్యం మరేవిధంగానూ దొరకదు.

కాని ఈ విధంగా జయలక్ష్మికి తను ఏమాత్రమూ సన్నిహితుడు కాలేకపోయినాడు. ఇంతకంటె అస్పష్టమైన కామసంతృప్తి అతను ఊహించలేకపోయినాడు. జయలక్ష్మి ఆ క్షణంలోనన్నా చీమతలకాయంత ఆనందంగాని, తన

మీద ఆఖరకు అతిక్షణభంగురమైన ప్రేమభావంగాని కన బరచినట్టయితే ఆమెను క్షమించి ఆమెనుగురించి తనకున్న అభిప్రాయం యావత్తూ మార్చుకోవటానికి శోభనాద్రి సిద్ధపడ్డాడు కాని జయలక్ష్మి అతనికా శ్రమ ఇవ్వలేదు.

"నాలో నిజంగా ఏదో తెలియని లోపంవుంది. లేక పోతే నేనీ మృగాన్ని కామించివుండను. జయలక్ష్మికి అప చారం చేసి నేను బావుకున్న దేమిటి? ఛీ!" అనుకు న్నాడు శోభనాద్రి.

జయలక్ష్మినిగురించి ఇక జన్మలో స్మరించనయినా కూడదని అతను చేసుకున్న తీర్మానం ఆ రాత్రి పన్నెండు గంటలదాకా పనిచేసింది. అతను పదింటికే నిద్రపోయినాడు. కాని పన్నెండుగంటలవేళ అతనికి కొట్టినట్టు మెలుకొచ్చింది. నిద్రలేస్తూనే ఇతను మంచంమీదినించి లేచి వెనకనించి తన్నె వరో తోస్తున్నట్టుగా జయలక్ష్మిని వెతుక్కుంటూ వెళ్ళాడు. ఆమె మంచందగ్గిరికి వెళ్ళి ఆమె చెయ్యి పట్టుకుని గుంజాడు. జయలక్ష్మి కళ్లు తెరచిచూచి, "ఊఁహుఁ? ఏమిటీపీడ!" అంటూ గొణుక్కుంది కాని లేచివచ్చింది.

జయలక్ష్మి తిరిగి వెళ్ళిపోయి పడుకున్న తరువాత కూడ, అతనికి నిద్రపట్టలేదు. అతనిక ఆత్మవిమర్శమానేశాడు. "ఏపరతుమీదనైనాసరే నేనిటువంటి మనిషికోసం పాల్పడ గలను! నా తాలూకు నగ్నసత్యం ఈ జయలక్ష్మే!" అను కుని అతను సరిపెట్టుకున్నాడు.

ఆమర్నాడు కూడా అతని ప్రణయం ఈ పద్ధతులమీదే నడిచింది.

ఈ రెండురోజుల అనుభవంతోనూ ఆయనికి చాలా కొత్త విషయాలు గ్రహింపుకొచ్చినయ్యి. జయలక్ష్మి సులభంగా లభ్యమవుతుందనే నమ్మకమే తన కామోద్రేకానికి ప్రధానహేతువు. ఆమె మనస్సును జయిద్దామనే ఆశే తనను అంత నీచమైన షరతులమీద ఆమెను స్వీకరించటానికి పురికొల్పింది. తను జయించలేదు. జయించటానికేమీలేని దాన్నెట్లా జయించటం?...జయలక్ష్మి చాలా గొప్పది. ఆమెతోపోయిన ప్రతి మగవాడూ ఈ షరతులమీదనే ఆమెతో పోయివుంటాడు. జయలక్ష్మి తనమీద ప్రకటించని అపేక్ష ఇంకోరిమీద ప్రకటించి ఉంటుందనుకోవటానికి ఏ ఆధారమూలేదు. జయలక్ష్మి నీచపు దనుకోవటం దేనికి? నీచత్వంఏమన్నా వుంటే తనవంటి వాళ్లల్లోనే వుంది.

"వెళ్లొస్తాను బావా?" అన్నాడు శోభనాద్రి.

"కాస్త మీ చెల్లెకి పథ్యం పెట్టేదాకన్నా వుండరా. ఏమైనా వైద్యుడివిగద!"

"కాదులే! అతవలక్లాసులు పోవటంలా? ఏమీ ఫర్వాలేదు. మీ వైద్యుడు గట్టివాడే. మళ్లీ వారం పదిరోజులలో వస్తాలే"...

రైల్లో కూచోగానే శోభనాద్రి బుర్రలో ఆలోచన మెరిసింది. వారఫలితాలు సుభద్రకెట్లా పనిచేసినట్టు? ...ఛీ! ఛీ! సుభద్ర అల్లాంటిది కాదు!......ఆ పినతల్లి మొగుడు — ఏమో! సుభద్రకేసి ఆకలిగా మాస్తానటానికిసందేహంలేదు. పెళ్ళాంకూడా అందుబాట్లో లేదాయెను!...అయినా జోస్యం ఏమిటి? దిక్కుమాలిన మూఢనమ్మకాలు! డామిట్!...సుభ

ద్రతో సూచనగా అనిచూస్తే ఆమెక్కూడా ఏమైనా జరిగిందీ లేందీ మొహాన తెలిసిపోతుంది!...ఎట్లాగైనా సుభద్రను పెళ్ళాడతావా అని అడిగుండక పోవటం మేలే అయింది. అడిగుంటే వెనక్కు పోవటానికి వీలుండేది కాదు...చిత్రం, మనకు భావాలుండికూడా చేతులతోనూ మాటలతోనూ మాత్రమే జీవిస్తున్నాం. మనకు ఓ ఆడదాని మీద ఎంత కాంక్షవున్నా దాని మాటలూ చేతలూ మినహాయించి ప్రకటించినంత కాలమూ ఆ ఆడది «ఎవడ్రానువ్వు? చూడవే అమ్మా!» అని పొలికేక పెట్టలేదు...తను వెళ్ళి మాట ఎత్తకపోతే సుభద్ర తనను నమ్మించి మోసపుచ్చినట్లు రుజువు చెయ్యలేదు...అయినా తను సుభద్రను పెళ్ళాడకపోవటంలో మోస మేముందిగనకా? ...తనవంటి అధముడు సుభద్రను పెళ్ళాట్టానికి తగడు. సుభద్రకు తన కంటె ఎంతో మంచివాడు మొగుడగుగాక! తథాస్తు!...

---

# పగటి కలలు

నిజంగా నాఅంత అదృష్టహీనుడుండడు. కననే నా కాలేజీ చదువు పూర్తికాకముందే మానాన్న పోయినాడు. ఆయన ఇంకొక్క ఏణ్ణర్ధం బతికుంటే బియ్యే పూర్తిచేసే వాణ్ణిగద! యాజుల్లాగా ట్రెయినింగు పూర్తిచేసి స్కూలు మేష్టరు పనిలో ప్రవేశించి ఉండేవాణ్ణిగద! నిజానికి స్కూలు మేష్టరుపనంత సుఖం ఇంకోటి లేదు. ఏటా కొత్తపిల్లలు వస్తూంటారు. బోలెడన్ని శలవలు. రొష్టులేని జీవితం. పరువు మర్యాదలుంటాయి. ఎప్పటికైనా హెడ్మాష్టరై పోవచ్చు— ఎవడు చూశాడు? మనకింద చదువుకున్న పిల్లల్లో ఒక అర డజనుమంది గొప్పవాళ్ళయితే ఇంక మనకి కావలసిందేమిటి?

చిత్రం! మానాన్న ఎన్నడూ యాభైరూపాయలు మించి ఏనెలా గడించలేదు. అయినా ఆయన జీవితం ఎంతో సుఖంగా వెళ్ళింది. ఆ జీతంమీదే ఆయన ఇల్లుకట్టాడు. ఇళ్ళ స్థలాలు కొన్నాడు. వాటి నమ్మి పొలాలు కొన్నాడు. ఆయన

ఆపని చేయబట్టే ఈనాడు మాకు తలదాచుకునే టందుకు కొంపా, తినేటందుకు ఏటా నాలుగుపుట్ల గింజలూ ఉన్నాయి. లేకపోతే మాగతి ఏమై ఉండును?... ఆ మాటకువస్తే ఇప్పుడు మాగతి ఏమయ్యేట్టు? మా సీతకు అప్పుడే పద కొండోఏడు కూడా ప్రవేశించింది. ఎట్లాగైనా ఈ ఏడాది లోగా దాని పెళ్ళి కాకపోతే మా అమ్మ ఆత్మహత్య చేసు కుంటుంది దాని పెళ్ళికి ఎంతలేదన్నా మూడు నాలుగువేలు ఖర్చవుతుంది. ఏ దారేపొయ్యేవాడికిచ్చినా వెయ్యినూటపద హార్లు కట్నం ఇవ్వాలి సీతపెళ్ళికయే ఖర్చు నేనే భరించాలి. ఈ భారం నామీద ఉన్నది. మానాన్న స్థలాలూ పొలాలూ కొన్నాడంటే ఎందుకు కొనడూ? ఆయన తన సంపాదనలో నుంచి మా భారసాలలు తప్ప ఇంకేమీ చెయ్యలేదు. తీరా బరువు మీదపడే సమయానికి దాటిపోయినాడు.

నాకేన్నా ఉద్యోగం దొరికినా బాగుండిపోను... అయినా ఏం ఉద్యోగాలు? ఎంతపెద్ద ఉద్యోగం దొరికితే నేను సీతపెళ్ళిచేసే డబ్బు ఆదా చెయ్యగలుగుతాను?... ఆ చలపతిరావుకు వచ్చినట్టు నాకూడా క్రాస్‌వర్డ్ పజిల్‌లో ఏ పధ్నాలుగువేలో రావాలి అంతకన్న మరోమార్గం లేదు. ఏం? ఎందుకు రాకూడదూ? క్రాస్‌వర్డ్ పజిల్ బహుమానాలు భాగ్యవంతులకే రావాలని రాసిపెట్టివుందా? అదృష్టం— అంతే!... నిజంగా పధ్నాలుగువేలు వస్తే ఎంత బాగుం టుంది! అయిదారువేలు ధారాళంగా ఖర్చుచేసి సీతపెళ్ళి జాయ్‌మని చేసేయ్యొచ్చు, నాలుగువేలు కట్నంపోస్తే మంచి సంబంధం రాకేంజేస్తుంది? తండ్రిపోయినా కుర్రాడు

చెల్లెలికి మంచి సంబంధమే తెచ్చాడని నలుగురూ సంతో షిస్తారు అసలీ పద్నాలుగువేలలో కానీ ఖర్చుచెయ్యక్కర్లేదు. అంత డబ్బు దగ్గిరుంటే మనకే బోలెడంత కట్నమిచ్చి ఎవరుపడితే వాళ్ళు పిల్లనిస్తారు. ఆ కట్నంతో సీత పెళ్ళి చేసేయ్యొచ్చు. ఆతరువాత దగ్గిరున్న ఈ డబ్బుతో ఇంకా క్రాస్‌వర్డ్ ప్రైజులు కొట్టొచ్చు. అవసరమైతే తడవకు వెయ్యేసి రూపాయల కూపన్లు నింపిపంపితే సరి; రాక చస్తుందా ఫస్టుప్రైజు?...

సీత పెళ్ళికోసం అమ్మ నన్ను పెళ్ళిచేసుకోమంటుంది. నాకు నా అత్తవారిచ్చే కట్నం కొంతవరకైనా సీత పెళ్ళికి అక్కరకొస్తుందని ఆవిడ వుద్దేశం. నాకు కట్నమిచ్చి పిల్ల నెవరిస్తారు? పిల్ల అందచందాలు చూడకుండావుంటే కట్నం బాగానే వస్తుందంటుంది అమ్మ. ఆ నాగయ్యగారి కూతురు లాటి వెర్రిబాగులదాన్ని చేసుకుంటే కట్నం బాగానే యిస్తారు. కాని అటువంటి పిల్లనెట్లా చేసుకోవటం? ఆపిల్లను చూస్తే జాలేస్తుంది. కాని అటువంటిదాన్ని పెళ్ళాడి కాపరం చెయ్యటంకంటె భయంకరం ఇంకేముంటుంది? అమ్మ పైకి అనదుగాని నేనా అమ్మాయిని చేసుకోవటానికి ఒప్పుకుంటే ఆవిడ చాలా సంతోషిస్తుంది. కట్నాలవిషయం వచ్చినప్పుడల్లా 'ఆ నాగయ్యగారు అయిదువేలు కట్నం ఇవ్వటానికూడా సిద్ధంగావున్నారు. ఎవరిరొట్టె నేతిలోపడుతుందో గాని' అంటుందమ్మ.

ఆడవాళ్ళ మనస్సులెంత విచిత్రంగా పనిచేస్తాయో! సీతని డబ్బుగల వెర్రిబాగులవాడికో, ముసలాడికో ఇచ్చి

చెయ్యటానికి ఒప్పుకుంటే నిక్షేపంగా, కాసీ ఖర్చు మనకు తగలకుండా పెళ్ళయిపోతుంది. కాని అటువంటి ఆలోచనకు అమ్మ ఒక్కనాటికి ఒప్పుకోదు. కాని నేను వెర్రిబాగుల దాన్ని పెళ్ళాడి యే అయిదువేలో కట్నం పుచ్చుకుంటే ఆవిడ చాలా సంతోషిస్తుంది! ఎక్కడుంటాడో ఈ తేడా?

ఒక్కొక్కసారి అమ్మ మాట్లాడుతుంటే ఆవిడ నా జీవితాన్ని దుర్భరం చెయ్యటానికి మాట్లాడుతున్నదా అనిపిస్తుంది. కాకపోయినా సీత పెళ్ళికిప్పుడేం మునిగింది? ఇప్పుడాడపిల్లలకు పదిహేడో ఏటా, పద్దెనిమిదో ఏటా పెళ్ళిళ్ళు చేసేస్తున్నారుగా? సీతకూడా ఇంకో ఆరేడేళ్ళు ఆగి పెళ్ళి చేస్తే నాకెంత హాయి! ఈలోగా ఏ వుద్యోగంలో ప్రవేశించినా అప్పటికి నాలుగురాళ్ళు తెచ్చుకుంటూ వుంటాంగదా! ఈలోగా తమ్ముడు, సూర్యంగాడుకూడా యేదన్నా కాస్త సంపాదనలోపడితే అప్పుడు సీత పెళ్ళిచెయ్యటం యెంత ఉసులు!...ఆ మాటకొస్తే అప్పటికి సీత పరిస్థితి ఎట్లా వుంటుందో ఎవరు చూశారు? అదృష్టం బాగుంటే అది యే సినిమాల్లోనైనా చేరిపోగూడదూ? అదేం అంద వికారమైన పిల్లకాదే చామనచాయయైనా కనుముక్కుతీరు గలపిల్ల. పైగా సినిమా పాటలన్ని దంచిపాడేస్తుంది. దానికి వయసొచ్చేసరికి ఈనాటి తారలంతా పాతపడిపోయుంటారు. సీతకు మంచి చాన్సు. ఇప్పుడే సినిమాతారలు లక్షలుసంపాదిస్తున్నారు. ఇంకో ఆరేడేళ్ళకి కోట్లు సంపాదించరూ? పదేళ్ళ కిందట వున్న సంపాదనతో పోలిస్తే ఈనాడు సినిమా సంపాదనలు యెంత జాస్తి! సీత సినిమా తారైతే దర్జాగా మంచి

మంచి కార్లెక్కి తిరగొచ్చు. కాని ఒకటే యిబ్బంది....దాని సంపాదనమీద మనం బతకటం బరువైన పనిగాదు. అంత గొప్పదై పోయినాక సీత మనని అపేక్షగా చూస్తుందని యేమిటి? వీడు మనమీదపడి తింటున్నాడే అని అనుకుంటే. ఛీ! అటువంటి మాట పడనే కూడదు. మనుషులకు విశ్వాసం తక్కువ. 'ఒకప్పుడు వీడు మన పెళ్ళికోసం వెర్రిబాగుల పిల్లను పెళ్ళాడటానికి కూడా సిద్ధపడ్డాడే' అన్న విశ్వాసం సీతకు వుంటుందనా? ఎన్నటికీ వుండదు. దాని కార్లో యెక్కి మనంతిరుగుతున్నామన్న విషయంమాటుకే అది గమనిస్తుంది. డబ్బు నిజంగా ఎంత పాపిష్టిది; అది మనుషుల్ని ఇట్టే మార్చేస్తుంది. మనం నీతికి నిలబడి మారటానికి ఒప్పుకోం గనకే మనకు డబ్బురాదు. చలమయ్యచూడరాదూ, దొంగ వ్యాపారంచేసి రెండు చేతులా సంపాదించాడు; ఇంకాసంపాదిస్తున్నాడు. వెనకగా ఆయన్ని అందరూ తిట్టేవాళ్ళే. అయినా యెదుట పడ్డప్పుడు దేవుణ్ణి చూసినట్టు చూస్తారుగద! పదేళ్ళ కిందట చలమయ్య దగ్గరేముంది, బూడిదె? ఏదో అవకాశం దొరికింది. దానిమీద అల్లుకొచ్చాడు. అటువంటి అవకాశం మనకూ రావొచ్చు, ఎవరుచూశారు? మొదటి లక్ష చేర్చే దాకానే కష్టం. ఆపైన ఎన్ని లకారాలైనా వాటంతటవే చేరుతాయి. డబ్బుచేరినాక కావలిసినంత కీర్తి, బోలెడంత పలుకుబడి, అంతులేని అవకాశాలు. అధికారులుకూడా మన అడుగులకు మడుగులొత్తుతారు.

8)

మనుష్యుల్లోవుండే లోప మేమిటంటే వాళ్ళు అడవిలో ముత్యపుచిప్పలు వెతుకుతారు. మనిషికి అన్నింటికన్న ముఖ్యంగా కావలసింది డబ్బాయె. ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యాలన్నా, లాభసాటిగా దొంగ వ్యాపారం చెయ్యాలన్నా, అధికార్లను కూడగట్టాలన్నా, ఇంత పలుకుబడి పరువుప్రతిష్ఠలూ సంపాదించాలన్నా డబ్బులేక సాధ్యపడదాయె. డబ్బు పాపిష్టిదని తెలిసికూడా ముడిగట్టుక్కూచుని లాభమేమిటి? ఏనాటికైనా నీళ్ళలో దిగినవాడికి ఈతవస్తుంది గాని ఒడ్డున కూచుని నీళ్ళని శాపనార్థాలు పెట్టేవాడికి ఈతేం వస్తుందీ?

మనవంటివాళ్ళం డబ్బుకిబ్బంది ఎందుకు పడుతున్నామో నాకర్థమయింది. డబ్బు సంపాదించే పద్ధతులన్నీ చెడ్డవేనన్న వేదాంతం మనకు చిన్నప్పటినుంచి యెవరో నూరిపోశారు. అదే మనకొంప తీస్తున్నది. మా కామేశ్వర్రావు చూడరాదూ? అన్నిటికన్నా కళలు యెక్కువైనవంటాడు, డబ్బుకన్నాట! ఎన్ని లక్షల రూపాయలుకూడా ఒక గొప్ప పాటకూ, బొమ్మకూ, పుస్తకానికీ సమంకావుట! కామయ్య ఉత్సాహాతిశయంతో చెబుతుంటే, నాకూడా అది నిజమే అనిపించింది, చెప్పొద్దూ? కాని ఏమయిందీ? కిందటి నెల సినిమా నటుడు జగన్నాథం మావూరు వచ్చినప్పుడు ఊళ్ళో కళాకారులంతా అతనిచుట్టూ చేరి మూడు రోజులపాటు రాత్రింబగళ్ళు రాంభజన చేశారు. జగన్నాథం అన్నికళల్ని గురించీ మాట్లాడాడు. ఆయనగారికి ఏ కళలోనూ ప్రవేశం లేకపోయినా మా కళాకారులు అతను చెప్పినదాని

కల్లా బుర్ర ఆడించారు. కథలు రాసేవాళ్ళు అతన్నడిగి కథలెట్లారాయాలో తెలుసుకున్నారు. బేగడరాగం రెండు గంటలు ఆలాపన చెయ్యగల మా గోవిందశాస్త్రి సంగీతం గురించి జగన్నాథం చెప్పినదానికల్లా బుర్ర ఊపి తనకు ఏ సినిమాలోనన్నా పాడేఛాన్సు యిప్పించమనీ, సినిమా సంగీతం కష్టపడి నేర్చుకుంటాననీ ప్రాధేయపడ్డాడు. "ఛీ, ఛీ, నీకు సినిమా సంగీతం వెయ్యి జన్మలకూడా రాదుపో" అన్నాడు జగన్నాథం. గోవిందం చిన్నబుచ్చుకుని, తగ్గి వూరుకున్నాడు... ఏమిటో కళలుట, కళలు! ఈ బొల్లికబుర్లతో జనం యిట్లా యెంతకాలం మోసపోతారో తెలీదు... మా శర్మ నిర్వచనం చేస్తాడు... కళనుంచి కళాకారుడు ఆనందంతప్ప యేమీ ఆశించరానుట! ఈ మాట అనేవాళ్ళంతాఆరాధించే కళలేవయ్యా అంటే ఒకప్పుడు కళాకారులకు ధనధాన్యాదులు సంపాదించిపెట్టినవే! ఈ యుగం వాళ్లకు డబ్బుచేసిపెడుతున్న సినిమా కళను వచ్చేయుగం వాళ్ళు ఆరాధిస్తారు. ఇట్లాగే సాగిపోతుంది ఈ జీవితం.

అయినా ఈ కళలగొడవ నాకెందుకు? భగవంతుడు నాకే కళలోనూ ప్రవేశం ఇచ్చాడుకాదు. లేకపోతే ఈపాటికి ఏ సినిమానటుడో, స్క్రిప్టు రైటరో అయిపోయి వేలకు వేలు సంపాదింతును. ఎప్పటికైనా మనం వ్యాపారంచేసే డబ్బు సంపాదించాలి. దానికి రోజులు బాగాలేవు. గతయుద్ధకాలంలో లక్షలుగడించిన లక్ష్మణమూర్తికూడా ఆ మాటే అంటున్నాడు. మళ్ళీ యుద్ధంవచ్చినా బాగుండును. యుద్ధం వస్తే జనం చస్తారు, పట్టణాలు ధ్వంసం అవుతాయి. నిజమే,

కాని ఏంచెయ్యాలి?యుద్ధంవస్తే తప్ప నాబోటివాడికి నాలుగు రాళ్ళు దొరికే ఉపాయం లేదే. కిందటి యుద్ధంలో చూడ రాదూ? ఆఖరుకు ఎందుకూ పనిరాని మా వెంకటేశ్వర్లు కూడా ఉద్యోగం సంపాదించాడుగద! ఆ యుద్ధం అయిపోయిన ఆరునెల్లకల్లా మళ్లా వాడి ఉద్యోగం పోయింది. ఆ పోవటం పోవటం వాడికి ఇంతవరకూ ఎవరూ ఉద్యోగమిచ్చిన పాపాన పోలేదు. అటువంటివాళ్ళెందరున్నారో, మళ్ళీ జపాను యుద్ధంలో దిగాక ప్రతివాడికీ ఉద్యోగం దొరికింది. మా వూరునుంచి ఎనిమిదిమందో పదిమందో పూనా వెళ్ళారు. అందరికీ మిలిటరీ ఎకౌంట్స్‌లో ఉద్యోగాలు దొరికాయి. కొందరు బొంబాయి వెళ్లారు, కొందరు ఢిల్లీ వెళ్లారు.

ముష్టి ఉద్యోగాలు, ఉద్యోగాలదేమిటిగాని వ్యాపారస్థులు బాగుపడ్డారు, తవుడూ చిట్టూ అమ్మినవాళ్ళుకూడా రెండుచేతులా డబ్బుచేసుకుంటే! ఈసారి యుద్ధమేవస్తే నేను వ్యాపారం చేస్తాను. కిందటి యుద్ధంలో వ్యాపారస్థులు డబ్బు చేసుకోవటం కళ్ళారా చూశానుగద. మావూళ్లో తిరపతయ్య ఇనపకొట్టుమీద ఎంత లాభాలు చేశాడు! బియ్యంమర కంట్రాక్టు తీసుకుని,ఎందుకు ఇందులో ఇరుక్కున్నానా అని ఏడిచే గణపతికి ఒక్కసారి సిరి ఎత్తుకోలా? మందుల కొట్లవాళ్ళ సంగతి వేరే చెప్పనే అక్కర్లేదు; మళ్ళీ తప్పక యుద్ధంవచ్చేస్తుంది. ఇల్లూ పొలమూ తాకట్టుపెట్టయినా సరే మందులూ మాకులూ కొని దాచిపెట్టేస్తాను. రెట్టికిరెట్టింపు లాభం వచ్చేస్తుంది. అగిపెట్టె ఇంకా సరుకు కొనేస్తాను. వర్క్‌షాప్ ఒకటి ఏర్పాటుచేస్తే దానిమీదే బోలెడంత

లాభం వస్తుంది... శాంతి, శాంతి అని కొట్టుకునేవాళ్ళను చూస్తే నాకు కడుపు మండిపోతుంది. వాళ్ళేమిటో రాజకీయాలు మాట్లాడతారేమిటి? యుద్ధమన్నది కేవలం వ్యాపార దృష్టితో చూడవలసిన విషయం. ఎవడిక్కావాలి రాజకీయాలు? మనకేమీ రాజకీయాల సంబంధమే లేదు. యుద్ధమే రావాలిగాని ఏ దేశం తెచ్చిపెట్టినా మనకొకటే.

ఒక్కటే భయం—కంట్రోళ్ళు పెడతారేమోనని! యుద్ధంవచ్చి లక్షలు లక్షలు గడించే అవకాశం ఏర్పడ్డాక కంట్రోళ్ళు పెట్టటం, వాటిని ఉల్లంఘించినవారిని ఎరెస్టు చెయ్యటం, ఫైన్‌లు వెయ్యటం జైళ్ళకు పంపటం—ఇదంతా చాలా అన్యాయం తస్సదియ్యా, కొందరు తప్పించుకు తిరుగుతారు; ఆ విద్య మనక్కూడా తెలిస్తే బాగుణ్ను అది మనకు తెలిసేలోపుగానే యుద్ధంవచ్చేసి అవకాశం కాస్తా జారిపోతుందేమో...

ఛీ, ఛీ; పాడు జీవితం; ఎటుతిరిగినా యేదో ప్రతిబంధకమే. మన అదుపులోకి రాకుండా వుండేటట్లుగా ఈ జీవితాన్ని యెట్లా యెవరు తయారుచేశారో తెలిస్తే బాగుణ్ను. మనం పుట్టి పుణ్యానికి కూచుని వూహాలల్లుతాంగాని చేతికి అందుబాటులోవున్న లక్ష్మిని అందుకోలేం. నాకు తెలీక అడుగుతాను, యేం వెర్రిబాగులదాన్ని చేసుకుంటేం? గొప్పవాళ్ళ పిల్లగదా అని మా వూళ్ళో హనుమంతయ్య కాయకన్నుదాన్ని చేసుకోలా? వాడికేం తెగులొచ్చింది? అత్తవారు వాడికి బోలెడుకట్నం యివ్వటంగాక, మంచి వుద్యోగం యిప్పించిపెట్టారు. హనుమంతయ్య అన్నలూ తమ్ములూ

అడుక్కు తింటూనే వున్నారు; హనుమంతయ్య సంసారం మటుకు మూడుపూలూ ఆరు కాయలుగా వుంది... అయిదు వేలు కట్నంగాక నాగయ్య కూతురిపేర ఆ స్తికూడా పెడతాడేమో. అంతగా అయితే ప్రేమించటానికి ఆడాళ్ళు దొరక్కపోతారా? ఈ పిచ్చిమొద్దు అడ్డుపడబోయిందా? మగవాడికేమిటి? అందులోనూ డబ్బున్న మగాడికి! అమ్మ మటుకు చాలా సంతోషిస్తుంది. మనం ఏవేషాలేసినా ఆవిడేమీ అనదు. ఇతరోళ్ళు మాత్రం యేమంటారు? మామయ్యగారి వూళ్ళో మహాలక్ష్మమ్మ కొడుకు వెర్రిబాగులవాడు. మహాలక్షమ్మ కోడలు పబ్లిగ్గా వెంకట్రామయ్యకు పిల్లల్నికనలా? యెవరన్నా, యేమన్నా అనగలిగారూ? ఆడదానికి లేని నీతి మగాడికొచ్చిందా యేం? యిదంతా ఆలోచించే అమ్మ ఈ ఆలోచన చేసింది. సరేననేస్తాను. ఎందుకొచ్చిన గుంజాటన? దీంతో అన్ని చిక్కులూ వదిలిపోతాయి సీతకు మంచి సంబంధం దొరుకుతుంది. అది మొగుడితో హాయిగా కాపరం చేస్తూ సుఖంగా వుంటుంది. నేనూ నా వెర్రిబాగుల పెళ్ళాం హాయిగా వుంటాం... యేమో, అది పెళ్ళికాగానే చచ్చిపోగూడదూ? యెవడు చూశాడు? ఈ ఆడాళ్ళు వూరికెనే చస్తారు. అది చస్తె హాయిగా వెంటనే రెండో పెళ్ళి చేసుకుని అందరిలాగే హాయిగా బతకొచ్చు. నాగయ్య దాని పేరనన్నా యింత ఆస్తిరాసిస్తె బాగుణ్ణు? అదంతా దాని తదనంతరం మనకొచ్చేట్టుగా...

ఛీ, ఛీ, యేంబతుకు; ఈ పీడంతా లేకుండా యే దయామయుడన్నా ఓ వందరూపాయల నౌకిరీ యివ్వ

గూడదూ? వున్నదంతా తెగనమ్మి అయినా సీత పెళ్ళిభారం వదిలించేసుకుని సంపాదనమీద నిశ్చింతగా ఒతుకుదునే...

ఇంకో నెలరోజులపాటు చూస్తాను. ఉద్యోగం దొరికిందా సరేసరి; దొరకద్మా, యెవరితోనూ చెప్పకుండా బ్రహ్మకపాలం లేచిపోయి బైరాగుల్లో చేరిపోతాను. ఈదేశంలో బైరాగాలుకి తిండికి చచ్చుండదు. అయితే, అదేమంచిపని. ఆ మఠంలోనూ ఆ మఠంలోనూ కాలం వెళ్ళబుచ్చొచ్చు. నిష్పూచీగా బతకొచ్చు. అంతే. ఈ భూలోకంలో ఈ పుణ్యభూమిలో బైరాగిమఠం మించిన స్వర్గం, శాంతిధామంలేదు. బైరాగిని మించిన స్వతంత్రుడూ లేడు నిశ్చయంగా బైరాగుల్లో చేరిపోతాను. ముమ్మాటికీ చేరిపోతాను

---

# అక్క పెళ్ళి

"ఆయనకేం? మహారాజు! ఇంకా ఇద్దరు కూతుళ్ళున్నా అవలీలగా సంబంధాలు తీసుకురాగలడు!" అని తనను గురించి ఎవరన్నా స్నేహితులు అనుకున్నప్పుడు శ్వేతాంబరానికి కొద్దిగా గర్వమూ, అంతకంటె ఎక్కువ భయమూ కలిగేవి.

తనశక్తిలో తనకే లేనినమ్మకం తనస్నేతుల కెందుకుండాలి? ఒకవేళ తాను హనుమంతుడల్లే తన శక్తిసామర్థ్యాలను గుర్తించలేకుండా ఉన్నాడా? అయితే, తనకూ, హనుమంతుడికీ ఒక్కవిషయంలోమటుకు పోలికలేదు—హనుమంతుడు పొగిడితే విజృంభించేవాడు. దిక్కుమాలిన పొగడ్త తనను కుంగదీస్తోంది.

రెండుసంవత్సరాలుగా తాను కళ్యాణికి తగినవాడెక్కడన్నా దొరుకుతాడా అని వెయ్యికళ్ళతో చూస్తున్నాడు. భూమ్యాకాశాలమధ్య అటువంటి వాడెవడూ ఇంత

వరకు కనిపించలేదు. "ఎవరన్నా కాస్త సహాయపడండర్రా" అని ఆప్తులనూ, మిత్రులనూ అడుగుదామన్నా వాళ్ళు తన అసహాయస్థితిని గుర్తించేట్టు లేరు.

"శ్వేతు పెద్దదానికింకా పెళ్లి చేశేడుకాడేం?"

"ఆఁ! ఇవాళ అనుకున్నాడంటే రేపు చేసేస్తాడు. మనవాడికది ఏమంత కష్టమైన పని కాదులే!"

తన బంధువులిద్దరిమధ్య జరిగిన ఈసంభాషణను శ్వేతాంబరం తన చెవులారా విన్నాడు. తాను వింటున్నట్టు వాళ్ళకి తెలీదు; అందుచేత అవి ఇచ్ఛకాలమాట అనుకోవటానికి లేదు...

అవును, తన అసమర్థత ఒక్కడూ గమనించడు. ఆ కారణంచేత తాను బొత్తిగా ఒంటరిగాడై పోయినాడు. అంతకంటె తనకు కలిగిన లాభం ఆవగింజంతకూడా లేదు. అన్ని విషయాలలోనూ తనను నిశితంగా విమర్శించే తనభార్య గుణమణికూడా, "మీరు పనిపెట్టుకొని వెతికితే క్షణంలో దానికి సంబంధం కుదరకపోయిందా? మీకసలు ఈగవాలినట్టయినా ఉంటేగా?" అంటుందితప్ప, "ఇది నీవల్లఅయ్యే పనికాదు. మరెవరికన్నా పురమాయించు," అనదు...

తనలో ఇంతమందికి విశ్వాసం ఉండటానికిగల కారణాలు శ్వేతాంబరానికి తెలియకపోలేదు. ఆరేడువందల రూపాయల జీతగాడు, పలుకుబడిగలవాడు, "నాకూతురికి పెళ్ళిచేస్తున్నాను!" అన్నాడంటే ఎంతమందోకుర్రాళ్ళు ఎగబడకపోతారా అని కొందరు బంధువుల నమ్మకం! ఎంత

మంది స్నేహితుల కూతుళ్లకో సంబంధాలు కుదిర్చాడు.తన కూతుళ్ళకు కుదర్చలేడా అని మరికొందరి ఉద్దేశం!

ఇదంతా నిజమేఅనుకున్నా, కళ్యాణికి మొగుణ్ణి తీసుకురావటానికి చిన్నమెత్తు ఉపకరించలేదు—అది అసలైననిజం. కొందరు పెద్దమనుషులు తమకు తామైవచ్చి, "మీపిల్లను మావాడికి చేసుకుంటాం," అని అడగటమూ, ఇతరులద్వారా అడిగించటమూ జరిగింది కాని అట్లా వచ్చిన సంబంధాలలో ఒక్కటికూడా గుణమణి ఆమోదించలేదు.

గుణమణి ఆక్షేపించటంలో అఖండురాలు. ఎటువంటి వాళ్ళకైనా వంకలుపెడుతుంది—వాళ్ళంటే తనకు ఇష్టం లేకపోతే! "ఆపిడకి హృదయనేత్రమేతప్ప మనోనేత్రంలేదు— ఒకప్పుడుండేదేమో, ఇప్పుడు పువ్వేసిపోయింది" అని ఒక కవిమిత్రుడు తాను పూర్వం ప్రేమించిన ఒక గొప్పయింటి ఇల్లాలినిగురించి శ్వేతాంబరందగ్గిర పిరకిగా అన్నాడు. ఆ వర్ణన గుణమణికికూడా వర్తిస్తుందని శ్వేతాంబరానికి ఎన్నో సార్లు అనిపించింది. గుణ మానవులందర్నీ రెండుతరగతులుగా విభజించింది—తన కిష్టులైనవాళ్ళూ, కానివాళ్లూనూ! ఇష్టులైనవాళ్ళలో ఆమెకు ఏ ఒక లోపమూ కనిపించదు. అథవా కనిపించినా ఎంతో హృదయవైశాల్యత కనబరిచి ఆ లోపాన్ని క్షమిస్తుంది, సమర్థిస్తుంది వీలయితే మెచ్చుకుంటుందికూడా!

గుణకి తన పెద్దకూతురు కళ్యాణిమీద చాలాప్రేమ. "పాపం, దానికి ఏమీ తెలీదు—సీత ఇంకా గడుసుదిగాని!

...అందుకే దానికి మంచి సంబంధం చూడాలి!” అనేది. ఈ ‘మంచి సంబంధం’ ఎట్లావుంటుందో శ్వేతాంబరానికి ఎన్నడూ అర్థంకాలేదు. కళ్యాణిని చేసుకుంటామనివచ్చిన సంబంధాలలో చాలాభాగం తనకునచ్చనిమాట నిజమేగాని తాను కష్టపడి వెతికినా ఇంచుమించు అటువంటి సంబంధాలు తప్ప కళ్యాణికిరావని ఆయన నమ్మకం.

ఆమాట అంటే గుణ, “మీకు అదంటే తేలిక లెస్తురూ!” అంటుంది.

“నీకళ్ళకి నీకూతురు రంభల్లే కనిపించగానేసరా?” అంటాడు శ్వేతాంబరం.

“అదే నాకర్థంకాదు. మీకళ్ళకిమాత్రం రంభల్లే ఎందుకు కనిపించకూడదూ? మీకూతురు కాకపోయిందా?” అంటుంది గుణ.

“నీమాదిరిగా ఆత్మవంచన చేసుకోవటం నాచేత కాదు.”

“ఇష్టమైతే అన్నీ చాతవుతై.”

“పోనీ ఇష్టంలేదే అనుకో!”

“ఎందుకు లేకపోవాలీ? అదే నాకర్థంకాదు”

“ఇష్టమైతే అదే అవుతుందని నేనుకూడా అన వచ్చా?”...ఒక పావుగంటసేపు ఈధోరణిలో పడ్డాక, తాము ప్రారంభించిన విషయానికీ మాట్లాడుతున్న మాట

లకూ సంబంధం లేకుండాపోయిందని శ్వేతాంబరానికి అర్థమయేది.

"సీతో ఏదిమాట్లాడాలన్నా చిక్కే. అసలువిషయం వదిలేసి ఎటో ఈడుస్తావు!" అని విసుక్కునేవాడాయన.

"నేనా! ఇంకానయం! మీరే ఈడుస్తారు—దాని పెళ్ళివిషయం ఎత్తితేచాలు మీకు కోపం! అదంటే మీకు బొత్తిగా గిట్టదు. అందుకని మీరే మాటమార్చేసి, ఇంకేదో మాట్లాడతారు" అనేది గుణ పూర్తి నమ్మకంతో.

తనభర్తకు కళ్యాణిఅంటే ఇష్టంలేదని రుజువుచెయ్యటానికి గుణమణిదగ్గర బోలెడంత సాక్ష్యంవుంది. ఊళ్ళో వాళ్ళందరికీ సంబంధాలు కుదర్చగలడుగాని, తనకూతురుకి కుదర్చడు! తాను పెళ్ళికొడుకుతండ్రి అయినట్టుగా లోపాలెన్నుతాడు! అదికూడా ఎందుకు?—మంచిసంబంధం వెతక్కుండా తప్పించుకోవటానికి. సరస్వతమ్మగారి సుశీలకు ఈయనేగా సంబంధం కుదిర్చిందీ! దానికి అంతమంచిమొగుడు వస్తాడని సరస్వతమ్మ కలలోనైనా అనుకొని ఉంటుందీ? ఊళ్ళోవాళ్ళ కూతుళ్ళకుచేసేదానికన్న కన్నకూతురుకు ఎవరన్నా కాస్త ఎక్కువగానే జరుపుకోవాలా, వద్దా?

తనభార్య ఈధోరణిలో పడ్డప్పుడు శ్వేతాంబరం అస్త్రసన్యాసంచేసి వింటూ ఉండిపోయేవాడు. ఎందుకంటే గుణ అనే మాటల్లో వాక్యానికి రెండేసి అబద్ధాలుంటాయి. సరస్వతమ్మ కూతురు సుశీలకూ, కళ్యాణికి ఏమీ పోలిక లేదు. సుశీల చాలా తీరైనపిల్ల తెలివిగలది. ఆపిల్లకు వచ్చిన సంబంధం గుణ చెప్పేటంత గొప్పది ఏమీకాదు

పిల్లవాడికిఆస్థిలేదు. రెండువందలు సంపాదిస్తున్నాడన్నమాటే గాని కనుబొమలమీద వెంట్రుకల్లాగా ఎదుగూ బొదుగూ లేని ఉద్యోగం. ఇంకా పదేళ్లుచేసినా అదేజీతంరావచ్చు. లేదూ, రేపే ఉద్యోగం ఊడనూవచ్చు ఈ జీతంరాళ్ళల్లో ఇద్దరుతమ్ములకు చదువులు చెప్పిస్తున్నాడు. అందులోఒకడు కాలేజీ చదువు!—ఇంతాచేసి కుర్రవాడికి పలచనిజుట్టూ, మెల్లకన్నూ! తోలు ఎర్రగాఉంటే అందగాడైపోయాడా? ఇన్నిటికన్నా ముఖ్యమైనవిషయమేమంటే ఈ సంబంధం కుదిర్చింది శ్వేతాంబరం కానేకాదు. ఆ కుర్రవాడి పినతండ్రి శ్వేతాంబరానికి బాల్యస్నేహితుడు. అందుచేత ఆ అబ్బాయి పిల్లనుచూడటానికి తననుకూడా వెంటపెట్టుకువెళ్ళాడు...

కాని గుణ స్టీమ్‌రోలర్‌ను నడిపించిందంటే దాని ముందు ఏనిజము ఆగలేదు. దానిక్రిందపడి అన్నినిజాలూ రూపమాసిపోవలసిందే! అందుచేత శ్వేతాంబరం మాట్లాడక ఊరుకునేవాడు.

* * *

సీత చాలావిషయాల్లో తండ్రిపోలికే శ్వేతాంబరానికి గల నిగ్రహమూ, తీక్షణమైన బుద్ధీ వచ్చాయి. అంతేగాక, ఆమె తండ్రిలాగా మానసికంగా ఏకాంతవాసిని, ఆపిల్ల తండ్రితోగాని, తల్లితోగాని, అక్కతోగాని చెప్పకుండా తన కడుపులో దాచుకున్న ఆలోచనలు చాలాఉన్నాయి. ఆ సంగతి శ్వేతాంబరానికి తెలీదుగాని గుణమణికి తెలుసు. "మీరు మాట మాట్లాడితే సీతను వెనకేసుకొస్తారుగాని, అది పట్టికూచి' దొంగ! అమ్మో" అనేదావిడ భర్తతో.

తమకు కలిగిన ఇద్దరాడపిల్లలనూ భార్యాభర్తలిద్దరూ కూడబలుక్కున్నట్టుగా పంచేసుకున్నారు. కల్యాణి 'అమ్మ పిల్ల! సీత నాన్న పిల్ల! శ్వేతాంబరం భార్యతో "నీకూతురు" అంటే నూరింట తొంభైపాళ్ళు కళ్యాణి అన్నమాటే, అదే విధంగా గుణమణికూడా సీతను గురించి మాట్లాడేటప్పుడు-ముఖ్యంగా దెప్పుగా మాట్లాడేటప్పుడు—"మీకూతురు" అని తీసేది.

ఈ పంపకం గురించి సీత చాలా చిన్నతనంనుంచీ ఎరుగును. అంతేకాదు, ఇందులో ఏదో క్రూరత్వం ఉన్నట్టు ఆ పిల్లకు తోచేది.

ఒక్క ఇందులోనేకాదు, భార్యాభర్తలమధ్య ఉండే సంబంధాలూ, తల్లిదండ్రులకూ మధ్య ఉండే సంబంధాలు కూడా అత్యంత క్రూరమైనవిగా సీతబుద్ధికి తోచేవి. తన తల్లీ తండ్రీ ఎప్పుడు ఏ విషయం మాట్లాడినా వారి మాటల వెనక ఏదో పరస్పర విద్వేషం దాగి ఉన్నట్టు ఆ పిల్ల తెలుసుకోగలిగేది వాళ్ళు కూతుళ్ళ నిద్దరిని పంచుకున్నారేమో, ఒకరిమీద ఒకరికిగల తేలిక భావాలూ, కసీ, విసుగూ ఒకరి పిల్లలమీద ఒకరు చూపించుకునేవారు—అదికూడా గోప్యంగానే!

సీత నిత్యమూ ఘర్షణపడే దంపతులనుకూడా చూసింది. కాని అట్లా పోట్లాడుకోవటం కంటె తనతల్లి దండ్రులు సాగించే మూఢయుద్ధం మరింత క్రూరంగా ఉన్నట్టుండేది. "శ్వేతాంబరంగారూ, గుణమణిగారుకూడా నిజంగా

ఎంతో అన్యోన్యంగా ఉంటారు!" అని ఎవరన్నా అనుకుంటూంటే సీత ఆశ్చర్యపోయేది,

ఆ పిల్లమీద తన ప్రభావం ఏమీలేదని గుణమణి బాగానే గుర్తించింది. కాని శ్వేతాంబరం మటుకు సీత అచ్చు తనలాటిందే అని ఆత్మవంచన చేసుకునేవాడు. ఒకటి నిజం. సీత మనస్సుమీదతల్లిదండ్రులిద్దరిప్రభావమూతక్కువే. జన్మతః ఆమెకు చాలావరకు తండ్రి పోలికలూ కొంతవరకు తల్లి పోలికలూవచ్చాయి. ఆమె ఎనిమిదేళ్ళు వెళ్లేదాకా తన తల్లిదండ్రులలో ఎవరు రైటో, ఎవరుతప్పో తెలుసుకోలేక పోయేది. ఆ తరవాత ఇద్దరూ చాలావరకు తప్పేననే నిర్ణయానికి వచ్చింది. ఇప్పుడు సీతకు పదెనిమిది నిండాయి. ఈ పదేళ్ళుగా ఆమెమీద తల్లిదండ్రులిద్దరి ప్రభావమూ కూడా లేదు.

తాను మానసికంగా, ధృఢంగా, బలంగా ఉండగలందులకు సీత చాలా ఏళ్ళుగా ఎవరూ ఊహించని కృషి చేసింది. ఈకృషి సఫలమయింది, కాని, దాని ఫలితాలు తల్లికి ఒక విధంగానూ, తండ్రికి ఒక విధంగానూ కనపడేవి. "అది కఠినురాలు, కఠినురాలు!" అనేది తల్లి. "నాపోలికే... పట్టుదల!... ఉండాలిసిందే!" అనేవాడు తండ్రి. "పట్టుదల ఏం కాదు—మొండితనం!" అనేదితల్లి.

సీత మానసిక దార్ఢ్యంకోసం కృషి చెయ్యటానికి కారణం కల్యాణే. కాళ్ళలో సత్తువలేనివాళ్లు దేన్నయినా ఆనుకుని నిలబడ్డట్టుగా, కల్యాణి ఎవరినో ఒకరిని ఆనుకునేది మానసికంగా తనకన్న పెద్దదై ఉండి తననే ఆనుకునేది.

ఎవరుకూడా కల్యాణి మోస్తరుగా ఉండరాదని సీత నమ్మకం. అయితే సీతకు తన అక్కమీద కోపం ఏమీలేదు. ఆమెకు ఎవరి అశక్తతమీదా కోపంలేదు. అక్కడే శ్వేతాంబరానికీ, సీతకూ తేడా. ఇతరుల అసమర్థతపట్ల శ్వేతాంబరం చాలా క్రూరంగా ప్రవర్తించేవాడు. తనభార్య తనకన్న తెలివితక్కువ మనిషి అని తెలిసినాక ఆమె తెలివితక్కువతనాన్ని తన తెలివితో భర్తీ చెయ్యటానికి దాన్ని రెట్టింపు చెయ్యటానికి తన తెలివితేటలు ధారపోసేవాడు. గుణమణి మామూలు తెలివితేటలుగలవాణ్ణి చేసుకుని ఉంటే ఇంత కన్న రాణించి ఉండేది!...కల్యాణి విషయంలో కూడా తండ్రి ప్రవర్తన చాలా క్రూరంగా ఉన్నట్టు సీతకు తోచేది. ఒక ఇంట్లో, ఒక కుటుంబంలో ఉన్న మనుషులు ఒకరి నొకరు పరీక్షకుపెట్టి మార్కులు వేస్తూ కూచోవటంతోనే సరిపోతే ఇకవీళ్లు కలిసి జీవించేదెప్పుడు? ఒకరికొకరు సహాయపడేదెప్పుడు?

తనను చూసి తండ్రి గర్వపడే సంగతి సీతకు తెలుసు కాని, అందుకామె పెద్దగా సంతోషించేదికాదు. ఆయన కల్యాణినిచూసి ఎందుకు అవమానపడేవాడో, అందుకే తననుచూసి గర్వపడేవాడు——స్వాతిశయం! అంతకన్నా ఏమీలేదు. నిజంగా తండ్రి సహాయం ఎక్కువగా కావలసినది కల్యాణికి. అయినా కల్యాణి విషయం వచ్చేసరికి తండ్రి చేతులు ముడుచుకున్నట్టుగా ప్రవర్తించేవాడు.

కల్యాణి పెళ్ళి ప్రయత్నాలు విషయం చూడరాదా?

ఆయన సరియైన ప్రయత్నం చెయ్యటంలేదని తల్లి చేసిన ఆరోపణను సీత కూడా చాలావరకు ఆమోదించింది.

"రేపు సీతకు సంబంధం చూడాలంటే ఇట్లాగే తాత్సారం చేస్తారా?" అన్నది గుణమణి.

"సీతకి సంబంధం తీసుకురావటానికి అరనిముషం పట్టదు." అన్నాడు తండ్రి.

ఈ మాటకు సీత సంతోషించలేదు తనకు సులువుగా సంబంధాలు వచ్చేపక్షంలో ఆయన తన సర్వస్వమూ ధారపోసి అక్కకే సంబంధం తీసుకురావచ్చుగద!

సీతకు ఇంకో విషయం కూడా తెలుసును. కల్యాణికి మంచి సంబంధం రావటానికి తెను అడ్డుగా ఉన్నదని తన తల్లి నమ్మకం! ఆవిడ అట్లా అనుకోవటంలో తప్పేమీ లేదు. కొన్ని సంబంధాల వాళ్ళు "మీ రెండో అమ్మాయిని చేసుకుంటాం" అని అనటం జరిగింది.

తన అక్కకు చాతయితే, సహాయపడాలని సీత ఉద్దేశంగాని, ఆమెకు ప్రతిబంధకంగా ఉండాలని కాదు. కాని, తాను చేయగలిగినదేమీ ఉన్నట్టు కనపడలేదు.

"జీవితం ఎంత క్రూరమైనది! ఎంత నిర్దాక్షిణ్యమైనది!" అనుకున్నది సీత.

*　　　*　　　*

కల్యాణికి సంబంధం వచ్చింది. వరుడు పాతికేళ్ళవాడు. వాళ్ళకేమీ లేదుట. ఇతనుమటుకు రెండువందలయాభై

తెచ్చుకుంటున్నాడు. ఈకాలంలో పాడిబియ్యే అక్షరాలతో రెండువందలయాభై తెచ్చుకోవటం ఘనమే. కాని, ఈ అబ్బాయి ప్రకాశంవిషయంలో అంత ఘనంగా చెప్పుకొనటానికిలేదు. ఎందుకంటే అతనిపై పెద్ద కుటుంబభారం ఉంది. అతని అన్న చనిపోయాడు ఆయన ప్రకాశంకంటె తొమ్మిది పదేళ్ళు పెద్దవాడు. క్రిమినల్ లాయర్‌గా మంచి ప్రాక్టీసుండేది. ప్రకాశం చదువంతా ఆయనే చెప్పించాడు. ఆయనకు అయిదుగురు పిల్లలు – అందులో ముగ్గురు ఆడ పిల్లలు! ఆయన ఆకస్మికంగా చనిపోవటంతో ఆయన కుటుంబ భారం ప్రకాశంపైన పడింది.

"అందుచేత నా సంపాదన నాకు ఏమూలా చాలదు. మా అన్న పిల్లల్లో ఆఖరువాడు తప్ప అందరూ చదువుకుంటున్నారు. నేను న్యాయంగా పెళ్ళిచేసుకోనే రాదు. నే చేసుకోబోయే భార్యతరఫునుంచి ఏదైనా ఆర్థిక సహాయం ఉండే పక్షంలోనే పెళ్ళాడతాను" అని ప్రకాశం పెళ్ళి చూపులకు వచ్చినప్పుడు కుండ పగలేసి చెప్పేశాడు.

అతను వెళ్ళటానికి లేచినప్పుడు శ్వేతాంబరం, 'సరే, నాయనా! నువ్వు వెళ్ళి రండు. మూడు రోజులలో నీ నిర్ణయం తెలియజెయ్యి. ఈలోపల మేంకూడా ఒక నిర్ణయానికి వస్తాం' అన్నాడు.

"నా నిర్ణయం నేను ముందే చెప్పేశానుగద! అధమం యింకో అయిదేళ్ళపాటు నేను మా అన్న కుటుంబాన్ని పోషించాలి. అప్పటికి పెద్ద కుర్రాడు కాస్త తన

కాళ్ళమీద నిలబడగలుగుతాడు. ఆతరవాత అంత ఇబ్బంది ఉండదు. కట్నంగా ఇచ్చినాసరే, నెలనెలా రెండువందలకు తక్కువ కాకుండా నాకు సహాయం చెయ్యగలిగినా సరే నేను పెళ్లికి సిద్ధంగా ఉన్నాను" ప్రకాశం చెప్పిన నవ్వి, 'ఇది ఒకబేరంకింద అడుగుతున్నా ననుకోకండి. నాకు వెనక ఆస్తిఉంటే నేనడిగేదానికి మూడింతలు అడక్కుండానే ఇచ్చి ఉండురు!...కాని, ఇది నా పరిస్థితి, దాన్ని దాచి లాభం లేదు' అన్నాడు.

"సరే, ఆలోచిద్దాం!" అన్నాడు శ్వేతాంబరం.

గుణసుందరి ఎంతో ప్రయత్నంమీద తననుతాను నిగ్రహించుకుని ఉండాలి. ప్రకాశం గడపదాటగానే ఆవిడ అగ్నిపర్వతంలాగా బద్దలయింది.

"ఛీ ఛీ! ఎంత నాగరికతలేని మనిషి! 'నువ్వూ వద్దు, నీతో సంబంధమూ వద్దు' అని చెప్పెయ్యక ఆలోచిస్తామంటారేమిటి? ఏమిటుంది ఆలోచించటానికి? ఈ సంబంధానికి నేను చచ్చినా ఒప్పుకోను" అన్నదావిడ.

"ఆమాటే ఒక కార్డుముక్క రాస్తే పోలా! అతని మొహానే అనాలని ఏముంది? అదిమాత్రం ఏంనాగరికతా?" అన్నాడు శ్వేతాంబరం.

"అటువంటివాళ్ళతో అట్లాగే ప్రవర్తించాలి!"

ఇది ఆవిడ తరుచు అనేమాటల్లో ఒకటి. తనకొక నాగరికత ఉన్నట్టు ఆవిడ ఎప్పుడూ ఒప్పుకునేదికాదు. అవతలివాళ్ళనుబట్టి కూడా ప్రవర్తించాలని ఆవిడ సిద్ధాంతం.

ఈ సిద్ధాంతాన్ని శ్వేతాంబరం ఏనాడూ అర్థం చేసుకోలేదు; గుణమణి ఆ సిద్ధాంతాన్ని విసర్జించనూ లేదు!

"అతన్ని మర్యాదగా పంపినందువల్ల నష్టంలేదులే. అతను కుండపగలేసి తనసంగతి చెప్పినట్టే మనంకూడా కుండపగలేసి మనపరిస్థితి అంచనా వేసుకోనటం మంచిది కాదూ!" అన్నాడు శ్వేతాంబరం.

"ఇంత పోగొట్టుకుంటే కల్యాణికి ఇంతోటి సంబంధం మరి రాదనేగా మీరనేదీ!" అన్నది గుణమణి తీవ్రంగా.

"నేనా మాట అనటంలేదుగాని ఈ సంబంధం మనం అనుకున్నంత తీసేసినది కాదేమోనని నా ఉద్దేశం" అన్నాడు శ్వేతాంబరం చాలా ఓర్పు అభినయిస్తూ.

"ఇంతకన్న చచ్చు సంబంధం మీరు కావాలన్నా తీసుకురాలేరు!" అన్నది గుణమణి, ఛాలెంజి చేస్తున్న దానిలాగా.

"నా కళ్ళకి కుర్రాడు చాలా అందంగా ఉన్నాడు. అతను కాస్త ప్రయత్నిస్తే ఏ సినిమా వాళ్ళయినా ఎగరేసుకుపోవచ్చు!"

"ఇంకేం; ఆపనే చేసుకోమనండి! కావాలంటే మీరు కాస్త సహాయం కూడా చేసిపెట్టండి!"

"కాస్త తాపీగా ఆలోచించవలసినసమయంలో నువ్వు కాస్త వేడెక్కిపోతావు. నే చెప్పేది కాస్త శ్రద్ధగా విను. ఇతని అన్న నెలకి రెండువేలు చొప్పున సంపాదిస్తాడట.

ఆయనే ఇప్పుడు బతికుంటే ఈ సంబంధం మంచిదని నువ్వు ఒప్పుకునేదానివేనా?"

"బతికి లేడుగా!"

"ఆ మాట నాకు తెలీదూ!" అన్నాడు శ్వేతాంబరం ఓర్పు కాస్తా పోగొట్టుకుంటూ.

"తెలిసి ఎందుకడుగుతారూ! ఇది మంచి సంబంధమని నా చేత అనిపించటమేగా మీ ఉద్దేశం? ఇతనికి ఓ లక్షరూపాయల ఆస్తివుంటే మంచి సంబంధమేనా, అని అడగరాదూ? ఉన్న సంబంధం ఉన్నట్టుగా ఆలోచించాలి గాని అయితేలా, గయితేలా ఇప్పుడెందుకంట!" అన్నది గుణమణి.

శ్వేతాంబరం అందామనుకున్న మాట అనే అవకాశమే లేకపోయింది. ఆయన హేతుబద్ధంగా మాట్లాడుదామనుకున్నప్పుడల్లా గుణమణికి మరింత ఆవేశం వస్తుంది. ఈ సంగతి సీత తన చిన్నతనంనుంచీ కళ్ళారా చూస్తున్నది.

"మనం ఇంత ఘర్షణ పడేకన్న అమ్మాయి ఏమంటుందో తెలుసుకోవటం మంచిది కదూ!" అంటూ శ్వేతాంబరం కల్యాణికేసి చూశాడు.

కల్యాణి ఒక్కసారి తల్లివంక చూసి, "ప్రైవేటు మాస్టర్ని పెట్టినట్టు నెలజీతంమీద నాకు మొగుణ్ణి పెడతారా? నాకిష్టంలేదు ఆ మనిషి అంత స్పష్టంగా డబ్బుకోసం పెళ్ళి చేసుకుంటుంటే నేనెట్లా ఇష్టపడతానూ?" అన్నది.

శ్వేతాంబరానికి ఓర్పు కాస్తా పోయినట్టుంది. "నాకు తెలీకడుగుతాను, నీ అందం చూసి మురిసి చేసుకునే వాడే

అయితే వాడేపాటి అందగాడై ఉంటాడు? ఇంకోరి బండారం ఎంచేముందు మన బండారంకూడా ఎంచుకోవాలిగా" అన్నాడతను.

"అట్లా అయితే దానిఇష్టం ఎందుకడుగుతారూ? డబ్బుందిగనక దానికొక మొగుణ్ణి కొనిపారెయ్యండి, ఉద్ధరింపు అవుతుంది. అసలు మనకున్న సంస్కారమే అంతే! అంతకంటె ఎక్కువఉన్నట్టు నటించటంకూడా దేనికి?" అన్నది గుణమణి.

"ఒకవేళ ఆ ప్రకాశంకోరిన షరతులు ఒప్పుకుని పెళ్లి నిశ్చయించాననుకో, నేను నాకూతురికి పనికిమాలినసంబంధం చేశానని నలుగురూ నవ్వాడిపోస్తారా?" అని అడిగాడు శ్వేతాంబరం.

"నలుగురూ అనుకునేదానికీ, పెళ్ళాం పిల్లలు అనుకునేదానికీ ఏమీ తేడాలేదా?"

"పెళ్ళాంపిల్లలు పైత్యానబడి తెలుపును నలుపంటే దాన్ని శిరసావహించాలిసిందేనా?"

'ఇక వీళ్లు ఒకరికొకరు ప్రశ్నలుతప్ప వేసుకోలేరు!' అనుకున్నది సీత. తన తల్లిదండ్రుల ఘర్షణలో వివిధదశలు ఆపిల్లకు కొట్టిన పిండి

"ఎందుకండీ ఈ డొంకతిరుగుడు మాటలూ? ఈ సంబంధమే సీతకువస్తే ఇంతఆత్రంగా ఒప్పేసుకుంటారా?" అని అడిగింది గుణమణి. ఆవిడ అంచనాప్రకారం ఇది తన

భర్తను మర్యాదగా చూడాలి! పడికట్టురాళ్ళలాగా ఆవిడకు ఇటువంటి ప్రశ్నలు కొన్ని ఉన్నాయి. వాటిని ఆవిడ చాలా "ప్రాక్టికల్"గా ఉపయోగించేది. ఒక్కొక్కసారి అవి ఫలితాలిచ్చేవికూడానూ.

"అయితే గియితేలు నీకు సుతరామూ సరిపడవుగా" అన్నాడు శ్వేతాంబరం వెటకారంగా.

"నేనడిగినదానికి సమాధానం చెప్పరేం?" అన్నది గుణమణి.

"నాకు నువ్వనుకునే పక్షపాతాలేమీ లేవు. సీతకు సమ్మతమైతే నే నభ్యంతరం చెప్పను" అన్నాడు శ్వేతాంబరం.

"దానికి ఇష్టం లేదంటే శాపనార్థాలు పెట్టారుగా?" అన్నది గుణమణి.

శ్వేతాంబరం ఉక్కిరిబిక్కిరి అయాడు. తనకీసంబంధం ఇష్టం లేదని కల్యాణి అనగానే చర్చ ముగించిఉంటే ఆయన కింత విపత్తుగాకపోను!

తలవనితలంపుగా సీత ఆయనకు సహాయమువచ్చింది.

"నేనైతే ఈసంబంధానికి ఒప్పుకుంటానమ్మా!" అన్నది సీత.

గుణమణి ఏదో అనటానికి నోరు తెరిచింది, కాని ఏమీ అనలేదు.

"అక్కకి మరొకసంబంధం చూచి పెళ్లి చేసేదాక ఇతను ఆగిఉండేట్టయితే నేను తప్పక చేసుకుంటాను. తనకు అన్న చదువుచెప్పించినందుకు కృతజ్ఞత కలవాడు బొత్తిగా మొరటుమనిషి అయియుండడు. మనకన్న నయమే అనుకుంటాను. అయినవాళ్ళమీద ఆపేక్ష చూపేవాళ్ళనుగురించి మనం — మనం — వేళాకోళంగా మాట్లాడుకోవటం నాకేం బాగాలేదు" అంటూ సీత కూర్చున్నచోటినుంచి లేచి అవతలికి వెళ్ళిపోయింది. మిగిలిన ముగ్గురూ ఆపిల్లకేసి నోళ్లు తెరుచుకుచూస్తూ ఉండిపోయారు.

---

# అనాధరక్షణ

ఇందిరకు పట్నం నిండా స్నేహితులే. వాళ్ళల్లో నేనూ ఒకణ్ణనుకోండి.

కాని నే నెరిగినంత బాగా ఇందిరని మరెవ్వరూ ఎరగరని నానమ్మకం. ఇందిరకు కాస్తో కూస్తో పిచ్చి ఉందని తెలుసుకున్నవాణ్ణి నే నొక్కణ్ణే!

ఇందిర ఇంటర్మీడియేట్ పాసయింది. ఆమె కింకా వెళ్ళి కాలేము, ఇక కాదు.

వాళ్ళ అమ్మా నాన్నా ఇందిర నింటికి రానివ్వరు. ఇందిర తన ఎత్తు ధనం పోసినా పోనుకూడానూ.

అమ్మదగ్గిరికీ, నాన్నదగ్గిరికీ వెళ్ళాలిసిన అవసరం లేదిందిరకు. ఇందిర పినతండ్రి కొడుకు సోమయాజులు ఆభోగం వాళ్ళమ్మాయిని పెళ్ళాడి, ఉద్యోగం చేస్తూ పట్నంలోనే

ఉన్నాడు. ఆ పెళ్ళిని అందరికంటె ముందుగా రెండు చేతులూ ఎత్తి ఆశీర్వదించినది ఇందిరే!

సోమయాజులు గారిల్లు కేంద్రంగా పెట్టుకుని ఇందిర పరిభ్రమిస్తూ ఉంటుంది.

నవమస్థానంలో కాబోలు శనో ఏదో ఉండటం మూలాన ఇందిర ఇతర్ల కష్టాలు చూసి భరించలేదు. ఓమాట సలహాగాని, యథాశక్తి చాకిరిగాని, ఎవరిదగ్గిర్నించన్నా తీసుకుని ఓ అయిదురూపాయల నోటుగాని అనాథల కివ్వకుండా ఇందిర రోజు గడపలేదు.

నా కిందిరపరిచయం ఎట్లా అయిందో చెప్పటానికి కొంచెం సిగ్గుగాఉంది...

"ఇందిరకంటె సులభంగా చేతి కందే మనిషి ఉండబోదు" అని ఓ స్నేహితుడు జారవిడిచాడు.

"డబ్బుమాట?" అన్నాను, కాస్త జాగర్త మనిషిని గనక.

నా స్నేహితుడు నవ్వి, "ఇందిర ఎట్లాగైనా డబ్బు వొదిలిస్తుంది—పరిచయం కూడా అక్కర్లేదు, మొహం ఎరిక ఉంటేనే చాలు... అయితే ఎన్నడూ సొంతాని కని అడగదు—ఎప్పుడూ లోకోపకార్థామే!"

ఇందిరతో పరిచయం అయింతరవాత నా స్నేహితుడికి ఊహాశక్తి లేదని తెలుసుకున్నాను. అతను నాకు ఇందిర ఆడతనం ఆశ చూపాడు గాని, అసలామనిషి వెయ్యి వరహాలవిలవ చేస్తుంది. ఇందిర మొగవాడే అయినా ఆమనిషి నెరగటం ఓ అద్భుతమైన అనుభవమే.

ఇందిర అమూల్యమైన మనిషి.

ఆమె ఆడతనంజోలికి వెళ్ళలేదని కాదు - వెళ్ళాను. పరిచయమైన కొద్దిరోజులకే ఇద్దరమూ కలిసి అట్లా సినిమాకు వెళ్ళి అటునుంచి నాగదికి తీసుకెళ్లాను. పన్నెండింటి దాకా ఇందిర నాకు అందరి కష్టాలూ చెప్పి, పొద్దుపోయింది వెళతా నన్నది.

నేను వొద్దన్నాను. ఆ రాత్రికి నాగదిలో ఉండి పొమ్మన్నాను ఎవరికన్నా తెలిస్తే ఏమన్నా అనుకోరా అన్నది. వాళ్ళనుకోవటం అబద్ధం చెయ్యటం దేసికన్నాను.

ఇందిర కొంచెం ఆలోచించి తనమీద నాకు ప్రేమా అనడిగింది ఎందుకంటే నేను ప్రేమఉన్నట్టు కనిపించలేదన్నది.

నాకు ప్రేమలో నమ్మకం లేదన్నాను.

ఇందిర మొహం చాటంత అయింది. ఆమె వెళ్ళే ప్రయత్నం మాని, మళ్ళీ కుర్చీలో కూచుంటూ నాకు ప్రేమ ఏమిటో చెబుతా నన్నది. అని చెప్పింది.

శ్రీనివాసరావని ఓ అబ్బాయి. తనకన్న ఒక్క ఏడాదే పెద్ద. మెడ్రాసులో చదివేవాడు. వాళ్ళు చాలా భాగ్యవంతులు. సీనుకు చాలాచిన్నతనంలోనే పెళ్లి అయింది. పట్నంలో అడ్డమైన స్నేహితులందర్నీ దగ్గరికితీసి డబ్బు తగలేసేవాడు. ఎవరికీ కాదనలేడు. అతన్ని ఉద్ధరించే ఉద్దేశంతో తను అతని సావాసం ప్రారంభించి అతనికి గార్డియన్ అయింది.

మగవాడికీ ఆడదానికి సావాసం అయినతరువాత అది ప్రేమగా పరిణమించకుండా ఎట్లా ఉంటుందీ? అందులో సీను తనని గాఢంగా ప్రేమించాడని తనకు మొదటనే తెలిసిపోయింది. అయితే సీను వొట్టి మేక కావటంవల్ల భయపడ్డాడు. అతని అవస్థ చూళ్ళేక తనే అతన్ని ప్రోత్సహించింది.

సీను తనని ఎట్లా ప్రేమించాడో వర్ణిస్తే తీరదు. అతని కింక ప్రపంచమే లేదు. చదివేవాడు కాడు నాకోసం చదువు పాడుచేసుకోకు అని సలహా చెప్పటంకూడా ఎంత క్రూరం! ...ఆ ప్రేమలో పడిపోయి సీను తన కష్టసుఖాలుకూడా విచారించేవాడుకాడు. కాని తను అతని ప్రేమకోసం ఎన్ని కష్టాలైనా పడింది

ఇంకోతమాషా ఏమిటంటే, సీను ఇంతప్రేమలోనూ తనతో వొందసార్లు రోజూ పోట్లాడేవాడు. తన ప్రతి చూపునూ, మాటనూ విమర్శించి తన కతనిమీద ప్రేమ లేదని తేల్చేవాడు. వొట్టి పసిపిల్లవాడి వతు!

ఇంక సీను అసూయ చెప్పటానికి వీల్లేదు. తన ఇతర స్నేహితులు, నాబోటివాళ్ళుంటారా, వాళ్ళందరు తన ప్రేమను పంచుకుంటున్నారని చెప్పేవాడు. అతనికి తనుతప్ప ప్రపంచములో ఆడదే లేదు. తనకూ అతనుతప్ప ఇంకో మగాడే లేనట్లుండేది. కాని యథార్థంగా ఉన్నవాళ్లతో విరోధం తెచ్చి పెట్టుకుంటానా, చెప్పండి!...

ఈసీను ప్రణయకథను ఇందిర ఎంతో ఉత్సాహంతో పూర్తిగా గంటసేపు వర్ణించింది. నే నడ్డుపడకపోతే ఈ కథ తెల్లార్లూ నడిచేట్టు కనిపించింది.

"ఏమో...ఇటువంటి ప్రేమలో నాకు విశ్వాసం లేదు...టూసీను వొట్టి స్వార్థపరుడల్లే ఉన్నాడు. నే నింత సేపూ విన్నకథలో సీను అనేవాడికిగల ఆత్మప్రియత్వం ఒకటి కనిపిస్తున్నదిగాని—" అని ప్రారంభించాను.

"అయ్యో! నన్నేమాటలన్నీ అని కళ్ళనీళ్ళు పెట్టుకునేవాడండి!...సీనుహృదయం నేను బాగా ఎరుగుదును!" అన్న దిందిర.

"అదృష్టవశాత్తూ నాకు ప్రేమంటే ఏమిటో తెలీదు. కాని ఎప్పుడెవడదాన్ని ముద్దుపెట్టుకోబుద్ధి అయేదీ నాకు తెలుసు...ఇప్పుడు నిన్ను ముద్దుపెట్టుకోబుద్ధి అవుతున్నది. ను వ్వీకథంతా కాసేపు కట్టిపెడితే—"

•

## 2

ఇందిరతో ప్రణయం నడపటం అంటు సులభమైన విషయం లేదు. కామాన్ని ఆకలిదప్పుల లెక్కకు తెచ్చింది నా కోరిక ఇందిరే కనిపిస్తున్నది.

అనేకమందికి చప్పున వశమయిందిగదా అని ఇందిర వొట్టి పిటి దనటం తప్పేమో అనుకుంటాను. ఇందిర వెకిలి

మనిషి కాదు. ఇతరులల్లే తనదగ్గిర ఏదో దాచుకోదగినముల్లె ఉన్నట్టు నటించదు; మనస్సు చప్పున ఇచ్చేస్తుంది—మన స్సిచ్చి శరీరం దాచుకోదు... ప్రపంచంచేత తప్పు పట్టించుకో కుండా ప్రవరిస్తూ వెకిలితనం వెళ్ళగక్కే—వాళ్ళు చాలామంది ఉన్నారు.

ఇందిరని నేనెప్పుడూ ఏమీ అనను, విమర్శించను; ఇందిర కేమీ బోధించను, ఉపదేశించను; ఇందిరను తేలిక చేసిచూడను, అన్యాయం చెయ్యను.

ఇందిరను అన్యాయం చేసినవాడు పురుగులుపడి పోతాడు.

అయితే నేను ఇందిరని ఆరాధించలేదు, ఆమెను గురించి కలలు కనలేదు. ఆవిడచుట్టూ గగనసౌధాలు కట్ట లేదు.

ఈపనులు చెయ్యలేకపోవటం పెద్దతప్పుగా నాకు తోచలేదు.

ఈనాటి సంస్కారం—తెలుగువాళ్ళ సంస్కారం – ఇందిరకంటె ఉత్తమమైన మనిషి నివ్వలేదని నేను గట్టిగా నమ్ముతాను.

వైకుంఠ మనేది ఉంటే ఇందిర చచ్చి వైకుంఠానికి పోతుంది.

ఇందిరకూ నాకూ ఏదో ఉందని తెలియగానే కొందరు మూర్ఖులు మా రంకు ప్రచారంచేసి మాకేదో అప ఖ్యాతి తేవాలని చూశారు మా రంకు గోప్యంగా ఉంచ

టానికి నే నెటువంటి ప్రియత్నమూ చెయ్యలేదని వాక్రైర గరు.

మరికొందరు మూర్ఖులు—ఇందిరతో సంబంధం ఉన్నవాళ్ళు — నన్నుచూసి అసూయపడాలనికూడా చూశారు...ఇందిర ప్రచారం చేస్తున్న ఉత్తమజాతి సంస్కారం వాళ్ళ కేకోశానా అరగలేదు, పాపం!

నామటుకు నాకు అసూయలో ఏమీ విశ్వాసం లేదు .. అది జీవశక్తిని దుర్వ్యయం చెయ్యటమేగాని మరోటి కాదు.

అపఖ్యాతికి వెరవక, అసూయలో విశ్వాసం లేని వాణ్ణి ఎవరేం చెయ్యగలరూ?...మమ్మల్ని గురించిన అల్లరి దానంతట అదే సద్దుమణిగింది.

నేను ముఖ్యంగా కోరింది ఇందిర శరీరంకాదు— ఇందిర స్నేహం. దాన్నెవ్వరూ అడ్డలేకపోయినారు.

అడపా దడపా అయిదురూపాయల నోట్లిచ్చుకుని ఇందిరద్వారా అడ్డమైనవాళ్ళనూ ఆదుకుంటూ ఇందిర స్నేహితానికి పాత్రుణ్నయినాను.

## 3

ఓరోజున ఇందిరవెంట సీను మా గది కొచ్చాడు. తనకూ ఇందిరకూ ఏమీసంబంధం లేనట్టు ప్రవర్తించటానికి అతను పడే పాట్లు చూసి అతను సీనేనని పోల్చుకో గలిగాను.

ఇందిర సీను మొహంవిూదినించి కళ్లు తియ్యలేకుండా ఉంది—నాతో మాట్లాడేటప్పుడుకూడా.

"ఈయనే శ్రీనివాసరావు" అన్న దిందిర.

"నే నట్లాగే అనుకున్నాను!" అన్నాను.

"కాకినాడలో మంచిపేరుగల ప్లీడరు. నెలకి అయిదారు వొందలు సంపాయిస్తాడు నిక్షేపంగా!"

ఈ మాట శుద్ధ అబద్ధంగా కనిపించింది. అతను ప్లీడరీ మొదలుపెట్టి ఏ రెండుమూడేళ్ళు తప్ప అయియుండదు. అతను వయసులో నా కంటె అధమం పదేనిమిదేళ్ళు చిన్నల్లే కనిపించాడు. అతను కాకినాట్లో, ఈరోజుల్లో అయిదారొందలు సంపాయిస్తున్నాడంటే ఎట్లా నమ్మటం?

కాని సీను ఇందిరకు ఎదురు చెప్పలేదు.

నాకు సీనును చూస్తే అసహ్యం వేసింది అతనికి మటుకు నామీద అనుమానం కలిగినట్టు లేదు. అతన్ని ఇందిర కళ్ళతో అంత ప్రత్యక్షంగా ఆరాధిస్తుంటే నాలో ఏ వికారము లేకపోవటం అతనికి నమ్మకం ఇచ్చిఉంటుంది.

నాలో కొంతవికారం కలక్కపోలేదు. ఇందిర నన్నే అట్లా కళ్ళతో ఆరాధిస్తే నేను ఆమె నెప్పుడో మార్చిఉండేవాణ్ణి—అధమం కృతజ్ఞతఅయినా ప్రకటించి ఉండేవాణ్ణి. అతని మొహంలో అటువంటి కృతజ్ఞత ఏమీ కనుపించలేదు.

ఇందిర తనని ఆరాధిస్తుంటే సీను తన స్వార్థంగురించి ఏదో ఆలోచిస్తున్నాడు!

సీను మనస్సులో ఏదో క్షోభఉన్నట్లు కనిపించింది.

అయితే ఆ క్షోభకూ, ఇందిరకూ ఏమీ సంబంధం ఉన్నట్టు లేదు.

రెండు మూడు రోజులు ఇందిర నాకగుపించలేదు... ఓ రోజు రాత్రి పొద్దుపోయి నాగదికివచ్చి పరధ్యానంగా కూచున్నది.

"సీను వెళ్ళాడా?" అన్నాను.

"పాపం... వెళ్ళాడు!" అన్నది.

పాపానికి కారణం అడిగాను.

"బోలెడంతఆస్తి... లక్షణంగా బోలెడంత సంపాయిస్తాడు... కాని క్షనుకు ఇంట్లో సౌఖ్యం లేదు. రంభంటి పెళ్ళాం. కాని ఆ మనిషికి హృదయం లేదు సీనుది చాలా సుకుమారమైన హృదయం ఆ మనిషి తనకెంత గొప్ప మొగుడు—ఎంత మంచి మొగుడు దొరికాడో తెలీక అతని హృదయాన్ని సూదులు పెట్టి గుచ్చుతుంది... సీను బాధపడతాడు, కాని ఇతర్లని బాధ పెట్టలేడు... అదిచూసి ఆవిడ నానాటికి విజృంభించింది... పైగా అత్తగారుకూడా ఇంట్లోనే ఉంటుంది. తల్లీ కూతురూ ఏకమై అతని మనస్సును శాంతి లేకుండా చేస్తున్నారు" అని చెప్పిందిందిర.

"ఇద్దరాడవాళ్ళని అదుపు చెయ్యలేని వాణ్ణి గురించి మనం విచారించి ఏం లాభం?"

"అతను అదుపు చెయ్యగలిగితే మనం విచారించనే అక్కర్లేదుగా!" అన్నది ఇందిర.

సీను భార్యకలు నిచ్చాడు. కొందరు కొందరు ఆడ దాని శరీరాన్ని తమ ఆత్మాభిమానంతో కొనుక్కుం టారు. సీను అటువంటిపనే చేశాడు.

సీను భార్య అసలే ధనికులబిడ్డ. అహంకారతిశయా నికి లోటులేదు. మొగుడికి తన బంధంతప్ప ఇంకేమీ ఉండ రాదని తీర్మానించుకుంది. అవతలిమనిషి మనసు నొప్పించ టానికి ఆవిడకు అభ్యంతరంలేదు సరేకదా నొప్పించే విద్య లోకూడా ఆరితేరినది.

ఇందులో ఆవిడకు శిక్షణ యిచ్చినమనిషి సీను అత్త గారు.

సీను సుకుమార హృదయుడనే దానికేమీ సందే హంలేదు. ఆ భావకవి హృదయం అగత్యం కలిగినప్పుడన్నా ముక్కుపుటా లుబ్బించి రంకె వెయ్యలేదు.

సీను తమ యిష్టానుసారం ప్రవర్తించినప్పుడల్లా తల్లి కూతుళ్ళిద్దరూ చడామడా పోట్లాడుకుని రెండు వేపుల్నుంచీ సీనును నానామాటలూ అనేవాళ్ళు.

సీను ఇద్దర్నీ చెరో మొట్టికాయా వెయ్యక ఇంట్లోంచి లేచిపోయ్యేవాడు.

ఒకరోజు సీను ఇంటికొచ్చేటప్పటికి ఇంటో వంటా తంటా ఉండేదికాదు.

సీను హోటలుకెళ్ళి భోంచేసేవాడు.

నిత్యమూ ఇదేవరస. కావటానికి బ్రాహ్మలూ, సంప న్నులూ కాని, ఎంత అలగా కాపరంకూడా ఒకప్పుడు కాక

పోతే ఒకప్పుడన్నా బాగుంటుంది. ఈ కాపరం దానికన్నా అన్యాయం.

ఇందిర దిగగానే ఇంటో ఆడవాళ్ళకామె ఎవరో తెలీదు. సీను ఇందిర పేరయినా పెళ్ళాం దగ్గిర ఎన్నడూ యెత్తలేదు, దాచాడు!

ఇందిర సీనుకు చాలా సలహాలిచ్చింది. అత్తగార్ని పంపెయ్యమన్నది. ఇంటో ఆడవాళ్లకు డబ్బు అందనివ్వొద్దన్నది.

తల్లికూతుళ్ళు పోట్లాడుకునేటప్పుడు పారిపోవద్దన్నది. అది అతనిమీద వాళ్ళు ఆయుధంకింద ఉపయోగిస్తున్నారన్నది.

సీను అన్నింటికీ, «నీకు తెలీదిందిరా!» అని సమాధానం ఇచ్చాడు.

"అసలు నువ్విప్పుడెందుకొచ్చావు?" అన్నాడు.

ఇందిర వినిపించుకోలేదు. రెండురోజులపాటు అతని దగర ఉన్న డబ్బంతా తనదగ్గిరే ఉంచింది ఇంటిఖర్చుకు తనే లెక్కపెట్టి యిచ్చింది.

"నా భార్య కావాలన్నది పది రూపాయలియ్యి!" అని సీను అడిగితే ఇందిర ఖచ్చితంగా లేవన్నది.

ఆ రోజు కొంపలో రాగాలు, పెడబొబ్బలూ ఎక్కువయినై. ఇంటో నిప్పు రాజెయ్యలేదు.

ఎవత్తో వచ్చి నా కాపరం చెడగొట్టుతున్నదో — అని సీను పెళ్ళాం పెడబొబ్బలు పెట్టింది.

సీను కొంపలో లేకుండా మాయమైనాడు.

ఇందిర సీను పెళ్ళాంతో ఖచ్చితంగా చెప్పేసింది.

"ఈ శషభిషలు నాదగ్గిర సాగవు. ఈ సీనును సరిగా చూసేదాకా నేను వెళ్ళను. సీనుమీద నీకెంత హక్కుందో నాకూ అంత హక్కుంది-కావలిస్తే ఇంకా ఎక్కువే వుంది!"

మర్నాడు కొంపలో మార్పుకలిగింది. సీను భార్య, అత్తగారూ ఉదయం లేచింది లగాయితు ఎంతో సఖ్యతగా వుండడమేగా సీనుతో కూడా యెంతో అపేక్షగా ఉండటం మొదలుపెట్టారు. సీను మొహం చాటంత అయింది.

ఇందిరే కరిగిపోయింది. మర్నాడుదు కాసీపు సన్నాసు డల్లే ప్రవర్తించినప్పుడు అమాయక హృదయాలకు కలిగే ఆనందానికి సామ్యంలేదు.

ఉదయమే సీనుకూ ఇందిరకూ కాఫీ ఉప్మాలు పెట్టారు. మధ్యాన్నం సీను అత్తగారు పులిహోర చేసింది. భోజనాల దగ్గర సీను ఇందిరతో, "పులిహోర చేస్తే మా అత్తగారే చెయ్యాలి. ఇంకెవరు చేసినా నాకు బాగుండదు" అన్నాడు

"మిగిలినవంట యావత్తు మా అమ్మంత బాగా చేస్తానుగాని ఆ పులిహోర మటుకు కుదరదు" అన్నది సీను పెళ్ళాం.

"అయ్యో! కిందటేడు మా చెల్లెలు కూతురు పెళ్ళిలో నేను పులిహోర చేస్తే వంట బ్రాహ్మణులు వెల్లికిలా పడ్డారు! మారు వడ్డించడానికి లేకపోయింది..." అని సీను అత్త గారు ప్రారంభించింది.

ఇందిరకు పులిసూరీలో ఉప్పెక్కువయిందనిపించింది, కాని చాలా బాగా కుదిరిందని ఒప్పుకుంది.

ఆరోజు సాయంకాలం ఇందిర తన దగ్గిర ఉన్నడబ్బు సీనుకు వప్పగించేసింది.

"ఇక ఫర్వాలేదు. నీ కాపరం ఇట్లాగే నడిచిపోనీ!" అని సీనుకు సలహా ఇచ్చింది ఇందిర.

సీనుకూడా ఫర్వాలేదని ఒప్పుకున్నాడు.

"అదిన్నీ, ఇక నువు పట్నం వెళ్లిపో... నే చెబుతాగా!" అన్నాడు సీను.

ఇందిరకు ఆశ్చర్యం వేసింది. తాను చేసిన ఉపకారం చూసి సీను, తాను వెడతానన్నా పోనివ్వడన్న విశ్వాసంతో ఉన్నది ఇందిర. అదీకాక అతను సుఖపడటం కళ్లారా చూద్దామనే కాంక్షకూడా ఇందిరకు లేకపోలేదు.

"ఏం?" అన్న దిందిర.

"నే చెబుతాగా!... అదేమంచిదీ!" అన్నాడు సీను.

"మళ్ళీ కొంపలో అల్లరి జరక్కుండా చూసుకుంటావు కద!" అన్నది ఇందిర...

"స్టేషనుదాకా రావు, సీనూ?" అన్న దిందిర.

"వొద్దునుగాని.... మా అత్తగారూ నా భార్యా సుబ్బారావు పంతులుగారింటికి ప్రయాణమవుతున్నారు..." అన్నాడు సీను.

బిక్క మొహంతో ఇందిర పట్నం చేరుకుంది.

## 5

"ఎన్నటికి ఎవర్నీ నమ్మను... నామీద నిజంగా ప్రేమ గలవాడివి నువ్వొక్కడివే కనిపిస్తున్నావు!" అన్న దిందిర నాజుట్టు చెరుపుతూ.

"నేనా! ఎబ్బే, నాకు ప్రేమంటే ఏమిటో తెలీదు... నాకు ప్రేమలో నమ్మకంకూడా లేదు" అన్నాను, భయ పడుతూ.

ఇందిరనోట ప్రేమఅనే మాటవస్తే నాకు జెర్రిని చూసినట్టవుతూ వచ్చింది

"అదే నిజమైన ప్రేమకు లక్షణం!"అన్నది ఇందిర.
"ఇక సీత్తోతప్ప ఇంకెవ్వరితోనూ స్నేహం చెయ్యను."

"మళ్లా నన్నుకూడా ఇంకో శ్రీనివాసరావును చెయ్యాలని చూస్తున్నావు... కాని శ్రీనివాసరావు అనాథ, నేను కాను!"

ఈ ముక్క నేను ఇందిరతో అనలేదు, నాలో నేనే అనుకున్నాను.

# సాహసం

నాన్నా, అన్నయ్యా ఆఫీసుల కెళ్ళారు. తమ్ముడు స్కూలుకెళ్ళాడు. అమ్మా, వదినా వంటింట్లో అప్పడాలు వత్తుతున్నారు. పోనీ పాపంగదా అని తానుకూడా సాయపడదాంకదా అనుకుంటే, "నువ్వు వత్తే వుండలకన్న తినే వుండలు జాస్తిగా వున్నై. నీ సాయం మాకొద్దు పో, తల్లీ" అన్నది అమ్మ, పనిచేస్తున్నదన్న మెప్పుకూడా లేకుండా. ఆమాట అనేసరికి వదినె, "ఉన్నవి రెండే అప్పడాల కర్రలు. నీకెందుకీ శ్రమ? హాయిగా వెళ్ళి ఏ సినిమాపత్రికైనా చదూకోక!'' అన్నది. అంతంత మాటలు పడ్డాక ఇక తన కక్కడ ఏంపని? గ్లాసెడు నీళ్ళుతాగి, ఎందుకైనా మంచిదని మరి రెండు అప్పడాల పిండివుండలు సంగ్రహించి, కారానికి మండిపోతున్న నాలుకకు ఉపశాంతిగా నంజుకుంటూ రాజ్యలక్ష్మి ముందుగదిలోకి వచ్చింది.

గదిలోకి అడుగుపెడుతూనే ఆమెకళ్ళు కిటికీలో పడి వున్న ఉత్తరంమీద పడ్డాయి. తీసిచూస్తే కవరుమీద తన పేరేవుంది. తనపేర ఉత్తరం రావటం ఇదే మొదలు. ఎవరు రాసివుంటారు? అక్క గుంటూరునుంచి రాసి వుంటుందా? ఎడ్రసు ఇంగ్లీషులో రాసిందెవరూ? బావ దస్తూరి కాదే. ఇంకెవరో రాసివుంటారు. ఉత్తరంమటుకు గుంటూరునుంచే [illegible]ంది. అన్నట్టు అక్కదగ్గరనుంచి నిన్నగాక మొన్ననేగా [illegible]త్తరం వచ్చింది? ఇల్లు మారుతున్న హడావుడిలో అమ్మకు జవాబు రాసేటందుకైనా పడలేదు. సాయంకాలం జవాబు రాసి పోస్టులో వేయిద్దామనుకుంటోంది. చక్కగా ఈ ఇంటికి పోస్టుడబ్బా చాలా దగ్గిరే - కూడానూ—వెనక వుండిన ఇల్లుకు దూరంగానూ!

ఉత్తరం చించి చూస్తేగాని లక్ష్మికి వూపిరి సలిపే లాగు లేదు. అందుచేత చేతిలోవున్న అప్పడాలపిండి గబ గబా తినేసి కవరు చించి ఉత్తరం బయటికిలాగి మొదటి మాటలు చూస్తూనే కొయ్యబారిపోయినట్టయింది.

«నా ప్రాణసమానురాలైన రాజ్యానికి»

రాజ్యలక్ష్మి కళ్ళు అప్రయత్నంగా ఉత్తరం చివ సంతకంమీదికి పోయాయి.

«ఇట్లు నీ ప్రేమోపాసి, రంగారావు.»

ఎవరో తిడితేనో, గట్టిగా కొడితేనో కలిగే అను భవంలాటిది కలిగింది లక్ష్మికి. కళ్ళు కనబడలేదు. చెవులలో ఏదో హోరు. వంటినిండా చెమటలు. వూపిరి సరిగా ఆడదు.

ఎవడీరంగారావు? వాడు తనకా ఉత్తరం రాస్తాడా? ఎంత సాహసం! ఎన్ని గుండెలు!

ఈ ఉద్రేకం శాస్త ఉపశమించే సమయానికి లక్ష్మికి మరో ఆలోచన కలిగింది అయినా ఏంరాశాడో చూస్తేనేం? ఎట్లాగూ చించిపారేసే ఉత్తరమేగా?

“నా ప్రాణసమానురాలైన రాజ్యానికి,

చాలారోజులుగా నీదగ్గరనుంచి ఉత్తరం లేదు. జీవితం ఆనంద రహితమై, ఎండదెబ్బకు నెర్రెలు పడ్డ భూమిలాగా ఆశా రహితంగా, నిర్జీవంగా ఉన్నది. చల్లని జల్లులాగా నీ సానుభూతి కాస్త కురిపించావంటే మరేమీ చెయ్యకుండానే దీనిమీద మళ్ళీ పచ్చిక మొలుస్తుంది. రాజ్యం ఈ సమయంలోనేనా నువ్వు మౌనంగా ఉండాలిసింది? వెంటనే జవాబు రాయి. రోజులిట్లాగే ఉండవు నాకు మళ్ళీ ఉద్యోగం దొరుకుతుంది. ఒక్కొక్క పుస్తకమే అమ్మేస్తున్నాను కాని ఇంతకి రెండింతలు పుస్తకాలు కొంటాను.

న్యాయంగా నేను ఇతరుల సానుభూతి కోరరాదు. ఎందుచేతనంటే, నా కభ్యంతరం లేనిపక్షంలో చేసేటందుకు ఉద్యోగం ఒకటి ఉంది. అది నిరాకరించానని మా బంధువులకూ కొందరు మిత్రులకూ చాలా కోపం వచ్చింది నామీద! నూరురూపాయలిస్తారుగదా అని పరమ దౌర్భాగ్యులదగ్గిరా, సంస్కారహీనుల దగ్గిరా అవమానాలు భరిస్తూ ఎట్లా ఉద్యోగం చెయ్యటం? అట్లా జీవితాన్ని అమ్ముకుని బానిస అయినవాడు భూభారమేకదా?

ఏదైనా పాట రాద్దామని కూచున్నాను. రాయగలి

గితే ఈ ఉత్తరంలో పెట్టేవాణ్నే కాని, చెప్పానుగదూ. మనస్సు నెర్రెలుపడి ఉంది. పాట కాదుగదా, చిన్నకూత కూడా పలకటం లేదు.

ఈ ఉత్తరం ఎంతో సరదాగా రాద్దామనుకున్నాను, నా ఆర్తనాదం తప్ప ఇందులో ఇంకేమీ లేదు. ఈసారి మంచి ఉత్తరం రాస్తాను.

ఇట్లు, నీ ప్రేమోపాసి, రంగారావు"

ఉత్తరం చదవటం మంచిదయింది. అది పూర్తి చేశాక రాజ్యలక్ష్మికి కలిగిన వికారమంతా దిగిపోయింది. ఈ ఉత్తరం తనది కాదు. మరి తనపేర, తన చిరునామాకు ఎట్లా వచ్చిందో తెలియలేదు.

అన్నట్టు తనకు ముందుకూడా ఈఇంట్లో తెలుగు వాళ్ళే ఉండేవారుట వాళ్ళ కుటుంబంలోకూడా తన పేరు గల మనిషే వుండేదేమో. తామీ ఇంటికి వచ్చి మూడు రోజులేగద అయింది? తన నేడిపించటానికి ఎవరన్నా రాశా రనుకోవటానికైనా వాళ్ళకి ఈ ఎడ్రస్ తెలిసే అవకాశం ఏదీ? ఈ ఉత్తరం అమ్మగాని, వదినెగాని మగవాళ్ళుగాని చూస్తే బాగుండదు అందుచేత దాన్ని రాజ్యలక్ష్మి చించి ముక్కలు చేసి ఇంటిబయట కందకంలో పారేసి వచ్చింది. వంటింట్లోకి వెళ్ళి మరికాస్త అప్పడాలపిండి తిననారంభిం చింది.

"మళ్లీ వచ్చావా, తల్లీ?" అన్నది వదినెగారు.

దీనికి రాజ్యలక్ష్మి ఏం జవాబు చెప్పివుండేదోగాని

ఈ సమయానికే, దేవుడు పంపినట్టుగా, నాలుగోయింటి తెలుగావిడ ద్రౌపదమ్మగారు వచ్చింది.

"అహాహాహా! కారపు అప్పడాలే?ఏమదృష్టమమ్మా! ఎంతసేపటికీ ఈ తెల్ల అప్పడాలేగాని కారం అప్పడాలు ఎరగంగదా!" అన్నది ద్రౌపదమ్మగారు.

"అన్నీ కొనటం అలవాటైపోయాక ఈ మహానగరంలో ప్రతిదానికీ మొహం వాచిపోతున్నాంగాని మనవైపునైతే అప్పడాలు చేసుకోంటండీ?" అన్నది అమ్మ.

"దేనికైనా మనిషికి మనిషి తోడుంటే గాని ఉత్సాహం వుండదు లెస్తురూ. వూరగాయలూ,అప్పడాలూ వడియాలూ పెట్టుకోవాలని ఎన్నోసార్లనుకుంటా, కాని నడుమువిగించ బుద్ధికాదుగద. ఈ ఇంటో రామాయమ్మగారున్నప్పుడు ఎన్ని చేసేవాళ్ళం! ఆవకాయలు పెట్టాం, మాగాయలు పెట్టాం, కందిసున్నికూడా పెట్టాంగా!"

లక్ష్మికి మంచి అవకాశం దొరికింది.

"ఏమండీ, పిన్నిగారూ? వాళ్ళింటోకూడా చాలామంది ఆడవాళ్ళుండేవాళ్ళా?" అన్నదామె

"చాలామంది ఎవరున్నారూ?రామాయమ్మగారేగా! కూతురుండేదనుకో! అబ్బో ఆవిడంతా నాగరికపుతరహా! ఎంతసేపూ పుస్తకాలు చదవటం, పత్రికలు చదవటం, సినిమాలు, షికార్లూ—అడిగావ్? బియ్యే చదివిందమ్మోయ్! బియ్యే!"

"ఆ అమ్మాయి పేరేమిటండీ?"

"రాజ్యం, రాజ్యం అనేవాళ్ళు. రాజ్యలక్ష్మి ఏదో

అయివుంటుంది."

"సారిపోయింది! మా ఆడబిడ్డ పేరేనా?" అన్నది వదినెగారు తిన అప్పడాన్ని వెలుతురుకు పెట్టి పట్టుగా వచ్చిందీ లేందీ పరిశీలిస్తూ.

"పేరులో ఏముందమ్మా? ఈ పిల్లముందు ఆ పిల్ల ఎందుకు పనికొస్తుంది ఊరికే పొడర్లు పామగానే సరా ఏమిటి? ఈ పిల్ల అందమెక్కడ, ఆ పిల్ల అందమెక్కడ! ఇంతకీ నాగ్గో పాతిక అప్పడాలిస్తున్నారా, ఇవ్వటం లేదా? డబ్బిచ్చుకుంటాలేవమ్మోవ్! నాకు ఊరికే వద్దులే!"

## 2

ఒకటి రెండు రోజులపాటు రాజ్యలక్ష్మికి రంగారావు ఉత్తరంగురించి క్షణ క్షణమూ జ్ఞాపకం వస్తూండేది. అందులోని వాక్యాలు బుర్రలోకి వస్తూ చేసే ఆలోచనల్ని కూడా పాడుచేసేవి. ఆమె పరధ్యానాన్ని దాదాపు అందరూ గమనించారు, దానిమీద వ్యాఖ్యానించారు. అయితే రాను రాను చెప్పుపుండు కాయగాచిపోయినట్లు రంగారావు ఉత్తరం గురించిన భావాలు మొద్దుబారిపోయాయి క్రమంగా వాటిని గురించి బాధపడటం మానేసింది లక్ష్మి.

లక్ష్మి జీవిత రామాయణంలో రంగారావు ఉత్తరం పిడకలవేట ముగిసినట్టే కనపడిన సమయంలో రంగారావు

దగ్గరనుంచి మరో ఉత్తరం వచ్చింది. అదృష్టవశాత్తూ అది కూడా ఇతరులకంట పడకుండానే లక్ష్మికి దొరికింది. అయితే ఇది చాలా చిన్న ఉత్తరం.

"రాజ్యం, నా ఉత్తరం అందలేదా? సమాధానం రాశావుకావేం? నీ ఉత్తరంకోసం నేనెంతగా తపిస్తున్నానో తెలుసుకొని ఏడిపిద్దామని చూస్తున్నావా? లేక తెలియక నీకేమైనా అపచారం చేశానా?

—నీ రంగారావు"

ఈ ఉత్తరం చదవగానే లక్ష్మికి పట్టరాని కోపం వచ్చింది. ఆ రంగారావుమీద అసహ్యం పుట్టుకొచ్చింది. మగాళ్ళంతా ఇంతే. అందని ఆడదంటే వాళ్ళకి అంత గౌరవం! పెళ్ళామైతేనే వాళ్ళకి అలుసు! ఛీ, సిగ్గుమాలిన వాళ్ళు! ఆమె రంగారావునూ ఎరగదు, రాజ్యాన్నీ ఎరగదు. కాని రాజ్యం రంగారావు ఆరాధనకు ఎంతమాత్రం తగదని లక్ష్మి అంతరాత్మ ఢంకా బజాయించి చెబుతోంది. ఈఆరాధన మూలంగా రంగారావుమీదకూడా ఆమెకు జుగుప్స కలగసాగింది. లక్ష్మి రంగారావుకొక ఉత్తరం రాసి పడేద్దామని అనుకుంది. రాత్రిపూట అందరూ నిద్రపోయ్యేటప్పుడు కాగితమూ కలమూ తీసుకుని రంగారావు ఎడ్రసుకు, చిన్న ఉత్తరం రాయబూనుకున్నది. కాని ఈపని అనుకున్నంత తేలక కాదని రూఢి అయింది. చేతులు వణికాయి. అక్షరాలు భీభత్సంగా తయారయాయి. ముచ్చెమటలు పోసి కాళ్ళు చల్లబడసాగాయి. రాసినంతవరకు చదివింది:

"రంగారావుగారూ, మీ రాజ్యం ప్రస్తుతం ఇక్కడ ఉండటంలేదు. వాళ్ళు మరో ఇంటికి వెళ్ళిపోయారు. దయ చేసి మీ వుత్తరాలు ఈ చిరునామాకు రాయవద్దు. ఏమైనా మీరు చాలా వెర్రిన పడుతున్నారని చెప్ప సాహసించే—"

ఏమిటీ వుత్తరం? తనకెందుకొచ్చిన క్షోభ! రేపు కవరు సంపాదించి దీన్ని పోస్టు చేసేలోపుగా ప్రపంచమంతా ఈ వుత్తరం చదివేస్తుంది! అందులో ఏమీ సందేహంలేదు. లక్ష్మి అతి జాగ్రత్తగా రాసిన కాగితం చించి ముక్కలు ముక్కలు చేసి బయట పారేసింది.

మరి మూడు మాసాలు గడిచాయి. రంగారావు మళ్ళీ వుత్తరం రాయలేదు.

## 3

"ఆరోనెల దాటుతుంది. అమ్మాయిని తీసుకురావద్దుటండీ?" అన్నది అమ్మ నాన్నతో. ఈ మాట చెవిని పడ గానే లక్ష్మి పదేళ్ళపిల్ల అయిపోయింది. ఈశక్తి అందరికీ వుందో లేదోగాని లక్ష్మికి వుంది. లక్ష్మి జీవితంలో "నిన్న జరిగినట్టు" తోచే సంఘటనలు కొన్ని వున్నాయి. వుదాహరణకు లక్ష్మి అయిదేళ్ళపిల్ల అయివుండగా బోటు ప్రయాణం చేసింది. తరవాత ఎప్పుడు రహదారిబోటు చూసినాసరే క్షణికంగా అయిదేళ్ళపిల్ల అయిపోతూండేది. అట్లాగే అక్క-

పెళ్ళికి లక్ష్మి పదేళ్ళది, అక్క వివాహ జీవితానికి సంబంధించిన విషయం ఏది వచ్చినా ఆమె పదేళ్ళపిల్లఅయి అక్క మధుపర్కాలు కట్టుకుని వుండగా తోడిపెళ్ళికూతురుగా తాను పక్కన నిలబడి వుండటం ఆమెకు జ్ఞాపకం వస్తుంది. ఈ దృశ్యంతోబాటు గంధంవాసన, పన్నీరువాసనా, పునుగు వాసనా. అగరువత్తుల వాసనా, పెళ్ళిపందిరి వాసనాకూడా లక్ష్మికి స్ఫురణకు వస్తుంది... అక్క తొలిసారిగా కడుపుతో వుంది. కాన్పుకు పట్నం తీసుకొస్తారు. అక్క కళ్యాణం బొట్టు పెట్టుకుని నిన్ననే పెళ్ళికూతురైనట్టుగా వుంది, అప్పుడే పిల్లతల్లి! తన ఈడుకప్పుడే అక్కకు పెళ్ళయిపోయింది, తనకే ఇంకా కాలేదుగాని! ...

"అమ్మాయిని ఎప్పుడైనా తీసుకురావచ్చు. ఎప్పుడు వీలవుతుందంటాడో అల్లుడికిరాసి కనుక్కుందాం!" అన్నాడు నాన్న.

"మరిచిపోకుండా రాయండి" అన్నది తల్లి.

"అమ్మాయిని గుంటూరునుంచి నేను తీసుకొస్తా," అన్నాడు అన్నయ్య.

"అట్లాగే పోదువుగాని," అన్నాడు నాన్న.

"నేనుకూడా పోతా!" అన్నాడు తమ్ముడు.

"నువ్వెందుకు? నేనుపోతా," అన్నది లక్ష్మి.

"ఇంకేం ఇంటిల్లిపాదీ పోదాం! దొరికారు పరమానందయ్య శిష్యులు! ఒక్క సూది తీసుకురావటానికి ఏడుగురు బయల్దేరారుట!" అన్నది అమ్మ.

"అమ్మకి చాన్సు దొరికింది, పరమానందయ్య శిష్యులు సినారియో రాయటానికి!" అన్నాడు తమ్ముడు లక్ష్మికేసి కన్ను మలుపుతూ.

"నోరు మూసుకోరా, కుంకయ్యా!" అన్నది అమ్మ...

ఆ మర్నాడో, మూడోనాడో తలవనితలంపుగా లక్ష్మి తన పేరుగల పిల్లను స్వయంగా చూసింది. ఆ అమ్మాయీ, వాళ్ళ నాన్నా ద్రౌపదమ్మగారింటికి వచ్చారు. వాళ్ళని ద్రౌపదమ్మగారు లక్ష్మి వాళ్ళ ఇంటికి తెచ్చింది.

"రాజ్యం" మొహం చూడగానే లక్ష్మికి జెర్రులు పాకినై కారణం ఆమెకే తెలీలేదు. లక్ష్మికి ఆమెలో ఏ ఆకర్షణా కనపడలేదు. మొహం ముచ్చట్లే ఉన్నది. కళ్లు పెద్ద కళ్లేగాని వాటిలో కాంతి లేదు. వయస్సు ఇరవైదాకా ఉండొచ్చు. చాలా నిక్కుగల మనిషి. మాట్లాడిన రెండు మాటలూ తాననేదానికి తిరుగులేదన్నట్టుగా మాట్లాడుతుంది.

"ఈ మనిషిలో ఏంచూశాడో ఆ రంగారావు. అయినా వాడెటువంటివాడో!" అనుకున్నది లక్ష్మి.

"నీ రహస్యం నాకు తెలుసు!" అని ఎట్లాగైనా ఆ పిల్లకు తెలియజేయాలని లక్ష్మి లోలోపల తహతహలాడి పోతున్నది.

"వాళ్ళ రాజ్యానికి సంబంధం కుదిరిందండోయ్!" అన్నది ద్రౌపదమ్మగారు లక్ష్మి తల్లితో.

"అట్లాగేం?" అన్నది అమ్మ సంతోషం అభినయిస్తూ.

"ఈ అమ్మాయి ఇంటరు పాసయింది. పిల్లాడుకూడా

బాగా చదువుకున్నవాడేలెండి. ఎమ్మే పాసయి అయిదొందలు తెచ్చుకుంటున్నాడు ”

“నాసామిరంగా!” అన్నది లక్ష్మి రాడీవేషంగా. ఆమె గుండెలు గుబగుబలాడుతూనే ఉన్నప్పటికీ, యేదో ఒకటి అనకుండా వుండలేకపోయింది. అయినా లక్ష్మి ప్రయత్నం వ్యర్థమైనట్టు కనపడింది. రాజ్యం తానన్నమాట వినిపించుకున్నట్టుకూడా లేదు వినిపించుకుని లక్ష్మికేసి ఆశ్చర్యంగా చూసిన మనిషి అమ్మ ఒక్కత్తే.

“ఏమిటే, అమ్మాయ్?” అన్నది అమ్మ.

“పెళ్ళి చేసుకుంటే మంచి సంపాదన ఉన్నవాణ్ణే చేసుకోవాలి, నిరుద్యోగుల్ని దేనికి!” అన్నది లక్ష్మి, తన గుండెదడను ఖాతరు చెయ్యకుండా.

ఈసారి రాజ్యం లక్ష్మికేసి ఒక కోరచూపు చూసింది. కాని ఒకంతట తోణికే ఘటంకాదు. రాజ్యంమీద లక్ష్మికి యేదో కొంత గౌరవంకూడా కలగసాగింది. ఆమె తనకన్న రెండు మూడేళ్ళే పెద్దదైనా, కనీసం పదేళ్లు పెద్దదానిలా ప్రవర్తిస్తోంది. తనుకూడా అంత నిబ్బరం నేర్చుకోవాలి. ఎంత నిబ్బరంలేని మనిషి కాకపోతే రంగారావును వెధవను చేసిందా?

“రాజ్యం'' తండ్రి. నాన్నపేరు అడిగి తెలుసుకుని శుభలేఖమీద పేరు రాసి ఇచ్చాడు. పెళ్ళి వచ్చే మాసంలో పట్నంలోనే. అశ్రద్ధచెయ్యక అందరూ తప్పక రావాలి!

“ఈ లోపల గుంటూరునుంచి మావాళ్ళుకూడా వస్తారు,” అన్నది లక్ష్మి ఆఖరు చాన్సుగా.

మళ్లీ "రాజ్యం" లక్ష్మికేసి ఇందాకటిలాగే చూసింది.

"నా పెద్దమ్మాయిని పురిటికి తెస్తున్నాం లెండి!" అన్నది అమ్మ, లక్ష్మి అమోమయం సంభాషణ ద్రౌప దమ్మగారికి విశదపరుస్తూ.

"చెప్పరేం!" అన్నది ద్రౌపదమ్మ.

వచ్చినవాళ్ళు వెళ్ళిపోయారు.

ఆరోజే లక్ష్మి "రాజ్యం" పెళ్ళి శుభలేఖ కవరుమీద నాన్న పేరు కొట్టేసి రంగారావు పేరూ, చిరునామా రాసి, ముక్కాని బిళ్ళ అంటించి దగ్గిరిలో వున్న పోస్టుడబ్బాలో స్వయంగా పడేసి చేతులు దులుపుకుని ఇంటికి చక్కా వచ్చింది

## 4

పన్నెండోతేదీతరవాతవచ్చి అక్కను తీసుకుపోవచ్చు నని జావ రాశాడు. పదమూడో తారీకు బాగుంది. ఆనాడు అన్నా, వదినా బయలుదేరి గుంటూరు ప్రయాణం కావటం ఖాయమయింది. తమ్ముడు తనుకూడా వెళ్ళితీరాలన్నాడు. అందుచేత తనుకూడా వెళ్ళితీరాలన్నది లక్ష్మి. అంతేగాని తనను వెళ్ళనిస్తారనిగానీ, తాను వెళుతుందనిగాని లక్ష్మికి ఏకోశానా లేదు

తలవని తలంపుగా ఎనిమిదో తారీఖున "రాజ్యలక్ష్మి

పేర ఒక ఉత్తరం వచ్చింది. ఉత్తరం వచ్చేసరికి ఆడవాళ్ళు భోజనాలకు కూర్చోబోతున్నారు. బయటివాకిలి వేసి లక్ష్మి లోపలికి పోబోతుండగా కిటికీలో టప్పుమని చప్పుడయింది, పక్కగది కిటికీలో కాగ్గు పడిఉంది. దానిమీద మళ్ళీ తన పేరేఉంది! దస్తూరివేరు. రంగారావు దస్తూరిమటుకు కాదు.

లక్ష్మి గబగబా ఉత్తరాన్ని పుస్తకాలమధ్య దాచి భోజనానికి వెళ్ళింది. భోజనాల అనంతరం ఆ ఉత్తరం చదువుకునేటందుకు లక్ష్మికి పడనేలేదు. అది చదువుకోవటంకోసం లక్ష్మి ఆ సాయంకాలం ఒంటరిగా షికారుకు బయలుదేర వలసి వచ్చింది.

"ఎక్కడికే?" అన్నది తల్లి.

"ఏమీ తోచటంలేదు. పార్కుదాకా నడిచి పొద్దూకేలోపలే తిరిగొస్తా!" అన్నది లక్ష్మి. రెండు వీధి మలుపులు తిరిగేదాకా లక్ష్మి ఉత్తరం పైకి తీయ . ఆ తరవాత ఈ విధంగా చదువుకున్నది:

"మాపాలిట శనిదేవత అయిన రాజ్యలక్ష్మిదేవి గారికి: మీరు దయతో పంపిన మీ పెళ్ళిశుభలేఖ అందింది, అదిచూసిన క్షణంనుంచీ మా అన్నయ్య రంగారావు 105 డిగ్రీల జ్వరంతో వొళ్ళు తెలియకుండా పడిఉన్నాడు. మీరు మాకు చేసిన మహోపకారం తరతరాల చెప్పుకుంటాము. ఇట్లు, కృతజ్ఞుడు వెంకటేశ్వర్లు.

ఈ వుత్తరంచూసి లక్ష్మి నీరసించి పోయింది. ఆమె కాళ్ళల్లో సత్తువ యావత్తూ పేవ్‌మెంటులోకి ఇంకిపోయి నట్లయింది. తలలో అలారం కొడుతున్నట్టయింది. పక్కగా వెళ్ళే

కార్ల చప్పుళ్ళు కూడా నూతిలోనుంచి వినిపిస్తున్నట్టు తోచింది.

తాను ఏంపని చేసింది? ఆ శుభలేఖ రంగారావుకు తానెందుకు పంపవలసి వచ్చిందో ఎంత ఆలోచించినా బోధ పడలేదు. రంగారావు ఈ దెబ్బతో చచ్చిపోతాడా? తాను హంతకురాలవుతుందా?

లక్ష్మి అంతరాత్మ ఈ ఆలోచనలపై ఎదురుతిరిగింది. తాను శుభలేఖ పంపకపోతేమాత్రం అతనికి ఎప్పటికైనా ఈ పెళ్ళిగురించి తెలియకపోదుగదా! అప్పుడైనా ఈ జ్వరం వచ్చేదే? రంగారావు ఒక క్షుద్రురాలికోసం చావదలిస్తే అది తన తప్పా? చావనీ... కాని తానా శుభలేఖ పంపక పోతే అతని చావుతో తనకేం సంబంధం ఉండదుగద. ఆ పాడుపని తానెందుకు చేయవలసివచ్చింది?

ఆ ప్రశ్నకు సమాధానం తెలుసుకునే తెలివి లక్ష్మికి లేదు. మనమైనా ఒక్కమాటే అనుకోవాలి: "నువు ప్రేమిం చిన స్త్రీ చూడు ఏం చేస్తున్నదో!" అని రంగారావుకు తెలియజెప్పటానికే లక్ష్మి శుభలేఖను అతనిపేర పోస్టుచేసి ఉండాలి_ఒక మగవాడు ఎవరో ఆడదాన్ని అంతగా ప్రేమి స్తున్నట్టు తెలుసుకుని లక్ష్మికి ఆ ఆడమనిషిమీద అసూయ కలిగినమాటమటుకు నిజం. ఆ అసూయను లక్ష్మి అసూయ రూపంలో పైకిరానివ్వలేదు. తన అసూయకు కారకుడైన రంగారావుకు నొప్పి కలిగించాలనికూడా ఆమె శుభలేఖను అతనికి పంపిఉండవచ్చు.

ఏమైనా ఇప్పుడు లక్ష్మి చాలా పశ్చాత్తాప పడసా

గింది. రంగారావుకు కలిగిన విపత్తుతో తనకేమీ సంబంధం లేదని లక్ష్మి తన అంతరాత్మను నమ్మించలేకపోవటం వల్ల పశ్చాత్తాపం పైచెయ్యి అయింది.

"నేనుకూడా గుంటూరు వెళతాను. సాధ్యమైతే రంగారావును ఒక్కసారి—ఒక్క నిమిషంపాటు—చూస్తాను" అని నిశ్చయించుకుంది లక్ష్మి.

ఇందువల్ల కలిగేదేమిటో లక్ష్మికి తెలియదు. ఒక వేళ గుంటూరు వెళ్ళినా తాను ఒంటరిగా బయలుదేరి రంగారావును చూడటం సాధ్యపడుతుందని లక్ష్మికి నమ్మకం లేదు. కాని తాను గుంటూరు బయలుదేరే పక్షంలో ఆమె అంతరాత్మ శాంతించేటట్టు కనబడింది. ఈలోపుగా రంగారావు చచ్చిపోవచ్చు. అయినా—

"అమ్మా, అన్నావాళ్ళతో నేగూడా గుంటూరు పోవద్దూ?" అన్నది లక్ష్మి ఆరాత్రి

"ఎందుకమ్మా, ఇంతమందీ?" అన్నది అమ్మ.

"కాదు, నేను వెళ్ళాలి!"

లక్ష్మి గొంతులో వుండే ఆవేదన చూసి తల్లి, "చూద్దాంలే!" అన్నది.

ఎవరు ఎన్ని చెప్పినా లక్ష్మి మంకుపట్టుపట్టిగుంటూరు వెళ్ళితీరాలనటంచేత వదినె తన ప్రయాణం మానుకున్నది. గుంటూరుకు అన్నా చెల్లెళ్ళు మాత్రమే బయలుదేరారు.

"నువే వెళ్ళిరావమ్మా! సగంటికెట్టు ఆదా!" అన్నది వదినె లక్ష్మిని పీడిస్తూ.

"నువే అరటికెట్టు! నేనేంకాదు! అన్నది లక్ష్మి.

“ఊరికెళ్ళటానికి నువు చేస్తున్న హంగామా చూస్తే రైలువాళ్ళు నీదగ్గిర పూర్తి టిక్కెట్టు పుచ్చుకోరు” అన్నది వదినె.

“అట్లా ఉడికిస్తే నేను మానేసి నిన్ను పంపిస్తాననా? పాపం, ఆశే!” అన్నది లక్ష్మి పన్నెండేళ్ళపిల్ల ఐపోతూ.

“లేదమ్మా, తల్లీ ! నేను పోనేపోను! నువే వెళ్లు!” అన్నది వదినె.

## 5

లక్ష్మి గుంటూరుచేరి అప్పుడే 24 గంటలయింది. ఆమె వచ్చింది అరండెల్ పేటకు. రోడ్డుదాటితే బ్రాడీపేట. అందులో యెక్కడో ఉన్నాడు రంగారావు తనలో పోతన్న గారు చెప్పిన “భీకరశత్రువులు” లేకపోతే అక్కగారింటి నుంచి బయల్దేరి గుర్రబ్బండీలో వెళ్ళి రంగారావింటిముందు దిగటానికి గట్టిగా అయిదు నిమిషాలు పట్టదు. కాని ఈపని చేయటానికి అవసరమైన సాహసం లక్ష్మిలో కొంచెంకూడా లేనట్లు కనబడింది. తన స్థితిలో రంగారావును వెతుక్కుంటూ పోవటంకంటె ఎర్రగా కాల్చిన కర్రతో వాతలు పెట్టించు కోవటం ఎంతో సులభమైనపనిగా తోచింది.

అయినా లక్ష్మి రెండోరోజు సాయంకాలం రంగా

రావుకు వెతకటానికి బయలుదేరనే బయల్దేరింది. పరిస్థితి అనుకూలించటంవల్ల ఆమె ఆపని చేయగలిగింది, అంతే.

అక్కడకు శారద అని ఆడబిడ్డ ఉంది. పదేళ్ళపిల్ల. శారద సాయంకాలం అయిదుకు ఇల్లు బయలుదేరింది. ఆ పిల్లకు బ్రాడీపేటలో స్నేహితురాలుందిట.

"నాకేమీ తోచటంలేదు. నేనుకూడా రానా, శారదా?" అన్నది లక్ష్మి.

"ఓ" అన్నది శారద.

ఇద్దరూ బయలుదేరారు. శారద ఒక రోడ్డువెంబడి దారితీసింది. నడిచి నడిచి చివరకు గమ్యస్థానం చేరుకున్నారు—శారద గమ్యస్థానం. శారద లక్ష్మిని తన స్నేహితురాలికి, వాళ్ళ అమ్మకూ పరిచయం చేసింది. లక్ష్మి కొంచెంసేపు కూచున్నది. శారదా, ఆమె స్నేహితురాలూ చదువు విషయాలలో నిమగ్నరాళ్ళయి ఉండగా లక్ష్మి చల్లగా లేచింది. "నేనింటికి పోతాను శారదా! దారి జ్ఞాపకం ఉందిలే" అన్నది. శారద పరధ్యానంగా తల ఊపి, స్నేహితురాలితో మాట్లాడుకు పోసాగింది.

శారద రోడ్డుపేర్లు అడుగుతూ బయలుదేరింది. రంగారావుండే రోడ్డు చేరుకోవటానికి ఆమెకు సరిగా నాలుగు నిమిషాలు పట్టింది. రంగారావుండే యింటిని నంబరుబట్టి తెలుసుకోవటానికి మరో మూడు నిమిషాలు పట్టింది. గుండెల్లో రైళ్ళుపరుగెడుతూ లక్ష్మి తన గమ్యస్థానం

బయట నిలబడింది. ఆ ఇల్లు పేదగానేవుంది. ఇంట్లో ఎవరూ ఉన్నట్లు లేదు. ఆమె చేయగలిగిందేమీ కనిపించలేదు.

వెనకపోటున సైకిల్ బెల్ చప్పుడువిని లక్ష్మి ఉలిక్కి పడి వెనక్కి తిరిగింది. ఒక కుర్రవాడు దాదాపు తన యీడు వాడే, సైకిల్ దిగి ఆమెనుచూసి ఆగి, "ఎవరు కావాలి?" అన్నాడు.

లక్ష్మినోట మాటరాలేదు. ఎవరూ అక్కర్లేదన్నట్టు తల అడ్డంగా ఆడించింది. అక్కణ్ణుంచి పారిపోదామనిపించిందిగాని కాళ్ళు చచ్చుబడ్డాయి.

"మీ పేరు?" అన్నాడా కుర్రవాడు.

"లక్ష్మి! రాజ్యలక్ష్మి!" అన్నది హీనస్వరంతో.

ఈమాట వినగానే ఆ కుర్రాడిలో కలిగిన మార్పు వర్ణనాతీతం. ఒక్కసారి కొయ్యబారిపోయినాడు. ముఖం వెలవెలపోయింది. మరుక్షణం మొహమంతా ఎర్రగా కందగడ్డ అయిపోయింది

అతి బలవంతంగా మాట్లాడుతూ, "నాపేరు వెంకటేశ్వర్లు, ఎప్పుడొచ్చారు?" అన్నాడు.

"నిన్న వచ్చా!"

తనను ఈ కుర్రాడు ఎవరనుకుంటున్నాడో లక్ష్మికి అర్థమయింది. కాని ఆతని అపోహ ఎట్లా పోగొట్టాలో, పోగొట్టిన అనంతరం తానక్కడికి ఎందుకు వచ్చిందీ ఎట్లా

వివరించాలో లక్ష్మికి తెలియలేదు. అంతా వివరించవచ్చు ఈ రోడ్డుమీద కాదు, ఒకటి రెండు వాక్యాలలో అంతకన్నా కాదు.

"లోపలికి వస్తారా? అన్నయ్య డాక్టరుదగ్గిరికి వెళ్లాడు. యింకో పావుగంటలో వస్తాడు" అన్నాడు వెంకటేశ్వర్లు.

"రంగారావుగారి కెట్లా ఉంది?" అన్నది లక్ష్మి.

"కొంచెం నిం‌పాదిగానే ఉంది" అంటూ కుర్రాడు తలవాకిలి తలుపుతెరిచి ఇంట్లోకి దారితీశాడు. లక్ష్మి పిల్లి లాగా అతన్ని అనుసరించింది.

ఇల్లు కొంచెం లోపలగా ఉంది. ఇంటి వాకటిబయట అరుగులున్నై. ఒక అరుగుమీద లక్ష్మి చతికిలబడి చీర చెంగుతో మొహం తుడుచుకున్నది.

"లోపలికి వచ్చి కూచోవచ్చు. మా అమ్మమ్మను కాస్తకాఫీ పెట్టమంటాను" అన్నాడు వెంకటేశ్వర్లు. అతని గొంతులో ఆగ్రహం ఏమీ లేదు.

"ఫరవాలేదు. ఇక్కడ బాగానే ఉంది" అన్నది లక్ష్మి.

వెంకటేశ్వర్లు కూర్చోలేదు లోపలికి పోనూలేదు. వాకిలిదగ్గిరే ఎటూ తోచనట్టు నిలబడి ఒక క్షణం వుండి, "మీ పెళ్ళి యింకా నాలుగు రోజులే ఉన్నట్లుంది" అన్నాడు.

"లేదు! నా-నా పెళ్ళి ఇప్పుడప్పుడే లేదు" అన్నది కంగారుగా.

మొట్టమొదటిసారిగా వెంకటేశ్వర్లు మొహాన చిరునవ్వొకటి వెలిసింది. అతను లోపలికిపోతూ, "మీరులోపలికొచ్చి కూర్చుంటే బాగుంటుంది. నేనిప్పుడే వస్తున్నా" అని వెళ్లాడు.

లక్ష్మికి క్షణమొక యుగంగా వుంది. వెంకటేశ్వర్లు లోపలికి వెళ్ళటం తనకేదో విమోచనం అయినట్టయింది. ఆ రంగారావు రాకముందే తాను వెళ్ళిపోవటం మంచిది. అతను కోలుకున్నాడు, తన బరువు తీరిపోయింది ఇంకెందుకొచ్చిన అనవసరం తగలాటం? లక్ష్మి చివాలున లేచింది తాను ఆ "రాజ్యం" వెళ్ళిపోతున్నానన్న విచారంతప్ప ఆమెకింకేమీ లేదు అయినా అదంత ముఖ్యవిషయంకాదు తనజన్మలో తాను వీళ్ళని చూసేదిలేదు; వాళ్ళు తనను చూసేదిలేదు

నాలుగంగల్లో లక్ష్మి, ఎవరో తరుముకొస్తున్నట్టుగా తలవాకిలిదగ్గిర వచ్చిపడింది. సరిగా ఆ సమయానికే గుర్రబ్బండీ ఒకటి వచ్చి వాకిట ఆగింది. అందులోనుంచి నీరసంగా, జబ్బుగా కనిపిస్తున్న యువకుడొకడు, చేతిలో మందుసీసా పట్టుకుని దిగాడు తన యింటోనుంచి వీధిలోకి వచ్చిన పరాయిపిల్లనుసయితం అతను గమనించినట్టు కనపడలేదు. కాని అతన్ని లక్ష్మి శ్రద్ధగా పరికించింది.

అతనే రంగారావయితే, అతనికంటె అందమైన యువకుణ్ణి లక్ష్మి ఎన్నడూ చూడలేదు...

# 6

అక్కను పట్నం తెచ్చారు. నెల గడిచింది. ఆమెకు పూడిదలు చేశారు. లక్ష్మి కిప్పుడు ప్రతిరోజూ ఒక పర్వ దినంగా గడిచిపోతుంది. రాజ్యం పెళ్ళి ఆర్భాటంగా అయి పోయిందిట; పెళ్ళికొడుక్కు కొంచెం బట్టతలట నల్లగా, లావుగా ఉంటాట్ట. నవ్వితే భూమ్యాకాశాలు దద్దరిల్లుతా యట! ద్రౌపదమ్మగారు గొప్పగా వర్ణించింది. ఆవిడఅంచనా ప్రకారం ఎంత డబ్బు ఖర్చుచేసి చేస్తే అంత గొప్పపెళ్ళి.

అక్క పట్నం రావటం ఇదే మొదటిసారి. కనీసం రోజువిడిచి రోజు ఏదో ఒకవైపు పోవాలనిఉబలాటపడేది—ఓపలేని మనిషయినా.

ఒకనాడు సాయంకాలం అక్కా, లక్ష్మి, తమ్ముడూ సినిమాకు ప్రయాణం కట్టారు. లక్ష్మి స్నానాలగదిలో నబ్బేసి ముఖం కడుక్కుంటున్నది. ముందుగదిలో అద్దం ముందు నిలబడి తమ్ముడు శ్రద్ధగా క్రాపు దువ్వుకుంటు న్నాడు.

“ఎవరండీ లోపలా?” అన్న పిలుపు వరండాలోనుంచి వినిపించింది.

తమ్ముడు బయటకొచ్చాడు. ఎవరో కొత్తమనిషి కనిపించాడు. అతన్ని చూస్తూనే తమ్ముడు తన మనస్సులో, “సినిమాస్టార్ లాగున్నాడే!” అనుకున్నాడు.

ఈ ఇంట్లో ఇప్పు డెవరుంటున్నారు?" అని అడిగాడు. తమ్ముడు చెప్పాడు.

"ఈ ఇంట్లో రాజ్యం అనే అమ్మాయి ఉంటున్నదా?" అన్నాడా యువకుడు.

"రాజ్యం కాదు, లక్ష్మి" అన్నాడు తమ్ముడు గర్వంగా

ఆ సమయానికే లక్ష్మి ముఖం తుడుచుకుంటూ బయటికి వచ్చింది. ఒక క్షణంపాటు ఆమె గుంటూరులో గుర్రబ్బండీ దిగుతూ కనిపించిన జబ్బుమనిషిని గుర్తించలేదు. అతనికి ఏజబ్బూ లేదు. చక్కగా పూడాడు. ఇంకా అందంగా ఉన్నాడు.

లక్ష్మిని మాత్రం రంగారావు గుర్తించనేలేదు. అతను మొదటిసారిగా ఆమెకేసి చూస్తున్నాడు.

"నీపేరేనా రాజ్య - లక్ష్మి?"

లక్ష్మికి నోట మాటరాలేదు. అతను ఆమె జవాబు కోసం ఎదురు చూడనూ లేదు.

"నాకంతా అర్థమయింది. మా వెంకటేశ్వర్లు పొరపడ్డాడు. నాకోసం శ్రమపడ్డందుకు థాంక్స్! వీలుంటే కబా పెద్దవాళ్ళతో రేపో ఎల్లుండో మాట్లాడతాను" అంటూ వచ్చినవాడు వెళ్ళిపోయాడు.

తరవాత రెండు మూడు రోజులకు నాన్న ఇంటికి వస్తూనే అమ్మతో, "ఎవరే ఆ అబ్బాయి? మొన్నెప్పుడో మనింటికూడా వచ్చాట్ట. లక్ష్మిని పెళ్ళిచేసుకుంటానని

కూచున్నాడు! ఈమధ్య ఉద్యోగం లేకుండా ఉన్నాట్ట. ఇప్పుడు మళ్ళీ సంపాదించాట్ట! లక్ష్మివంటివాళ్ళు కోటి కొకళ్ళుకూడా ఉండరన్నాడు దీని విషయం అతనికెట్లా తెలుసూ?" అన్నాడు అయోమయంగా.

అంతావింటున్నలక్ష్మి, "ఈమారుమనువు సంబంధం నాకేమీ అక్కర్లేదు!" అన్నది.

లక్ష్మి దొరికిపోయింది. అక్కా, వదినా, అమ్మా చుట్టూ చేరి లక్ష్మిచేత జరిగినదంతా చెప్పించారు. లక్ష్మిని వేళాకోళం చేశారు. చిట్టచివరకు ఈ సంబంధానికి ఒప్పుకో వచ్చునని సలహా ఇచ్చారు.

రంగారావు రెండుమూడు సార్లు వచ్చాడు. వచ్చి నప్పుడల్లా, "అదుగో బీ ఆయన వచ్చాడు" అని వదినె వేళాకోళం చేసేది.

ఒక్కసారి లక్ష్మితో ఒంటరిగా మాట్లాడతానన్నాడు రంగారావు. పెద్దవాళ్ళు సరేనన్నారు.

రంగారావు లక్ష్మితో ఏవో చాలావిషయాలుమాట్లా డాడు. రాజ్యం విషయం కూడా చెప్పాడు. మొదటగా ఆమే తనకు ఉత్తరం రాసి మోసగించిందన్నాడు. తనకూ రాజ్యానికిమధ్య ఉత్తరాలుతప్ప ఇంకేమీ నడవలేదన్నాడు. తనకోసం జాలిపడి చూడవచ్చిన లక్ష్మికన్న తనకు ప్రపం చంలో ఆప్తులెవరూ లేరన్నాడు ఆమెచేసిన పని చెయ్య టానికి ఎంతో సాహసం కావాలన్నాడు.

ఒక ఆడదాని విషయంలో మోసపోయేవాడు ఎందరాడవాళ్ళ విషయంలోనైనా మోసపోటానికి సిద్ధంగా ఉంటాడు. మళ్ళీ మరొకావిషయంలో మోసపోయేకన్న ఈ అందగాడు తన విషయంలోనే మోసపోవటం మేలేమోనను కున్నది లక్ష్మి. అందుచేతనే ఆమె తన "సాహసానికి" పరిస్థితులు ఎట్లా కలిసివచ్చినదీ ఆమె రంగారావుకి వివరించలేదు.

లక్ష్మి రంగారావును పెళ్ళాడటానికి ఒప్పుకున్నందుకు అందరూ సంతోషించారు అందరికన్న రంగారావు అధికంగా సంతోషించాడు.



# శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః అయ్యా ! ఇవాళ... తిథి వార నక్షత్రాలూ, త్యాజ్యమూ ఏకరువు పెట్టాడు భైరవ శాస్త్రుల్లు.

"శాస్త్రుల్లుగారికి ఉపాదానం వెయ్యండర్రా," అని కేక పెట్టాడు మాధవరావుగారు.

"అయితే చూడండి, బాబూ. తమ తండ్రిగారి తిథి ఎల్లుండే, గుర్తుంది కాదూ ?" అన్నాడు శాస్త్రుల్లు ప్లీడరు గారితో.

"అవునండీ. మీ అబ్బాయిగారు ఊళ్ళో ఉన్నారా"

"ఎల్లుండికి ఉంటాడులెండి. వాడూ నేనూ తప్పక వస్తాం. వేరే ఎక్కడా చెప్పకండి"

సరేనన్నాడు మాధవరావుగారు ఆయన భార్య దోసెడు బియ్యం తెచ్చి శాస్త్రుల్లుగారి చెంబులో వేసింది.

శాస్త్రులు వెంటనే నిష్క్రమించక, "అయితే చూడండి బాబూ? ఈ యేడు మా రెండోవాణ్ణి బళ్లో వేద్దామను కుంటున్నాను. నలుగురూ తలా యింత సహాయం చేస్తు న్నారు తమరు కూడా—" అని అడిగాడు.

"అట్లాగే చూద్దాంలెండి. కుర్రవాడి చదువెంత భాగ్యం ?... అవునుగాని ఆచారం తప్పిస్తున్నారేం ?" అన్నాడు మాధవరావుగారు నవ్వుతూ.

"ఇంగ్లీషు చదువు చెప్పిస్తున్నా వేమంటున్నారా ? చూడండి, బాబూ. నేను వేదం చదువుకున్నాను. ఏం లాభం? అక్షయపాత్రే తప్పలేదు. మా పెద్దవాడికి శాస్త్రం చెప్పించాను. 'అబ్బో', తర్కవ్యాకరణాల్లో నీ కొడుకంతటివాడు లేడన్నారు. ఏం లాభించిందీ ? సంభా వనలకూ, సన్మానాలకూ తెగతిరిగి ఆరోగ్యం పాడుచేసు కున్నాడు. హైదరాబాదులో ఏమిటో కొల్లబోతున్నదని అక్కడికి వెళ్ళాడు. అక్కడ ఎంత అవమానం జరగాలో అంతా జరిగింది. ఆ తురక సామ్రాజ్యంలో తద్దినం, మం త్రాలూ, సంధ్యావందనం ముక్కలు కూడా రాని తాగు బోతు వెధవలు పెద్దవాళ్ళయి కూర్చున్నారు... మనవాళ్ళే. ఇక్కణ్నుంచి వెళ్ళినవాళ్లే. అయితే ఏం? యాచకో యాచ కశ్శత్రుః ! మా వాడికీ వాళ్ళ పోగుపడ్డ వెధవలతోపాటు సంభావన లిప్పించాయిట జబ్బుపడి చక్కా వచ్చాడు."

"మన తెలుగువాళ్ళ జన్మే అంతలెండి. ఎంత మానవ స్వభావమైనా ఎక్కువ స్థితిలో ఉన్నవాణ్ణి చూసి ఓరవలేక

పోవటంలో అర్థం ఉందిగాని, మనవాడు వెయ్యిరూపాయలు సంపాయించుకుంటున్నా, పదిరూపాయలు తెచ్చుకునేవాణ్ణి చూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటాడు. అలా చూస్తే తెలుగు జాతంతా అడుక్కుతినే జాతే."

"బాగా సెలవిచ్చారు! — ఇక ఈ యాయవారం చాలొచ్చింది మా రెండో వెధవకైనా ఇంత ఇంగ్లీషు చదువు చెప్పించి గౌరవంగా బతికే సదుపాయం చేద్దామని చూస్తున్నాను."

"నన్నడిగితే మంచిపని చేస్తున్నారంటాను. మా వాణ్ణి కూడా ఈ యేడే స్కూల్లో ప్రవేశపెడుతున్నాను. మా వాడికి చదువు రాదేమోననిపిస్తుందండీ! ఆ వెధవకు గట్టిగా రెండో యెక్కం రాదు. వాడికి లెఖ్ఖలు బొత్తిగా రావు. ఇంగ్లీషు కూడా అంతంత మాత్రమే. తెలుగేదో కాస్త ఏడుస్తాడు అందుకని మా బావమరిదిని—వీడే మా రెండో బావమరిది ఇక్కడే వుండి పిల్లవాడికి కాస్త చదువుచెప్పరా అన్నాను మా గోపాలం ఇంటరు చదివి ట్రెయినింగ్ కూడా అయినాడు. స్కూల్లో మాష్టరు పని దొరుకుతుందేమోనని చూస్తున్నాడు. స్కూలు కమిటీ చూడబోతే నానా అయోమయంగానూ ఉంది. అక్కడ పార్టీలూ! నియోగులూ వైదీకులూనూ! కొట్టుకు చస్తున్నారు. మా వాడికి ఉద్యోగం ఇవ్వటానికి ప్రయత్నిస్తామన్నవాళ్ళంతా మైనారిటీవాళ్లు. మెజారిటీలో ఇద్దరు ముగ్గురైనా మావాడికోసం పాటుపడితే తప్ప ఉద్యోగం అయేటట్టులేదు. ప్రస్తుతం మీ వైదీకులదే

అక్కడ రాజ్యంగా వుంది —నే నన్నానని కోపం వద్దు" అన్నారు మాధవరావుగారు.

"ఉన్నమాటకు తప్పేమిటి, బాబూ ... అయితే, చూడండీ ! తమ పేరేమిటన్నారూ? గోపాలంగారా ! మీరు పంతులుగారి పిల్లవాడికి చదువు చెప్పేటప్పుడు కాస్త మా వాణ్ని కూడా దగ్గిర ఉండనివ్వండీ ? మావాడికోసరం తను రేమీ శ్రమ పడనక్కర్లేదు, చదువులో మావాడేమంత ఫరవాలేదు. అదీగాక పక్కన ఇంకో కుర్రాడుంటే పంతులుగారి పిల్లవాడికి కూడా కొంచెం ఉత్సాహంగా ఉంటుంది. ఏమంటారు !"

"దానికేం భాగ్యంలెండి. అట్లాగే పంపించండి" అన్నాడు గోపాలం.

తనపని అయిపోగానే భైరవశాస్త్రుల్లు శెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

"ఉద్దండుడల్లే వున్నాడే! చీపురుపుల్లకూడా ఊరికే దొరికితే పోనిచ్చేట్టు కనిపించదు. దరిద్రం మనుషులచేత అటువంటిపనులు చేయిస్తుందనుకుంటా" అన్నాడు గోపాలం అతనూ దరిద్రంలో ఉన్నవాడే.

"దరిద్రం ఏమిటి నీ మొహం! ఆయనకు కనీసం పదిహేనెకరాల పొలం వుంది. ముప్పైఏళ్ళనుంచీ జోలె పట్టుకు తిరుగుతున్నాడు. నేనింతప్పట్నుంచీ ఎరుగుదును. అప్పటికీ ఇప్పటికీ ఆయన అలవాట్లు మారలేదు. ఆ పేరు

కావిగుడ్డే కడతాడు. ఆ అంగవస్త్రమే పైనవేస్తాడు. ఆపూరి గుడిసెలోనే వుంటున్నాడు. ఈ ఊళ్లో కనీసం వంద ఇళ్ళల్లో ఆయనే తద్దినాలు పెట్టిస్తాడు. పెళ్ళిళ్లూ వడుగులూ చేయిస్తాడు. అపర క్రియలు కూడా తనే చేయిస్తాడు. రోజు కైదారు మానికల బియ్యం సంపాయిస్తాడు. దొడ్లో ఒక కరేపరెబ్బ దగ్గర్నుంచీ గుమ్మడికాయవరకూ ఏది కనిపించినా దేహి అని చెయ్యిచాస్తాడు. నెలకు రెండురోజులన్నా ఇంటో వంట చేయిస్తాడో లేదో. అన్ని ఇళ్ళల్లోనూ ముత్తయిదువు పెట్టుకుంటే ఆయన పెళ్ళాం వుంది. ఎవరింటోనన్నా పెళ్ళి అయితే అయిదురోజులూ వడ్డనలూ అవీ చేస్తుంది. యాభై యేళ్ళున్నయ్యా. ఇప్పటికి మనిద్దరం తినలేని తిండితిని హారాయించుకుంటాడు. నల్లగా చావదేలి ఎట్లా ఉన్నాడో చూడు ఉక్కు-ముక్క!"

"ఓరి పిడుగా!...వీడి కొడుకా నేను ఊరికే పాఠాలు చెప్పేదీ? కావలిస్తే నా ఆస్తిని అయిదుసార్లు కొనేస్తాడుకదా:" అన్నాడు గోపాలం. భైరవశాస్త్రిల్లువంటి మనుషులుంటారని అతను కల్లోకూడా ఎరగడు.

## 2

భైరవశాస్త్రుల్లు కొడుకు చదువుకుగాను లోకులదగ్గిర పాతిక రూపాయలు పోగుచేశాడు. అవి సత్యనారాయణ

ఏడాది చదువుకుగాను జీతానికి పుస్తకాలకూ రెండుజతల బట్టలకు కూడా సరిపోతై. ఇంకా అయిదో ఆరో మిగులుతై కూడానూ.

సత్యనారాయణనూ, మాధవరావు గారబ్బాయి రంగారావునూ బళ్లోవేసిన రెండుమూడు రోజుల్లోపల మాధవరావుగారి బావమరిది గోపాలానికి తలవని తలంపుగా ఉద్యోగం అయింది. అవుతుందని మాధవరావుగాని, గోపాల రావుగాని కల్లోకూడా అనుకోలేదు. మాధవరావు ఈ విషయం స్కూలు ప్రెసిడెంటుతోనూ సెక్రటరీతోనూ ప్రస్తావించినప్పుడిద్దరూకూడా అసహ్యంగా మాట్లాడారు.

ఈ రహస్యం సత్యనారాయణ ద్వారా రంగారావుకి తెలిసి, రంగారావుద్వారా పెద్దవాళ్ళకు తెలిసింది సత్య నారాయణ రోజూ మాధవరావుగారింటికి వచ్చి ఒకగంట సేపు రంగారావు పక్కనేకూచుని గోపాలం చెప్పే పాఠాలు వింటూండేవాడు. గోపాలానికి ఉద్యోగం ఇప్పించింది భైరవ శాస్త్రిల్లేనని సత్యనారాయణ రంగారావుతో రహస్యంగా అన్నాడు.

మొదట మాధవరావు ఈ మాట నమ్మలేకపోయి నాడు. కాని ఆలోచించినకొద్దీ నిజమై వుండాలనిపించింది. ఏమో ఉద్దండ ముండాకొడుకు! ఆ ప్రెసిడెంటు దగ్గరికీ, సెక్రటరీ దగరికీ వెళ్ళి కాస్త గట్టిగా చెప్పాడేమో!

మర్నాడు ఉపాదానానికి వచ్చినప్పుడు మాధవరావు

గారు భైరవశాస్త్రులుతో, "విన్నారా! మా గోపాలంనికి స్కూల్లో వుద్యోగం దొరికింది" అన్నాడు.

"చాలాసంతోషం! ఎందుకు దొరకదండీ? మావాడు కూడా చెప్పాడు పాఠాలెంతో విశదంగా చెబుతారుట వారి ధర్మమా అంటూ మావాడికింత చదువచ్చితే!" అన్నాడు శాస్త్రులు.

"శ్రీ కృష్ణార్పనం"గా ఇన్ని బియ్యం చెంబులో పోయించుకుని నిండిన చెంబులో బియ్యం జోలెలోకి మార్చుకుని శాస్త్రులు వెళ్ళిపోయినాడు.

"దొంగముండాకొడుకు, అంతుచిక్కలా!" అన్నాడు గోపాలం. "ఈ పుణ్యం ఈ బ్రాహ్మడు కట్టుకున్నదే. సందేహం లేదు. ఎటువంటివాళ్ళకు ఏవిధంగా రుణపడతామో చెప్పలేంకద!"

గోపాలం కృతజ్ఞతతో కూడిన హృదయం గలవాడు. పైకి చూపడం అలవాటులేకపోయినా అతను తన కితరులు చేసే చిన్నచిన్న ఉపకారాలు మరిచిపొయ్యేవాడుకాడు. ఇతరులకు చిన్నచిన్న వుపకారాలు చేసే అవకాశం తనకు దొరికితే పోనిచ్చేవాడుకాదు. ఇటువంటివాళ్ళు ప్రపంచాన్ని ప్రేమించటానికి ప్రయత్నించి పరాభవం పొందుతుంటారు. ప్రపంచం మంచివాళ్ళ చేతుల్లో వుంటే గోపాలంవంటివాళ్ళు ఉపకారం తక్కువ పొందటమూ పరాభవం ఎక్కువ పొందటమూ తరుచు జరగదు. తనకు పరాభవం జాస్తిగా జరగ

బట్టే గోపాలం వుపకారం చేసేవాళ్ళని మరింతగా జ్ఞాపకం పెట్టుకునేవాడు.

ఉద్యోగం దొరికిందన్న మాటేగాని స్కూలులో తనను హెడ్మాస్టరూ, పెద్దమాస్టర్లుగావున్న ఇతర వైదీకి మాష్టర్లూ చిన్నచూపు చూస్తారనీ, తన లోపాలన్నీ చిట్టా వేసి కమిటీవారి కందజేస్తూ వుంటారనీ, తనమీద వేగు ఉంటుందనీ గోపాలానికి తెలుసు. బళ్ళో మాస్టర్లంతా చెడ్డవాళ్లు కారనీ గోపాలానికి తెలుసు. అందులో మంచివాళ్ళున్నారు కాని వాళ్ళు అరణ్యమృగాలల్లే స్వార్థం చూసుకోవటంలో మునిగి వున్నారు. తనకు పైవాళ్ళ వల్ల అన్యాయం జరుగుతుంటే, అన్యాయమని నమ్మినా, వాళ్ళు దాన్నిగురించి ఏమీ చెయ్యరు. తమకన్యాయం జరుగుతుంటే ఇతరులు సహాయం చెయ్యకపోయినా చెయ లేదనుకోరు. వీళ్ళు దాస్యంలో వుండటమేగాక దాస్యంఆమోదించారుకూడాను. ఆమాటకొస్తే గోపాలం కూడా దాస్యం ఆమోదించినవాడే మరి...

సత్యనారాయణ, పాపం రంగారావుతోపాటు కూర్చునేవాడేగాని గోపాలాన్ని ఒక్క ప్రశ్న అడిగేవాడు కాడు. నోరు తెరచేవాడుకాడు. ఆ రెండు మూడు రోజుల్నించీ జరిగినపాతా లేమీ లేకపోయినా సత్యనారాయణతో మాట్లాడనన్నా మాట్లాడనందుకు గోపాలానికిప్పుడు పశ్చాత్తాపం కలిగింది. ఇప్పుడు సత్యనారాయణకు రంగారావుతో పాటు సమానమైన శ్రద్ధను చూపసాగాడు. సత్యం చాలా

చురుకైన కుర్రవాడనీ, ఎంతో మంచి మార్కులు తెచ్చు కోవటంకోసం భైరవశాస్త్రుల్లు తన కొడుకును పంపిస్తున్నాడనీ గోపాలానికర్థమైంది తనచేతిలో వున్నంతవరకూ సత్యాన్ని పైకి తెద్దామనీ; బాగా కనిపెట్టివుందామనీ అనుకున్నాడు.

కాని గోపాలం ఆశయం నెరవేరే యోగ్యత లేక పోయింది. ప్రైవేటు ట్యూషన్లు చెప్పరాదనీ, డబ్బు తీసుకున్నా తీసుకోకపోయినా ప్రైవేటు ట్యూషనుకు స్కూలు నిబంధనలు వొప్పుకోవనీ గోపాలానికి హెడ్మాస్టరుగారు తెలియజేశారు. రంగారావును గోపాలం సహాయం చెయ్యకుండా అడ్డుపడటం బ్రహ్మవశం కాదు. గోపాలం వాళ్ళింట్లోనే వుంటున్నాడు కాని సత్యంమటుకు తన స్వగృహంలోనే చదువుకోవలసి వచ్చింది.

౩

గోపాలం ఉద్యోగం ఏప్రిల్ నెలతో అయిపోయింది. అతని ఉద్యోగం అక్కడతో అంతం చేసి రెండు నెలలజీతం—యింకో రూపాయలు—ఆదా చేశారు స్కూలు కమిటీవాళ్ళు. ఆ ఉద్యోగం అయిపోయినందుకు అతనికి విచారం కలగ లేదు. స్కూలుకష్టములూలంగా అతను చాలాఅవమానాలు

భరించాడు. ఎంతో ఓర్పుగలవాడైనప్పటికీ అతనికి ఎప్పుడో నౌకరీమీద విసుగెత్తింది. స్కూలు మటుకు మంచి ఉపాధ్యాయుణ్ణి కోల్పోయింది. స్కూలందు విషయమై విచారపడ లేదు.

స్కూలు కమిటీవాళ్ళ నిరంకుశ ప్రవర్తన ద్వారా గోపాలం చాలాడబ్బు కోల్పోయినాడు. కనీసం పదిహేను మంది స్కూలు విద్యార్థులు అతని దగ్గిర ట్యూషను చెప్పుకోవటానికి తయారయినారు. కొత్తమేస్టరనే నెపంమీద కమిటీవారతన్ని ట్యూషనులు చెప్పుకోనివ్వ లేదు.

స్కూలులో అనేకమందిఉపాధ్యాయులుట్యూషనులు చెప్పుకుంటున్నారు. దత్తాత్రేయులింటోనూ, రామ్మూర్తి ఇంటోనూ, శివరామయ్య ఇంటోనూ, గణపతి ఇంటోనూ, పాతికమందీ, ముప్ఫైమందీ విద్యార్థులు ట్యూషన్లు చెప్పుకుని అక్కడే పడుకునేవాళ్ళు. పరీక్షలు దగ్గిరకొస్తున్నకొద్దీ ఈ విద్యార్థుల సంఖ్య దాదాపు రెండింతలకు పెరిగింది. కొంత మంది క్లాసుకు క్లాసు ఇంటిదగ్గిర చేర్చుకునేవాళ్ళు.

ఈ విద్యార్థులకు క్లాసులో రానిపాఠాలు ఇంటిదగ్గిర ఎట్లావస్తాయి? ఏ ఆశతో ఈవిద్యార్థుల తల్లిదండ్రులు నెలకు అయిదేసి రూపాయలిచ్చి ట్యూషన్లు చెప్పిస్తున్నారు?

ట్యూషన్లు చెప్పించుకునే విద్యార్థులకు క్లాసులో ఎక్కువమార్కులు రావటం రివాజు. క్లాసుపరీక్షల్లో వీళ్ళెప్పుడూ తప్పరు. అయితే ఆఖరు పరీక్ష మాటేమిటి? అదీ

ఉపాధ్యాయుల చేతుల్లో వున్నదే. ఎల్లయ్య క్లాసు పేపరు పుల్లయ్య చేతిలో వుంటుంది. పుల్లయ్య క్లాసు పేపరు మల్లయ్య చేతిలో వుంటుంది. అంతా బీరకాయపీచే. నీ పేపరు నాకు చూపించు, నా పేపరు నీకు చూపిస్తా! అంతా పొట్టకోసం దేవులాడుతున్నవాళ్ళే.

ఫలితమేమంటే స్కూలుఫైనలు వరకూ దేదీప్యమానంగా వెలిగినవాడు గవర్నమెంటు పరీక్షలో గోట్టుపట్టు పడటం జరిగేది, ఇంత డబ్బూ బుగ్గిలో పూసిన పన్నీరయిందని అప్పటికి తెలిసివచ్చేది పిల్లల తండ్రులకు! యాభై రూపాయల జీతంగల మాస్టరు, పైన నూటయాభై సంపాదించటం విడ్డూరంగా వుండేదికాదు. స్కూలు కమిటీ కట్టుదిట్టాలతో కూడుకొని వుంటే మేస్టర్లింత తెంచుకుపడటానికవకాశం వుండకపోను. కాని ఈస్కూల్లోకుళ్ళంతా కమిటీలోనే ఉంది. ఉపాధ్యాయుల పై సంపాదనలో భాగం తీసుకుని సెక్రటరీగారే చాలా వేలు సంపాదించాడని ప్రతీతి ఉండేది. నిజం కూడా కావచ్చు.

స్కూలు విద్యార్థులలో మటుకు గోపాలం చాలా గట్టి మేస్టరనే ప్రతీతి పడిపోయింది చదునాంటే ఇష్టం వున్నవాళ్లూ, లేనివాళ్లూ, మెత్తనివాళ్ళూ, అల్లరివాళ్లూ — అందరూ ఏకగ్రీవంగా గోపాలమంటే గౌరవంగా వుండేవాళ్లు. శలవల్లో నలుగురైదుగురు విద్యార్థులు రెండో ఫారం కింది తరగతులవాళ్లు అతని దగ్గిరికి ప్రైవేటుకొచ్చి నెలకు పదీ పది హేనూ, ఇరవై కూడా ఇచ్చి శలవలాఖర్న వేరే ఊళ్ళలో

పై తరగతుల్లో ప్రవేశించటానికి ఆశపడ్డారు వీళ్ళంతా పాసవుతామనే ఆశ ఏమీ లేని బాపతు. అయినా గోపాలం ఈ ట్యూషన్లు ఒప్పుకున్నాడు. సత్యానికూడా శలవుల్లో వచ్చి తనదగ్గర చదువుకోమన్నాడు. కేవలమూ ప్రైవేటు ట్యూషన్లు చెప్పి బతకవచ్చుననే ఆశ పుట్టింది గోపాలానికి.

ఈ విధంగా గోపాలం ఒక సంవత్సరం గడిపాడు. మరుసటి సంవత్సరానికి పరిస్థితులు తారుమారై స్కూలు కమిటీలో నియోగుల సంఖ్య హెచ్చి వారికి పెత్తనం లభించింది. ఒక్కసారిగా పదిమంది నియోగి మెంబర్లు వచ్చి స్కూలు కమిటీలో చేరారు, స్కూలు ఆర్థికపరిస్థితులు బాగుండని కారణంచేతా, స్కూలు నిర్వహణం గురించి వాళ్లలో అలజడి జాస్తి కావటం వల్లా ఈ మార్పు తాత్కాలికంగా మంచిదే అయింది.

ఇతరవిషయాలెట్లావున్నా గోపాలంతిరిగిఉద్యోగంసంపాదించాడు.మరుసటిసంవత్సరం అదిఖాయంకూడాఅయిపోయింది.

గోపాలం సత్యానికి శాశ్వతమైనమేస్టరైపోయినాడు. సత్యం ప్రతి ఏడూ దాదాపు ప్రతి సబ్జెక్టులోనూ మొట్టమొదటి మార్కు తెచ్చుకుంటుంటే గోపాలానికి స్వయంగా ఎంతో గర్వంగా వుండేది. రంగారావు మొదటి సంవత్సరమే వెనకపడిపోయినాడు. అయినా సత్యాన్ని గోపాలం వదలలేదు రోజూ సత్యం, గోపాలం గారింట్లోనే చదువుకునేవాడు. అక్కడే పడుకునేవాడు అతనింట్లో పడుకునే అలవాటు కూడా తప్పింది.

సత్యం మూడో ఫారం చేరిన సంవత్సరం గోపాలం

అతన్ని తన సెక్షనులోనే వేసుకున్నాడు. ఆ సంవత్సరం సత్యం చదువులో తీసుకున్న శ్రద్ధ గోపాలం మరే విద్యార్థి చదువులోనూ ఎన్నడూ తీసుకుని ఉండలేదు.

ఆ తరవాత సత్యానికి గోపాలం మేస్టరుగా వ్యవహరించలేదు. తనతో సమానంగానే చూసుకున్నాడు. తన ఇంటోనే సత్యాన్ని చదువుకోమన్నాడు. అప్పుడప్పుడూ అతని చదువు గురించి విచారిస్తూ వచ్చాడు. కాని స్వయంగా దగ్గిర కూర్చుని నూరిపొయ్యలేదు.

సత్యం స్కూలుఫైనలు పరీక్షకు కూర్చునేనాటికి అతని జీవితంలో గోపాలం ఒక గొప్ప స్నేహితుడుగా తయారై సిద్ధంగా ఉన్నాడు.

# 4

ఇంకా కొద్దిరోజులకు పరీక్షా ఫలితాలు తెలుస్తాయనగా ఒకనాడు సత్యం వచ్చి గోపాలంతో, "మేస్టారూ, మా నాన్న నా పెళ్ళి చేద్దామని చూస్తున్నాడు. మీరేం సలహా చెబుతారు?" అని అడిగాడు

సత్యం ఆమాట అంటూండగా గోపాలం చేతిలో ఒక ఉత్తరం ఉంది—ఒకానొక స్నేహితుడు రాసినది. ఆ క్షణంలో సత్యం వచ్చి ఈ వార్త చెప్పి సలహా అడగటం గోపాలానికి దైవికంగా కనిపించింది.

"నన్నడిగితే చేసుకోమనే అంటాను. ఇంకా ఆలస్యం చేశావంటే పిల్ల నీకన్న మరీ చిన్నదైపోతుంది. దురదృష్ట వశాత్తు మన సంఘం రజస్వలానంతర వివాహాలు ఒప్పుకోదాయె... కాని ఒక్కపని చేస్తావా, సత్యం? అర్జంటుగా నేను మీ నాన్నగారితో ఒక విషయం మాటాడాలి. ఆయన కెప్పుడు వీలవుతుందో కనుక్కో. పెద్దవాడు, ఆయన నా దగ్గిరికి రానక్కర్లేదు నేనే వచ్చి మాటాడుతాను" అన్నాడు గోపాలం.

"అదేమిటండీ, మాష్టారూ? ఆయనే మీ దగ్గర కొస్తాడులెండి ఆయనతో ముందుగా అపాయింటుమెంటు పెట్టాలా?" అన్నాడు సత్యం.

"అలాకాదు, సత్యం! ఈ విషయంలో న్యాయంగా నేనే ఆయన దగ్గరికి వెళ్ళాలి."

"ఫరవాలేదులెండి, నే నింటికివెళ్ళి చెప్పగానే బయల్దేరి రాడూ?" అంటూ సత్యం సెలవు పుచ్చుకున్నాడు.

సత్యం చెప్పినట్టే మరో పావుగంటలో భైరవ శాస్త్రిల్లు గోపాలంగారింటిదగ్గర హాజరయినాడు.

"రండి శాస్త్రిల్లుగారూ, దయచెయ్యండి. పెద్దలు మీరే వచ్చారు" అన్నాడు గోపాలం.

"రావటం నా విధి" అన్నాడు ముసలాయన. ఆయన కిప్పుడు అరవై చేరబడుతున్నై. కొంచెం వయసుకూడా కని పిస్తున్నది. గోపాలం ఆయన్ను బలవంతాన కుర్చీలో కూర్చోబెట్టాడు.

"మరేం లేదు, మీవాడి వివాహం గురించి అనుకుం టున్నట్టు నాకు చూచాయగా తెలిసింది. ఆమక్క నిజమేనా?"

"అనుకోవటం వరకూ చేతిలో పనేగనక అనుకున్న మాట నిజమే. తమకు చెప్పుదామనుకుంటున్నాను కూడానూ. నాకు తనుకంటె ఆప్తులెవరున్నారూ? తమరు మావాడి విషయంలో తీసుకుంటున్న శ్రద్ధ మరెవరు మటుకెందుకు తీసుకుంటారు గనకా? వాడి పురాకృత పుణ్యమో ఏమిటో అనుకుంటాను!"

"ఎంతమాటన్నాడు? పైకొచ్చే విద్యార్థి నావాడని చెప్పుకుందామని ఏ మేస్టరుకుండదు చెప్పండీ. రేపు మీ వాడు పెద్దవాడైతే నేను చెప్పుకుని గర్వపడకూ?" అన్నాడు గోపాలం నవ్వుతూ.

"ఏ జన్మానో మావాడు పెట్టి పుట్టబట్టే తమరంతగా వాడియందు నమ్మకం వుంచటం జరిగింది... ఇంతకూ వాడి పెళ్ళి విషయం అడగటంలో తమ వుద్దేశం——"

"మరేమీ లేదు మీరు పిల్లవాడకి ఏపాటి కట్నం కోరుతున్నారు, ఎటువంటి అభిప్రాయంలో వున్నారో తెలుసుకుందామనే!"

భైరవశాస్త్రిల్లు కనుబొమ్మలు ముడేసి రెండు క్షణాలపాటు నేలకేసి చూసి తలపైకెత్తి మనస్సులో వున్న మాట చెబుతున్న వాడల్లే "అయ్యా, నేను పెద్ద గొంతెమ్మ కోరిక పెట్టుకున్నాను. మనస్సులో వున్న దురాశ బయటికి చెప్పేస్తే పోతుంది. నా రెక్కలు బలహీనమైపోయినై. శరీ

రంలో పూర్వపు దార్ఢ్యమూ జవసత్వాలూ లేవు. పోను పోను కుర్రవాడి చదువు నాకు భారమైపోతుందా అనేభయం పట్టుకుంది. ఇదివరకల్లా పడ్డ కష్టమేమో పడ్డానుగాని, ఇక నైనా, ఈ మిగిలిన నాలుగురోజులూ కృష్ణా రామా అంటూ ఇల్లు కదలకుండా కూచుందా మనిపిస్తున్నది. పిల్ల వాడి భారం పిల్లనిచ్చేవారు తీసుకుంటే—వాడెంతవరకు చదువుకుంటానంటే అంతవరకూ—పోతానంటే ఇంగ్లాండు కూడా పంపే బాధ్యత మీద వేసుకుని చదివించి నట్టయితే నాకు తినేటందుకింత లేకపోలేదు. నాకూ ఇరవై ఎకరాల ఆస్తి వుంది—అంతా స్వార్జితంసుమండీ, జోలెపట్టుకు తిరిగి సంపాదించాను. గడచిన పదేళ్ళనుంచీ ఏరోజున నేను జోలె అవతల పారేసినా నాకు హాయిగా వెళ్ళిపొయ్యేది. కాని ఈ కుర్రవాడికోసమే నేను యాచన చేశాను. నా బొందెలో ప్రాణం వుండగా నేను కూడబెట్టగలిగిన ప్రతి చిల్లిగవ్వా వాడి చదువుకింద ధారపోయటానికే సంకల్పించాను. న్యాయంగా మా పెద్దవాడికి ఆస్తి కొంత ఇవ్వాలిచూడండీ, అదికూడా పాటించకుండా పూచికపుల్లతో సహా మా రెండోవాడి చదువుకే ధారపోద్దామనుకున్నాను. ఆడపిల్లల కూడా ఏమీ పెట్టినవాణ్ణి కాలేదు. వాళ్ళందరికీ ఏదో విధంగా గడిచిపోతున్నదికదా, పోని ఈ వున్నదిపెట్టి వీణ్ణి ఎంత పైకి తీసుకురావచ్చునో చూద్దామనిపించింది..."

"ఎందుకో కొంతకాలంగా నాలో స్వార్థం కలుగు తున్నది. ఆడపిల్లలకు తలా రెండెకరాలైనా ఒదిలి ఈ కట్టెను వొదిలేద్దామనిపిస్తున్నది. మా పెద్దవాడి కిందులో

సహమైనా ఇద్దామా అనిపిస్తున్నది. వాడుకూడా నామాదిరి గానే ముసలితనంలో కూడా యాచనచెయ్యాలా ఏమిటిరా ఈశ్వరా-అనిపించి జాలివేస్తున్నది కాని పిల్లవాడి చదువు ఎటూకాకుండా చెప్పించటం ఇష్టంలేదు. మొదట బియ్యే వరకూ చదివించుదామనుకున్నాను. బియ్యే పరిపాటి అయిపోయింది. బి. యల్. చదివించుదామనుకున్నాను. అదీ చవుకయిపోతున్నది. ఏ ఐ. సి.యస్సయినా చదివిస్తేనే గాని, నా మొదటిగురికి తగిలేటట్టులేదు. నాదగ్గర ఈ ఆస్తి ఉంచుకుని వాడి చదువు నడిమధ్యలో ఆపెయ్యటం అదీ ధర్మంగా కనిపించటంలేదు. ఒకటి రెండేసి ఎకరాలు ఆడ పిల్లల కిచ్చినా,పోనీ పదెకరాలు నా పెద్దవాడికిచ్చినా,అందువల్ల అయ్యేవినియోగంకంటె అంతా ఖర్చుచేసి అయినా - చదువింత అంటుతున్నది గనక — ఏడిమీదే వినియోగ పరిస్తే ఉత్తమ ఫలం ఉంటుందేమోనవే ఆశ పీకుతున్నది."

"పంతులుగారూ, ఈ సందిగ్ధావస్థలో నా కొక్క-టే ఉభయతారకమైన ఊహ తోచింది. ఇంతకీ కలవారి పిల్లను చేసుకుని మా రెండోవాడి చదువు బాధ్యత వారికే వొది లేసి ఈ ఉన్న తృణమూ పెద్దపిల్ల కిచ్చేసి నేను కూడా — ఇంకా ఎంతలెండి—నాలుగు ఘడియలపాటు భగవధ్యానం చేసుకుందామనే స్వార్థంలోపడ్డాను. ముసలివాడికెంతతృష్ణరా అనుకుంటారేమో కడుపులో వున్న ఆలోచన పైకి అనేశాను."

అయిదారు నిమిషాలపాటు ఇద్దరూ మాట్లాడలేదు. గోపాలం తన ఎదురుగా వున్న ఈ విచిత్రమైన వ్యక్తిని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాడు. ఇంతకాలమూ ఈయన స్వార్థ లోభి అనీ, యాచనా ప్రవృత్తి కలవాడనీ గోపాలం విశ్వసించాడు. అటువంటివాడు "ఇప్పుడు నాలో స్వార్థం ప్రవేశిస్తున్నది"అని ఒప్పుకుంటుంటే గోపాలానికి చెప్పరాని ఆశ్చర్యం కలిగింది. ఇంతకాలమూ ఈ ముసలాడు తన చిన్నకొడుకు కోసం ఇంత పెద్ద ప్రయత్నంమీద బయలు దేరాడని వింటుంటే ఈ "ఛాందసుడు" అగస్త్యుడంత ఎత్తయిన మనిషిగా కనిపించాడు. ఎన్నేళ్ళ శ్రమ, ఎంత దీక్ష! ఈ ఛాదస్తపు శాస్త్రుల్లుగారితో పోలిస్తే పదవులకోసమూ బిరుదులకోసమూ దేవులాడే వాళ్ళంతా క్రిములకన్న తక్కువ ప్రమాణంలో కనిపించారు గోపాలానికి మామూలు లెక్కన తను తెలివిగలవాళ్ళలో జతే అయినప్పటికీ దాదాపు పదేళ్ళుగా చూస్తున్న ఈ శాస్త్రుల్లుగారిని ఆయన తన మనస్సులో మాట బయటికి చెబితే తప్ప అర్థం చేసుకోలేకపోయినాడే!

"మీరు కోరినట్టుగా జరుగుతుందనుకుంటాను. ఇబ్బా స్వార్థం ఏమీలేదు. మీ కోరిక చాలా సహ్యమైనది. నాకే డబ్బుంటే మీ భారం నేను వేసుకుని మీ పిల్లవాడికి చదువు చెప్పించి నా కూతుర్నిచ్చి వివాహం చేద్దును. ధనికులంతా ఐసీయస్ పాసయిన అల్లుళ్ళను వెతికి వేలకు వేలుపోస్తారేగాని సత్యంలాంటి వాణ్ణి చూసుకొని ఐసీయస్ పాసు చేయించే కీర్తి మీద వేసుకోరు ఇదే తల్లకిందులు ప్రపంచం" అన్నాడు గోపాలం.

"మీరు చెప్పదలిచిందేదో చెప్పారుకారు" అన్నాడు శాస్త్రుల్లుగారు. గోపాలానికా ప్రశ్న అర్థంకాలేదు.

"మా .. డి పెళ్ళి ప్రస్తావన ఏఉద్దేశతోనో తెచ్చారు. నా సొంతగొడవతో మిమ్మల్ని చెప్పనిచ్చానుకాను."

గోపాలాని కీ సంగతి జ్ఞాపకం చెయ్యగానే అకస్మాత్తుగా బిడియం పట్టుకుని మొహం జేవురించింది.

"అబ్బే, అది వేరే విషయంలెండి. అదేమీ కుదిరేది కాదు, మనకు పొసగే సంగతి కాదు" అని గోపాలం నీళ్ళు నమిలాడు.

భైరవశాస్త్రుల్లు,నవ్వి,"నా చెవినకూడా వెయ్యరాదా?" అన్నాడు.

. "నా స్నేహితుడొకడు—బొత్తిగా లేనివాడే. పాపం, అయితే బహుయోగ్యుడు—తన పిల్లకు తెలివిగల కుర్రవా డెవడన్నా దొరికితే చూడమని నాకు రాశాడు. వైదీకే. పిల్ల చాలా తెలివిగలది. సంగీతం చక్కగా పాడుతుంది. ఫిడేలు వాయిస్తుంది, ఇంటిపనులన్నీ చేస్తుంది. చాలా బుద్ధిమంతురాలు. ఆశ గదా? మంచి సంబంధంకోసం చూస్తున్నాడు. కట్నం ఇచ్చుకోలేడు. ఖర్మం !...సత్యానికి చేసుకుంటే ఇద్దరూ ముచ్చటగా ఈడు, జోడుగా వుంటారని ఆలోచన పోయిందిగాని... మీరు పెట్టుకున్న లైనుకూ దీనికీ కలవదు. అడిగారని చెప్పానుగాని నాకే సిగ్గుగా ఉంది చెప్పటానికి. మీ మనసులోవున్న ఆలోచన సబబైనదని తెలిసి ఇక ఈ విషయం ఎట్లా ప్రస్తావించమా ?" అన్నాడు గోపాలం.

భైరవశాస్త్రుల్లు మళ్ళా ఒక నిమిషంపాటు నేలకేసి చూసి తల పైకెత్తి, "మీరిప్పుడే ఆ స్నేహితుడికే మాటా రాయకండి. రేపో సాటికి నేనే వచ్చి మాట్లాడతాను. నాకు సెలవిప్పించండి" అంటూ లేచాడు.

గోపాలం ఆ మాటమీద ఆట్టే ఆశ పెట్టుకోలేదు.

## 5

గోపాలం మళ్ళీ పొరపాటు పడ్డాడు. మర్నాడు సాయం కాలానికి భైరవశాస్త్రుల్లు మళ్ళీ వచ్చి కూర్చుని, "అయ్యా, మీ స్నేహితుణ్ణి ఒకసారి రమ్మనండి. వీలయితే పిల్లనూ, పిల్ల జాతకాన్ని వెంటపెట్టుకు రమ్మనండి ఆలస్యాదమృతం విషం" అన్నాడు.

"మీరేమీ తొందరపడలేదుకద? శాస్త్ర విచారిస్తే సత్యానికి మంచి సంబంధం దొరుకుతుందేమో! పిల్లనిచ్చే వారు వేలకువేలుపిల్లవాడికి ధారపోయకపోయినా, అప్పుపెట్ట వచ్చు. తరవాత సత్యం తీర్చుకోలేకపోతాడా ?" అన్నాడు గోపాలం.

శాస్త్రుల్లుగారు తల అడ్డంగా తిప్పాడు.

కన్నతండ్రిని నేను పస్తాయిస్తే పిల్లనిచ్చిన మామ గారు డబ్బు తెచ్చి పోస్తాడా? అంత సులభంగా డబ్బుపొయ్యే

గల లక్షాధికారి తన కూతుర్ని మావాడికిస్తాడా? గొంతెమ్మ కోరికలు! నేను నిన్ననే మనవిచేస్తినే... ధీరుడైనవాడు తల పెట్టిన పనులు తుదముట్టించవలసిందే. మీ స్నేహితుణ్ణి పిలిపించండి. మీ ఆప్తులకంటె మా కాప్తులు లేరు."

మరో వారం రోజులకల్లా సత్యంపెళ్ళి స్థిరపడింది. ఇంకో పదిరోజులకు పెళ్ళి జరిగిపోయింది కూడాను.

సత్యానికి ప్రెసిడెన్సీ కాలేజీలో సీటు వచ్చింది. అతను మద్రాసు బయలుదేరి వెళ్ళేటప్పుడు గోపాలం కొన్ని ముక్కలు చెప్పాడు.

"దేవుడనుకూలిస్తే నువ్వు చాలా ముందుకొస్తావు. కాని ఒకటి జ్ఞాపకం పెట్టుకో. నువ్వు మీ నాన్నగారికి రుణ పడబోతున్నావు—ఒకవిధంగా కాదు, రెండువిధాలుగా. నీమీద ఆయన పెద్ద ఆశలుపెట్టుకున్నాడు. నువ్వు మరికొన్ని సంవత్సరాలపాటు అహోరాత్రాలు దీక్షతో పనిచేస్తే తప్ప ఆ ఆశలు ఫలించవు. ఆయన నీకోసం నువ్వు పుట్టినప్పటి నుంచీ దీక్షగా నీకోసం పనిచేశాడు. ఇంకాచేస్తున్నాడు. అది మరచిపోకు. ఆయన ముసలివాడు, నువ్వు కుర్రాడివి. అందు చేత నీ దీక్షకంటె ఆయన దీక్ష గొప్పది. నువ్వు చెయ్య వలసింది అసాధ్యమైన విషయంకాదు—సివిల్ సర్వీసులో చేరేవాళ్ళంతా చేస్తున్నపనేకాని మీ నాన్నగారు చేసినపని అసాధ్యమైనది. అటువంటి త్యాగం ఏ తండ్రీ చెయ్యడు.

"రెండో సంగతి ఏమిటంటే, నువ్వు రూపాయి అణా

పైసలతో నీతండ్రిగారికి రుణపడబోతున్నావు. జ్ఞాపకం పెట్టుకో. అది తీర్చవలసిన బాకే. ఆ ఋణం తప్పించుకో దలిస్తే నువ్వు ఏ ప్లీడరు పరీక్షో చదివేసి ప్రాక్టీసు పెట్టుకోవటం తప్ప మరోదారిలేదు. కాని ఆపనిచేస్తే మీనాన్నగారికి ఆర్థికమైన బాధ తప్పిస్తావుగాని ఆయనపడ్డ శ్రమంతా వృధా అవుతుంది."

సత్యం ఈ విషయాలు జ్ఞాపకం పెట్టుకుని దీక్షగా చదువుతానన్నాడు.

పట్నంచదువు ప్రారంభించినాక చిన్నతనంనుంచీ పట్నంలోనే ఎందుకు చదవలేకపోతినా అనిపించింది సత్యానికి. ఈకాలపు చదువుకు తగిన వాతావరణం పట్నంలో వున్నట్టుగా చిన్న బస్తీలలో వుండదు అక్కడ ఎంతో తెలివిగలవాళ్ళనిపించుకునే సత్యంవటి విద్యార్థుల కెక్కువ లోకజ్ఞానం వుంటుంది. తన తోటివిద్యార్థుల్లో ఎంతో సంపన్నులూ, గొప్ప సంబంధాలు కలవాళ్ళూ, అనేకంకాల ఉద్యమాల్లో తిరిగేవాళ్ళూ, ప్రతిభావంతులూ వుండటం కనిపెట్టి వాళ్ళ సహవాసాలు సంపాదించసాగాడు. అతన్నికూడా వాళ్ళు చాలా తెలివిగల విద్యార్థుల్లో ఒకడికింద స్వీకరించారు.

సత్యానికి లెక్చరర్లతో కూడా కొంత చనువు దొరికింది. ఐ. సీ. యస్. మీద ఆశ పెట్టుకున్నాడని తెలిసి వాళ్ళుకూడా ప్రోత్సహించి సలహాలిచ్చారు. ఆ సలహాల నతను వేదవాక్యాలుగా పాటించాడు. కాలేజీ చదువు కాక

సత్యం యూనివర్సిటీ లైబ్రరీలో అనేక గంటలు గడిపే వాడు.

అతనికి ఎంతడబ్బు కావలసినా తండ్రి పంపిస్తూ వచ్చాడు. ఆ డబ్బుతప్ప సత్యానికి ఇంటి వాతావరణంతో ఏమీ సంబంధంలేకుండా పోయింది. పట్నం వచ్చేవరకూ సత్యం తనయింటి సంస్కారపు గిరులుదాటి పోనేలేదు. కాని ఇప్పుడు దాన్నిదాటి ఎంత పైకివెళ్ళితే తనకంత ఉపయోగ మనిపించింది. పొదుపూ, పూర్వసంప్రదాయాలు మంచి తనమూ—ఈ విలవలేవీ తనకు పనికి వచ్చేవికావు.

## 6

సత్యం ఆనర్సు పరీక్షల్లో ఉత్తీర్ణుడైనాడు. తరవాత కొద్దికాలానికి ఐ. సీ. యస్. ప్రవేశ పరీక్షలో నెగ్గి ఏరుకో బడ్డాడు.

భైరవశాస్త్రుల్లు ఆరోగ్యం కొంతకాలంగా బాగా లేదు. ఆయన ఎక్కడికీకదలటంలేదు. పెద్దకొడుకు సంసారం ఖర్చుకూడా జాస్తి అయింది. ఆయన ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళిచేశాడు. సామాన్య సంబంధాలు తెచ్చినా కట్నాలు పొయ్యవలసి వచ్చింది. రాబడి ఖర్చుకు చాలలేదు. కాని

భైరవశాస్త్రుల్లు అణాచీటీమీద ప్రాణంపోయినా దస్కతు పెట్టలేదు. అయినకాడికి పొలం తెగనమ్మి ఖర్చుజరిపాడు.

సత్యం ఖర్చుముందీ ఖర్చులన్నీకలిపినా ధూపానికి రాలేదు. ఈ సంగతి భైరవశాస్త్రుల్లు అనుకున్న దేగనక ఆయన ఏమీ విచారించలేరు. ఇంగ్లండు వెళ్ళిన తరవాత సత్యం ఖర్చు అంతులేకుండా పెరిగిపోయింది "డబ్బు జాగ్ర గా వాడు" అని రాద్దామని ఎన్నిసార్లో కలం చివరిదాకా వచ్చింది కాని శాస్త్రుల్లు నిగ్రహించుకున్నాడు సత్యాన్ని ఏవిధంగానూ నిరుత్సాహ పరచరాదు వాడు తన చదువు విషయంలో శ్రద్ధవహించినన్నాళ్ళూ ఇంకేం జరిగినా ఫరవా లేదు

ఇంగ్లండులో శిక్షణపొంది దొరవేషంతో సత్యం దిగాడు. భైరవశాస్త్రుల్లు నిట్టూర్చాడు. సత్యంపైస్వరూపమే కాకుండా అతని ప్రవృత్తి గూడా చాలా మారిపోయినట్టు కనిపించింది. జీవితం గురించీ జీవిత సమస్యల్నిగురించీ ఒక నిర్లక్ష్యభావం కనిపించింది. అది నిర్భయం కాదు, నిర్లిప్తత గూడా కాదు. అనేక స్వల్ప విషయాల్లో సత్యానికెంతో లౌకిక శ్రద్ధ ఉంది. తన దుస్తులు కొంచెం మడత నలిగినా రాద్ధాంతం చేస్తాడు. గడియారం ప్రకారం పనిచేస్తున్నట్టుగా తను అనుకున్నదానికి ఒక నిమిషం జాగయితే అల్లాడి పోతాడు! ఇదంతా ఒక కొత్త సంస్కారమని శాస్త్రుల్లుకు తట్టలేదు. తనకొడుకీ లక్షణాలన్నీ అలవాటు చేసుకున్నాడని నమ్మాడు. సత్యంనేర్చిన కొత్తఅలవాట్లన్నీ ఇంకా ఆయనకు

తెలీవు అదంతా తెలుసుకునే అవకాశం లేకమునుపే భైరవ శాస్త్రుల్లుకు పెద్దకనువిప్పయింది. సత్త్యం అంతవరకూ భార్యను తెచ్చుకోలేదు. ఇప్పుడాపని చెయ్యమని తండ్రి హెచ్చరిస్తే సత్యం సరిగా వినిపించుకోలేదు.

భైరవశాస్త్రుల్లుకు కొడుకుమీద అనుమానం కలిగింది. ఏమిటి వీడి ఆలోచన? చపుక బారువెధవలు చేసినట్టుగా అక్కడ ఏ దొరసానో మరిగివచ్చాడా! లాంఛనంగా ప్రాయశ్చిత్తం చేసుకోమంటేనే సత్యం నిళ్ళునమిలాడు. కాని ఎవ్వరికీ తెలీకుండా ఆ తంతు చేసేశాడు భైరవ శాస్త్రుల్లు

ఇక గర్భాదానం విషయంలో సత్యం లొంగేట్టు కనిపించలేదు. కాస్త రెట్టించి హెచ్చరించగా, "ఇంత చదువూ చదివి నా విషయాలు నేను చూసుకోనా? నా కెందు కింత చెప్పటం?" అన్నాడు

"ఒకే, కొన్ని విషయాలెంత చదువు చదివినా తెలీవు అని పెద్దవాళ్ళు చెబితే తెలియవలసిందే"

సత్యం ఏదో గొణిగాడు.

త్వరలోనే అతన్ని దూరదేశం వేశారు. అతనక్కడ ఎవతెనో —— నల్లదాన్నే – పెట్టుకు వుంటున్నాడని వదంతులు వినిపించినై సత్యం మామగారు తన వియ్యంకుడితో సంప్రదించి తన కూతుర్ని వెంటబెట్టుకుని అల్లుడిదగ్గిరికి వెళ్ళాడు.

సత్యం మామ గారితో ఏమీ మాట్లాడలేదుగాని భార్యతోనే మంచిగా చెప్పాడు.

20)

"నేను బుధ్దెరగనప్పుడు మా నాన్న నీకూ నాకూ పెళ్ళిచేశాడు. నాకు నీమీద ఏమీ కోపంలేదు. కాని ఇంగ్లండులో నాకొక బంగాలీపిల్లతో స్నేహమయింది. ఆ పిల్ల అక్కడ చదువుతూండేది, పత్రికలకు రాస్తూండేది. ఆ అమ్మాయికి పెళ్ళికాలేదు. నువ్వడ్డంలేకుండా వుంటే మేమిద్దరమూ పెళ్ళాడి వుండేవాళ్ళం. కాని మాకిప్పుడా అవకాశంలేదు. నాతో స్నేహంగా వుండటానికైనా ఒప్పుకుందిగాని మరొకర్ని పెళ్ళాడడాని కిష్టపడలేదు. నేను నిన్నొకక్షణమునుపే ఆమె నెరుగుదును. నీకోసం ఆమెను తరిమెయ్యమన్నావా? నా వల్లకాదు"

"నే నెక్కడికి పోతాను? నన్నుకూడా ఇక్కడే ఉండనివ్వండి" అన్నది అతని భార్య.

"వుండు, నాకేమీ అభ్యంతరంలేదు. కాని నామీద అధికారము వుందనుకోక, ప్రతిదానికీ నసపెట్టకు. ఆ ప్రకారమైతే ఉండు"

సత్యం భార్య సరస్వతి ఒకనెలపాటు భర్తదగ్గరఉంది. సత్యం తాగుడూ, ఆ బెంగాలీ అమ్మాయికూడా అతనితో పాటు తాగటమూ, ఇద్దరూ తనని లక్ష్యపెట్టకుండా నానా వికారచేష్టలు చెయ్యటమూ, తనను ఇంట్లో నౌకరుకన్న అధమంగా చూడటమూ సహించలేక తనను పంపించమని భర్తనడిగింది అతనామె వెంట నౌకర్నైనా లేకుండా పంపాడు. అయితేనేం? సెకండు క్లాసులో ఎక్కించి పంపాడు.

* * *

"శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః"

గోపాలం కుర్చీలో కూర్చుని పత్రిక చదువుకుంటూ త్రుళ్ళిపడి లేచాడు. చంకలో బోలె, చేతిలో తళతళా మెరిసే చెంబూ పట్టుకుని భైరవశాస్త్రులు ప్రత్యక్షమైనాడు.

"రండి శాస్త్రులుగారూ, కూచోండి" అని గోపాలం ఆయన్ను బలవంతంగా కూచోబెట్టి "ఏమిటిది?" అని ప్రశ్నించాడు.

"అత్యాశకు పోయినందుకు శాస్తి... చూడండి, బాబూ మనిషైనవాడు విచ్చలవిడిగా తాగటమూ, ఎవత్తెనో పెట్టుకుని ఊరేగటమూ, నేర్పే చదువేం చదువూ? ఇటువంటి చదువులు కూడా ఉంటాయూ? మనుషులు దుర్బుద్ధి వల్ల ఇటువంటిపన్లు చేస్తూంటారనుకునేవాణ్ణి. చదువువల్ల కూడా ఇవి అబ్బుతాయా?" అన్నాడు భైరవశాస్త్రులు

"దుర్బుద్ధులందరిలోనూ వుంటూంటై. అయితే ఒక్కో చదువు సంఘభయం పోగొట్టేస్తుంది. సంఘభీతే దైవభీతి అనుకోండి. ఈ చదువు సంఘభీతి పోగొట్టటమేకాక సంఘానికీ మీమీద నామీద ఉండే కట్టుబాట్లుకూడా లేని అవకాశాలు కల్పిస్తుంది. డబ్బు పుష్కలంగా ఇస్తుంది. ఇంక అడ్డేమిటి?" అన్నాడు గోపాలం.

"ఎంత పొరపాటూ! మీవంటి తెలిసిన వాళ్ళండీ కూడా నాతో మాటమాత్రం చెప్పకపోతిరే!"

"చెప్పుదామని నాకు నోటిదాకా వచ్చింది. కాని మీరు డబ్బు సంపాదననే ఘనంగా చూసినట్టు కనపడ్డారు. లేనిపక్షంలో మీ పెద్దవాడి విషయంలో మీరు అసంతృప్తి

పడవలసిన అవసరం ఏముందీ! అతడు ఎంత పెద్ద మనిషి! చదివిన చదువులో ఎంత గట్టివాడు!"

"వాడే నా నిజమైన కొడుకు ఈ వెధవ నాకొడుకే కాడు వాడి పెళ్ళానికి రెండెకరాలు రాసి ఇస్తున్నాను. నేను ముష్టెత్తుకు బతుకుతాను. ఎంతకాలం లెండి. అయిపోయింది. పిల్లలు గలవాడు, నామన్న ఆ స్వంతా నా పెద్దకొడుకే తింటాడు"

"మీరెంతసేపూ డబ్బే ఆలోచిస్తున్నారు, మీ చిన్నవాడిమీద పంతంకొద్దీ... వాడు అందరికళ్లల్లోనూ నికృష్టుడుగా కనిపించాలని జోలె పట్టుకున్నారుగాని మీకు తిండి జరగదా! నన్నడగితే మీవాడి దేమీ తప్పులేదు. తప్పంతా మీదే. వాడి జన్మకి చదువుతప్ప మరొకటి లేకుండా చేశారు. వాడికి ప్రపంచంగొడవ తెలీదు. ఒక సాహిత్యంలేదు. ఒక పురాణంలేదు. ఆఖరుకు ఒక సుమతీ శతకం పద్యమైనా వాడికి రాదు నే నెరిగిన మటుకు వాడొక నాటకంగాని సినిమాగాని చూసిన పాపాన పోలేదు. ఇది కూడును, ఇది కూడదు అనే జ్ఞానం వాడికెట్లా వస్తుందీ?... వాడి మానాన వాణ్ని జీవించనివ్వండి. ఇంతడబ్బు పంపిస్తూ ఉంటాడు, ఖర్చుపెట్టుకోండి" అన్నాడు గోపాలం.

"వాడి డబ్బు నా కవసరంలేదు అదినాకు విషంతో సమానం!"

"మన ఇచ్ఛలన్నీ పిల్లలద్వారా తీర్చుకుందామని ప్రయత్నించేస్తే ఇదే జరుగుతుంది. వాళ్ళు మనకు దక్కకుండా పోతారు... ఫర్వాలేదు, మీవాడు మీకు డబ్బు దానం చెయ్యడు — మీ బాకీ తీరుస్తాడు; మీది మీరు

దక్కించుకుని అంతతో తృప్తిపడండి. మీ మనుమడికి పని కొచ్చే చదువు చదివించండి. వాడు తనపొట్ట పోసుకుంటూ నలుగురికి ఉపయోగ పడేటట్టు చదివించండి" అన్నాడు గోపాలం.

తను అన్నమాటలు భైరవశాస్త్రుల్లుకు కష్టం కలిగించినమాట గోపాలానికి తెలుసు. ఆయనకు కోపం తెప్పించాలనే అన్నాడా మాటలు. ఎన్నడూ తనయింటికి ఉపాదానానికి రాని శాస్త్రుల్లు ఇవ్వాళ రావటం దేనికి? గోపాలం సానుభూతి సంపాదించటానికి తప్పితే!

ఆయనకు ఉపాదానం వెయ్యనేలేదన్న సంగతి భైరవశాస్త్రుల్లు వెళ్ళిపోయిన పాపుగంటకుగాని స్ఫురించలేదు గోపాలానికి.

---

# అజ్ఞాతకథకుడు

బోర్లాపడుకుని పత్రిక చదువుకుంటున్న సరోజిని ఒక్క పెడబొబ్బపెట్టి లేచి కూచుంది.

"చూశావా, సత్తెం అన్నయ్యా?"

పడకకుర్చీలో పడుకుని ఇంగ్లీషు హాస్యనవల చదువుకుంటున్న సత్తెం పుస్తకంమీదనుంచి కళ్ళు తియ్యకుండానే ప్రశ్నార్థకంగా "ఊఁ?" అన్నాడు. ఆ చిన్న శబ్దంలో 'నా చదువు అనవసరంగా పాడుచెయ్యకు. నువ్వు అయినదానికీ కానిదానికీ ఆర్భాటం చేస్తుంటావు. ఆ మాటనాకు తెలుసు, నీకూ తెలుసు. నాకు తెలుసునని కూడా నీకు తెలుసు. నన్ను పలకరించటంగురించి పునరాలోచించుకో. నిజంగా అవసరమైతేగాని మళ్ళీ పలకరించకు' అన్నఅర్థంవున్నది. చిన్నన్న ఇంటివాళ్ళందరితోనూ ఇటువంటి భావగర్భితమైన శబ్దాలు చేస్తూంటాడు. వాటి అర్థం సరోజినికి తెలుసు. అయితే ఆమెలో ప్రత్యేకత ఏమంటే ఆమె ఈ భావాలను కొంచె

మైనా లక్ష్యపెట్టేవికాదు. ఆడదిగా తనకు కొన్ని అధికారాలూ, ప్రత్యేకతలూ ఉన్నాయి. ఉదాహరణకు, ఎంత తాను కోపం తెప్పించినా సత్తెం పళ్లు కొరకగలడేగాని అంతకుమించి ఏమీ చెయ్యలేడు. ఈ అధికారం చాటున ఉండి ఆమె పెద్దన్న అయిన లక్ష్మీపతిని కళ్ళనీళ్ళదాకా తెస్తూండేది. చిన్నన్న అయిన సత్తెంను పళ్ళుకొరికిందాకా రెచ్చగొడుతూండేది.

అయితే ఇప్పుడు సరోజిని అటువంటి 'మూడ్'లో లేదు ఈసారి ఆమెది తెచ్చిపెట్టుకున్న ఆవేశంకాదు

"వీడెవడో ఈ కథచూడు ఎట్లా రాశాడో? అంతా మనమీదే అన్నయ్యా!"

సత్తెం యిక ఉదాసీనంగావుండి లాభంలేదు. ఎవడో తనమీద కథ రాశాడన్న ఆరోపణ వచ్చినతరవాత దాని విషయం తేల్చుకోకుండా వుడ్‌హౌస్ వ్యాసం ఆస్వాదిస్తూ పోవటం అంతరాత్మగలవాడు చేసేపనికాదు.

కొద్దిరోజులక్రితం సరోజిని ఇట్లాగే దారేవెళ్ళేవాడి మీద ఒక ఆరోపణ చేసింది—వాడు రోడ్డుమీదుగా పోతూ తనకేసే చూస్తూ వెళ్లాడని. "చూస్తే చూశాడు లెస్తూ" అన్నాడు లక్ష్మీపతి వాణ్ణిపట్టుకుని శిరచ్ఛేదంచేసి వాడి తల తెచ్చి సరోజిని కాళ్ళముందుపెట్టి, "నీపగ తీరిందా?" అని అడగవలసిన భారం సత్తెంమీద పడింది. సత్తెం అంతపనీ చేసేవాడే, వాడు దొరికినట్టయితే. "ఈసారి వాడు మన ఇంటిముందుగా వెళితే నాకు చెప్పు" అన్నాడు సత్తెం. సరోజినికి సగంపగ తీరినట్టే అనిపించింది. వాడు మళ్ళీ కని

పిస్తాడేమోనని ఆమె చాలా రోజులు పనిమానుకుని నిరీక్షించింది. కాని ఆ పిరికి వెధవ మళ్ళా రాలేదు. తనపగ సాంతం తీరనందుకు కాబోలు సరోజిని చాలా నిరాశచెందింది...

"ఎవరా కథ రాసినవాడు?"

"ఎవడో వెట్టోవాడు!" అంటూ సరోజిని పత్రిక పేజీలు తిరగేసి కథకుడిపేరు చూసింది. "ఎవరో ఎ. ఎస్. రావుట."

ఆ పేరు సత్తెం రెండుమూడుసార్లు మననంచేశాడు, ఎవరిముఖమైనా స్ఫురిస్తుందేమో నన్నట్టుగా.

"పొడి అక్షరాలు వేడిచాడు, ఎవరన్నా కనుక్కుపోతారని" అన్నాడు సత్తెం. "ఒకవేళ ఎ. నారాయణరావేమో, నరసింహారావుకూడా కావచ్చు. నాగేశ్వర్రావెందుకు కాగూడదూ? ఇటువంటి పేరుగల కథలు రాసేవాడెవడూ జ్ఞాపకం రావటంలేదే?"

"అసలది దొంగపేరై వుంటుంది"

"అట్లా అయితే మనం చచ్చినా కనుక్కోలేం" సత్తెం కుర్చీలో మళ్ళా చేరగిలపడి పుస్తకం చదివే యత్నం చెయ్యసాగాడు.

సరోజినికి గొప్ప నిరుత్సాహం కలిగింది. ఇంకా ఎంతో కర్మకాండ జరగవలసి వుండగా అప్పుడే సత్తెం చేతులు కడిగేసుకోవటం ఆమెకిష్టంలేదు.

ఈ కథకుడి శిరస్సు ఖండించి తెచ్చి సరోజిని పాదాల దగ్గిర పెట్టే బాధ్యత తనమీదనుంచి జారిపోయినందుకు

సంతోషిస్తున్న సత్యం, సరోజిని మాటలకు బిగుసుకు పోయాడు.

"ఈ కథ నువ్వుకూడా చదువు తరవాత మెల్లిగా కూచుని ఆలోచిస్తే ఎవరు రాసిందీ తెలుస్తుంది. ఎవడో బాగా యెరిగినవాడే అయివుంటాడు" అన్నది సరోజని.

హాయిగా వుడ్‌హౌస్ చదువుకుంటున్న ప్రాణిని పని పెట్టుకుని మనోవేదన కలిగించే ఆ కథ చదవమంటే ఎట్లా వుంటుంది? సరోజిని వొట్టి 'మోర్బిడ్' మనిషి అయి వుండాలి మనస్సుకు అసహ్యమైన వివరాలు కలిగించే వాటిని పనిపెట్టుకుని వెతుకుతుంది కిందటేడు ఎవరో ఆడది మొగుడుతో పోట్లాడి భావిలోపడి చస్తే శవాన్ని చూడటా నికి పరిగెత్తింది. ఆ శవాన్ని సరోజిని పదిరోజులపాటు భోజ నాలదగ్గిరా, పడుకోబొయ్యేటప్పుడూ వర్ణిస్తూనే వుంది. సత్యం ఇటువంటి జుగుప్సాకరమైన విషయాల జోలికి వెళ్ళే వాడుకాదు. తప్పనిసరి అయి వాటిని ఎదుర్కోవలసివస్తే చలించేవాడుకాదు. సరోజిని తనకన్న ఎక్కువగా చలించి నట్టు కనబడుతూ వాటికోసం వెతుకుతుంది అందుచేత ఆమె మన స్తత్వం సత్యం వూహించలేకపోయేవాడు, ఆమెకు వాస్తవంగా జుగుప్స కలిగించేవి ఇష్టమని, పైకి ఇష్టంలేనట్లు నటిస్తుందని అతనికి చాలాసార్లు తట్టింది. కాని ఈమాట పైకి అంటే యిక యింటిల్లిపాదికీ నాలుగు రోజులపాటు నిద్రాహారాలుండవు. సరోజినే ఒక జుగుప్సాకరమైన విషయ మన్నట్టుగా భావించేవాడు సత్యం.

ఇంతలో ఆమె తన వా కథ చదవమంటుంది. చదివి చేసేదేమీ వుండదు. అందులో నిజంగా తమ కుటుంబం గురించి ఏమన్నా రాసివుంటే తనకు మనః క్లేశం కలగటం తథ్యం. దాన్ని చదవకపోతే వుండే క్షేమం చదివితే లేదు. ఒకసారి తను కథ చదివాడో, హత్యకేసులో సాక్షిఅయి నట్టే.

"నువ్వు సొంతం చదివావా? నువ్వు చదువు నేను మెల్లిగా చూస్తాలే!" అన్నాడు సత్తెం ముఖానికి వుడ్ హౌస్ అడ్డం పెట్టుకుంటూ.

"అయిపోయింది. ఈ ఒక్క పేజీ చదివి ది నీకిస్తా," అన్నది సరోజిని.

తిరిగి వుడ్‌హౌస్ పారవశ్యంలో పడిపోయిన సత్తెం వాస్తవ ప్రపంచంలోకి వచ్చేసరికి సరోజిని పక్కన నిలబడి వుంది. అతని ముఖం మీద పత్రికవుంది "చదువు నీకే తెలుస్తుంది," అంటున్నది సరోజిని.

బలవంతాన సత్తెం వుడ్‌హౌస్‌ను పక్కన పెట్టి పత్రిక అందుకున్నాడు సరోజిని ఇంతసేపూ మాట్లాడుతున్న కథపేరు "పెళ్ళి ఇక్కట్లు". కథకుడిపేరు ఎ. ఎన్. రావుఅని వుంది సత్తెం కథను మొదలుపెట్టి చదవటానికి బదులు పైనుంచి కిందికీ, కిందినుంచి పైకీ, పక్కలకీ చూడసాగాడు పేజీలు తిప్పి, "అబ్బో, చాలా పెద్దకథే!" అన్నాడు.

"పైకి చదువు- నేనుకూడా వింటా" అన్నది సరోజిని. 'నేను వినేట్టు చదివితేగాని నీకా కథ అర్థం కావలసిన విధంగా అర్థంకాదు' అన్నట్టు.

"నువు చదివితివిగా?" అన్నాడు సత్తెం.

'నువు ఆ కథ రాసినవాడిపక్షం కావాలని చూస్తున్నావు గావలాలు, ఈ పప్పులు నా దగ్గర వుడకవు' అన్నట్టుగా ముఖం పెట్టింది సరోజిని.

"సుందరి వరండా స్తంభాన్ని ఆనుకుని కూనిరాగాలు తీస్తూ రోడ్డుమీద పొయ్యేవాళ్ళని అదోకరకమైన దొంగ చూపులు చూస్తున్నది" అని చదవసాగాడు సత్తెం, ఎవరో తనను తోస్తున్నట్టుగా.

"సుందరి అంటే ఎవరో తెలుసా? నేనూ! నేను వరండాలో నిలబడి రోడ్డుమీద పొయ్యేవాళ్ళని దొంగ చూపులు చూస్తానా?" అని దబాయించింది సరోజిని.

"అయినప్పుడా సుందరి నువ్వే అని యెందుకనుకోవటం" అన్నాడు సత్తెం కొంచెం విసుగుగా.

"ఇంతేనా నీకు తెలిసింది? చదువు మరి. ఆ సుందరికీ నాలాగే పదహారో ఏడు. దానికి కూడా సినిమాల్లో వేషం వెయ్యాలనుందట," అన్నది సరోజిని మూతి ముడుచుకుంటూ.

"నీకు సినిమాల్లో వేషం వెయ్యాలనుందా?" అన్నాడు సత్తెం ఆశ్చర్యంగా.

"ఎవరికినూత్రం ఉండదేమిటి?" అన్నది సరోజిని.

"అందరికీ ఉండేటప్పుడు ఆ సుందరి నువ్వే అని ఎందుకనుకోవాలీ" అని, అన్నాడు సత్తెం.

"ఒక్కమాట చదివి ప్రశ్న వేస్తావేమిటి? చదువూ. అది కూడా థర్డ్‌ఫారం పాసయి చదువు చాలించిందట"

"నువ్వు నాలుగు నెల్లు పోరుఫారం వెలిగిస్తివిగా?"

"తేడా ఏమిటో?"

"ఇంకేం పోలికలున్నై?"

"చదవమంటే చదవడేం? నేను పెళ్ళికోసం తహ తహ లాడుతున్నానుట! ఎవరో స్నేహితురాలి దగ్గిర రహస్యంగా సెక్సు పత్రికలు చదివానుట!"

"నువ్వంటే ఈ సుందర నేగా నీ ఉద్దేశ్యం?"

"కాదు. సుందరంటే నేనేనని వాడి ఉద్దేశ్యం—ఆ రాసినవాడి ఉద్దేశం"

"ఇంతకీ నువ్వు స్నేహితురాలి దగ్గిర సెక్సు పత్రికలు చదివావా?"

"నువే తెస్తావుగా ఏవేవో పత్రికలూ?"

"నువ్వు వాటిని చదివినప్పుడు వాడు రాశాడని రోషమేం?"

"సెక్సు పత్రికలు చదవటం తప్పా? అందులో ఎంతో విజ్ఞానం ఉంది."

"మరయితే నువెందుకు గింజుకుంటున్నావో నాకు తెలియటం లేదు"

"నా కొకటే అర్థంకాదు. నేనా సెక్సు పత్రికలు చదివి చెడిపోయానుట—వాడంటున్నాడు.

"సుందరి చెడిపోయినట్టుగా రాశాడా ఏం?"

"అదొక్కటే తక్కువ."

సత్యం పూర్తిగా అయోమయంలో పడ్డాను.

"నేనీకథ చదివేస్తానుగాని ఈ సుందరి ఏంచేస్తుంది చెప్పు?"

"ఏంచేస్తుందా? ఆ కథ చెప్పేవాణ్ణి పెళ్లాడేస్తుంది! ఈ కుంకనుచూసి నేను ప్రేమిస్తానుట—హుం!"

"ఇంకేం? నిన్ను గొప్పగానే చూపించాడుగా? ఎందుకీ ఉక్రోషం? నన్ను గురించి ఎవరన్నా అట్లా రాస్తే నేను ఎంతో సంతోషిస్తా!"

"నిన్ను గురించీ ఉంది అందులో. నువ్వు బియ్యే పాసయి వాజల్లే ఇంట్లో కూచున్నావుట. నా పెళ్ళిసంగతి నీకు పట్టదుట"

"వాజ అనేమాట అందులో లేకపోవాలీనిపళ్ళు రాలగొడతా!" అన్నాడు సత్తెం, ఆడదానికి చూపవలసిన మర్యాదకూస్తా మరిచిపోయి.

"ఉండకుండా ఉంటుందా ఏం? మొత్తానికి నువ్వు వాజవన్నట్టే రాశాడు."

"పోనీ వాకన్నా నిన్నే బాగా రాశాడుగద! కథ చదివి నే నేడుస్తాలే. నువ్వు నిశ్చింతగా ఉండు"

సత్తెం తిరోగమిస్తున్నట్టుగాతోచి సరోజనిపంచాంగం విప్పింది!

ఈ ఇంట్లో మగవాళ్ళకి కొంచెమైనా సిగ్గూ, ఎగ్గూ లేదు. వాళ్ళ అమ్మల్నీ చెల్లెళ్ళని ఎవరేమన్నాసరే పట్టిచుకోరు. ప్రతి వెధవా స్నేహితుడల్లే ఇంటికి రావటమూ, మనని గురించి అవాకులూ చెవాకులూ రాయటమూ, మనం

దులిపేసుకుని వాళ్ళకి కాఫీలూ ఫలహారాలూ మెక్కబెట్టట మూనూ!"

"నన్నేంచెయ్యమంటావే?"

"చాతయితే ఈ కథ యెవడు రాశాడో కనుక్కుని వాడి భరతం పట్టించు ఇంటికి పిలిచి మేమందరం చూస్తుండగా పాడిబొచ్చుకాలగొట్టి యీదవడాఅదవడా వాయించి, పంపించు. నువు వాజవనే ధైర్యంతోనే వాడాకథ రాశాడు."

"నన్ను ముందు కథ చదవనీ," అన్నాడు సత్యం, ఈ సంత తాత్కాలికంగానైనా వదిలించుకుందామని.

సత్యం కథ చదవనారంభించాడు. వుడ్‌హౌస్‌కు అంకితం చేయవలసిన కాలం ఈ దిక్కుమాలిన చెత్త కథ మీద—అందులోనూ ఒక తెలుగు కథకోసం—దుర్వినియోగమవుతున్నదే అన్న బెంగ అతన్ని బాధిస్తూనేఉంది.

కథ చదువుతుంటే అక్కడక్కడా తన కుటుంబానికి మంచిదెబ్బలే కనిపించాయి! సుందరిపాత్ర కనీసం సగానికి సగం సరోజినే కాని రామగోపాల్ పాత్ర పన్నెండు వీసాలు తనూ! లక్ష్మింపతికూడా ఉన్నాడు. అయితే సుందరికి వాడు అన్న కాదు, తండ్రి. సుందరి తల్లికి తన తల్లికి లీలగా పోలిక కనిపిస్తున్నది. కథలో గొప్ప విషయం ఏమీ లేదు. సుందరికి మొగుణ్ణి సంపాదించటానికి మిగిలినవాళ్ళు చాలా యాతన పడతారు చిట్టచివరకు పొరిగింటివాడికే ఇచ్చి చేస్తారు.

ఈ కథ తమ కుటుంబాన్ని గురించేఅనిసత్యంనమ్మలేక పోయాడు, కాని తమ కుటుంబాన్ని ఎరిగున్నవాడు రాసి వుండటం అసాధ్యంకాదు. లక్ష్మింపతి ఇంటికి వచ్చాక

అందరూ కూచుని కథ చదివారు. సరోజినిలాగే లక్ష్మింపతి కూడా, "ఇదేదో తెలిసినవాడు చేసినపనే, సందేహంలేదు. కాకపోయినా మనం వేగిరం సరోజాకు పెళ్ళిచేసెయ్యటం మంచిది" అన్నాడు, రెంటికీ గాఢమైన సంబంధం వున్నట్టు.

"చిన్నన్నయ్య ఇంటికితెచ్చే వెధవ సజ్జులోనే ఒక అంట్ల వెధవ రాసివుంటాడు" అన్నది సరోజిని.

"నాకోసం వచ్చేవాళ్ళలో సూర్యనారాయణకుతప్ప యింకెవరికీ సరిగా ఉత్తరంముక్క రాసేశక్తికూడా లేదే!" అన్నాడు సత్తెం

"ఛీ, పాపం. సూర్యనారాయణ అటువంటివాడు కాదురా!" అని తల్లి సర్టిఫికెట్టిచ్చింది.

"అదీకాకవాడికి పెళ్ళయిపోయింది. ఇది రాసినవాడికి సరోజను పెళ్ళాడాలనే ఏదుపేదో వుంది. నన్నడిగితే యిది ఆ గోపాలుగాడిపనేమో అని——" అన్నాడు లక్ష్మింపతి.

"గోపాల్ గాడు ఇందులో ఒక్క వాక్యం రాయలేడు. నేను రాపిస్తా" అన్నాడు సత్తెం.

"పొరుగింటివాడంటే యెవరై వుంటారూ?" అని తన్ను తాను ప్రశ్నించుకున్నాడు లక్ష్మింపతి.

"ప్రసాదరావా?" అన్నాడు సత్తెం ఆశ్చర్యంతో.

"నిదంతా చోద్యంరా. ఆ ప్రసాదరావుకు మన అమ్మాయి నిచ్చుకుంటామా ఏం? అంతకులంకూడా పాటించనంత గండకత్తెం ఏమొచ్చిందీ?"

"నీకు తెలీదులే, అమ్మా! ఆత్రంకొద్దీ రాయటానికి అడ్డేమిటి? పెళ్ళయినట్టు రాయగానే అయిపోయిందా?"

"ప్రసాదరావు రాస్తాడని నేను నమ్మను" అన్నది సరోజిని. "అతను చాలా మంచివాడు. ఇంకెవరో రాసి వుంటారు, సరిగా ఆలోచించండి."

"ఏమర్రా? యేదో చర్చిస్తున్నట్టున్నారే!" అంటూ లోపలికొచ్చాడు భీమరాజు బాబాయి.

"రా, బాబాయ్. ఏమిటా ఉత్తరం?" అన్నాడు ఇంటిపెద్ద లక్ష్మీపతి.

"ఏముందిరా? కిందటివారం అక్కిరాజు రమణయ్య గారికి ఉత్తరం రాసినే. ఆయన జవాబు రాశారు. వాళ్ళబ్బాయి పిల్లను చూసుకుని ఇష్టపడితే మిగిలిన వాటన్నిటికీ సమ్మతమేనట!"

బాబాయి తన చేతిలో ఉత్తరం లక్ష్మీపతికిచ్చాడు. లక్ష్మీపతి చదువుకుని, "అబ్బాయి రేపే వస్తాడన్నమాటా?"

"అవును. మా యింటికే వస్తాడు. మా రాఘవులు వెంట పంపిస్తా. పిల్లతో మాట్లాడనివ్వండి. తప్పేం లేదు లే!"

మర్నాడు ఉదయం తొమ్మిది పది మధ్య పెళ్ళికొడుకు చూపులకు వచ్చాడు. కుర్రాడే. మద్రాసు స్టేషన్‌లో ఉన్నాడు. చూడటానికి అందంగానూ చురుకుగానూ వున్నాడు. కొంచెం బిడియస్తుడు. మద్రాసు ట్రాముల్లాగే, నాలుగు మాటలు గబగబా అని అకస్మాత్తుగా ఆగిపోతాడు, మళ్ళీ ఇంకో తోపుతో స్టేగాని కదలడు. పేరు నాగభూషణ రావు. భూషణం అంటారు.

పెళ్ళికూతురువారు అతనిచుట్టూ మూగారేగాని సంభాషణకు ఎక్కువ సహాయపడలేదు. ఎవరూ మాట్లాడని

క్షణాల్లో పెళ్ళికొడుకు ఒంటరిగా డైపోయి చాలా యిబ్బంది పడుతున్నట్టు స్పష్టమయింది. పెళ్ళికూతురుమాత్రం ఈ సదస్యులు వుండికూడా లేనట్టు నటించటానికి పత్రిక ఒకటి సాపుగా పెట్టుకుని పేజీలు తిరగేస్తూ, మధ్య మధ్య తల యెత్తకుండా కనురెప్పలు మాత్రం ఎత్తి పెళ్ళికొడుకును దొంగచూపులు చూస్తున్నది

పెళ్ళికొడుకు దృష్టి అకస్మాత్తుగా పెళ్ళికూతురు చేతిలోని పత్రికమీద పడింది. మునిగిపోతున్నవాడికి గడ్డిపోచ దొరికినట్టు, ప్రేక్షకుల మౌనాన్ని భరించలేకుండా ఉన్న పెళ్లికొడుక్కి ఈ పత్రిక దొరికింది.

"ఈ పత్రిక ఇక్కడకూడా ఉందే!" అన్నాడతను.

"మా సరోజినికి పత్రికలంటే ఇష్టం. ప్రతి పత్రికా అయిదారుసార్లు చదువుతుంది."

పెళ్ళికొడుకు ముఖం దేవురించింది. అతి కష్టంమీద అతను. "అందులో నా కథకూడా ఉంది" అన్నాడు.

"ఆఁ?" అందరూ ఆశ్చర్యం ప్రకటించారు.

"ఏదో పిచ్చికథ, దానిపేరు "పెళ్ళియిక్కట్లు". మళ్ళి పెళ్ళికొడుకు బిగుసుకుపోయాడు.

సత్తెం ముఖాన కత్తివాటువేస్తే నెత్తురుచుక్కలేదు లక్ష్మింపతీ, తల్లీ ఒకరిమొహం ఒకరుచూసి కొద్దిగా చిరునవ్వు నవ్వుకున్నారు.

"బలే మంచికథ!" అన్నది సరోజిని చెక్కుచెదరని ముఖంతో, ఎవరితో అంటున్నదీ ఎవరికీ అంతుబట్టకుండా.

పెళ్ళికొడుకు ముఖం ఆనందంతో జేవురించింది.

తరవాత భావి వధూవరులు ఒంటరిగా కూచుని మాట్లాడుకునేటప్పుడు. "నిజంగా నీకా కథ బాగుందా?" అన్నాడు పెళ్లికొడుకు.

"చాలా బాగుంది. నాలుగుసార్లు చదివాను" అన్నది, పెళ్ళికూతురు తల యెత్తకుండా.

"అటువంటి వాళ్ళుంటారు. కాదూ!" అన్నాడు పెళ్లికొడుకు.

"ఎక్కడన్నా ఉండొచ్చు" అన్నది పెళ్ళికూతురు.

# దాలిగుంటలో కుక్కలు

వాళ్ళ ఊళ్ళో ఏం చేస్తుందో గాని, పండక్కీ, పర్వానికీ పుట్టింటికి వచ్చినప్పుడు అక్కయ్యకు బొత్తిగా కాలం జరగదు. అందుకని బావ ఎక్కడెక్కడి పత్రికలూ తెస్తాడు పిల్లల పత్రికలూ, ఆడవాళ్ళ పత్రికలూ, మగవాళ్ళ పత్రికలూ అన్నీ చదివేస్తుంది అక్కయ్య. చిట్టీ,బుల్లాడూ పిల్లల పత్రికలే చదువుతారు. మిగతావి బొమ్మలు చూసుకుంటారు కాని అక్కయ్య అన్నీ చదివేస్తుంది.

బావ పత్రికలో ఒకనుంచి కథ చూపించాడు. అక్కయ్యని చదవమన్నాడు. అక్కయ్య చదివింది. అర్థంకాలేదన్నది.

"నేను చదివి వినిపిస్తే అర్థమవుతుంది" అన్నాడు బావ.

"చదువు బావా, నేనుకూడా వింటా" అన్నది చిట్టి.

"నేనుకూడా వింటా బావా" అన్నాడు బుల్లాడు.

"ఏమిటోయ్ అదీ? మంచి కథా యేం? కొంచెం గట్టిగా చదివితే నేనుకూడా విని ఆనందిస్తాగా?" అన్నాడు నాన్న.

"అమ్మాయ్, ఈ వసారాలో చాపేసి దీపంపెట్టవే, చదువుతుంటే నాకూ్కడా వినిపిస్తుంది!" అన్నది అమ్మ వంటింట్లోంచి

బావ చదవసాగాడు. అమ్మ వింటున్నది. నాన్న వింటున్నాడు బుల్లాడూ, చిట్టీ వింటున్నారు. సరే అక్కయ్య వింటూనే ఉంది.

మధ్యమధ్య బావ, కూలివాళ్ళు సమ్మె ఎందుకు చేస్తారో, వాళ్ళ సమ్మెను యజమాను లెట్లా పడగొడతారో కూలీలను లాకౌటు చెయ్యటమంటే ఏమిటో, పోలీసులు వచ్చి యజమానుల తరఫున ఎట్లా హింసలు పెడతారో అదంతా వివరంగా చెబుతూ కథ పూర్తిచేశాడు.

కథ చాలా బాగుందన్నది అక్కయ్య.

"యజమాన్లను చంపినా పాపంలేదు" అన్నది చిట్టి.

"వాళ్ళమీద లాఠీచార్జి చెయ్యాలి. అప్పుడుగాని వాళ్ళతిక్క వదల్దు" అన్నాడు బుల్లాడు.

"ఏముంది నాయనా, డబ్బుగలవాడిది రాజ్యం! కూలిచేసుకునే ముండాకొడుకులను ఆలించేవాళ్ళా, పాలించే వాళ్ళా? తినటాని కింత ఉండికూడా మనమే ఇన్ని కష్టాలు పడుతుంటే, వాళ్ళగతి ఎట్లా ఉంటుంది, పాపం!" అన్నది అమ్మ కూరతిప్పుతూ.

"నా చిన్నతనంలో ఇంత అన్యాయం లేదోయ్! పని చేసే వాడంటే ఎంతో ఆదరం వుండేది. తిండికీ బట్టకీ లోట నేది పనివా ళ్ళెరుగుదురా? కమతగాళ్ళున్నారంటే ఇంట్లో పెత్తనం దగ్గర్నుంచీ వాళ్ళదే. పనిచేసేవాళ్ళని పరాయివా ళ్ళల్లే చూడటం ఎన్నడైనా కద్దా? ఈ రైళ్లూ ఈ ఫాక్టరీలూవచ్చి మరీ దేముడూ దైవమూ లేకుండా పోయింది. ఈ ఫాక్టరీలవాళ్ళు ఇంతింత సంపాదిస్తున్నారు కదా, పోనీ ఆ కూలివాళ్ళ మొహాన ఇంత పారేస్తే ఏం? ఆశకైనా అంతుండొద్దూ? ఎబ్బె, ఛీ!" అన్నాడు నాన్న.

"ఇదంతా పోనివ్వండిగాని సమ్మె చేసినంతమాత్రాన పోలీసులు వచ్చి కూలీలమీద కాల్చటం దేనికి? పనికి రాక పోతే వాళ్ళకే నష్టంగా?కావాలంటే కూలీలు పని మానుకో కూడదా? వాళ్ళచేత బలవంతాన పని చేయిస్తారా?"అన్నది అక్కయ్య

"అట్లాగా? ఒకరోజు పనివాడు కూలిమానేస్తేవాడికి కూలిడబ్బుకే నష్టం యజమానికి అంతకంటె నష్టం. అదీ కాక, పని మానదలచిన కూలివాడు పదిహేను రోజులు ముందుగా యజమానికి, నోటీసు ఇవ్వాలి ఆ పదిహేను రోజుల నోటీసూ కూలీలు యజమాని, కూలీలకు యజమానీ ఇచ్చి ఉంటారు" అన్నాడు బావ.

"సమ్మెకు ముందుగా నోటీసిస్తారు కాబోలుగా?" అన్నది అక్కయ్య.

"ఇస్తారు, ఇచ్చినా సమ్మె పని మానుకోవటమూ ఒకటి కాదు. పని మానుకున్న కూలివాడు ఫాక్టరీ వొదిలి

పోతాడు. సమ్మెచేసే కూలీ ఫాక్టరీ దగ్గరేవుండి, మరొకడు తన స్థానం ఆక్రమించకుండా చూస్తాడు"

"అందుకేనా పోలీసులు వచ్చి కాల్చటం?"

"అవును."

"పోలీసులకు ఫాక్టరీయజమానులు జీతాలిస్తారా?"

"లేదు, మనం కట్టే పన్నులతోటే పోలీసుల జీతాలు ఇస్తారు ఐతే ప్రభుత్వాలు నడిపేవాళ్లు యజమానుల మంచి కోరనప్పుడు సమ్మెలు విచ్ఛిన్నం చెయ్యక తప్పదు."

"కూలివాళ్ళనికాల్చటానికి పోలీసులు వెళ్ళకపోతే?" అన్నది చిట్టి.

"పోలీసులు వెళ్ళకపోతే కూలీల సమ్మె గెలవచ్చు. గెలిస్తే కూలీలకు యజమాన్లు ఎక్కువ జీతాలిచ్చుకోవాలి" అన్నాడు బావ.

"అట్లా అయితే బాగుంటుంది" అన్నది చిట్టి సంతోషంతో.

"అట్లా అయితే యజమానులు ఫాక్టరీలు మూసెయ్యవచ్చు. అప్పుడేం జరుగుతుందీ? బట్టల మిల్లులు ఆడవు, మనకి బట్టలుండవు. ఏ మిల్లూ ఆడదు. మనకి అనేక వస్తువు లుండవు"

"ఏమీ లేకపోతే ఎట్లా?" అన్నాడు బుల్లాడు

"అటువంటప్పుడు ప్రభుత్వం యజమాన్లమీద అధికారంచేసి మిల్లులు ఆడించవచ్చు. యుద్ధమప్పుడు కొన్ని మిల్లులు మూసేస్తే ప్రభుత్వం బలవంతాన తెరిపించింది."

"ఆ పని చెయ్యకూడదూ?" అన్నది అక్కయ్య.

"పిచ్చిదానా, ఆ పని చెయ్యటానికి మాత్రం శక్తి సామర్థ్యాలు ఉండొద్దూ? మనకున్న పరిస్థితుల్లో యజమానులు లాభాలకోసం వస్తువులు తయారు చేస్తారు తప్ప, నీకూ నాకూ అవి లేకపోతాయేమోనని తయారుచెయ్యరు. వాళ్ళు లాభాలకోసం మిల్లులు నడిపినన్నాళ్లూ కూలీలకు దరిద్రం తప్పదు. దరిద్రం భరించలేక వాళ్ళు సమ్మెలు చెయ్యకా తప్పదు. సమ్మెలు చేస్తే ప్రభుత్వం యజమాన్ల పక్షం వహించి కూలీలను దండించకా తప్పదు. కాల్చి చంపుతారని తెలిసికూడా కూలీలు సమ్మెలు చేస్తున్నారంటే వాళ్ళబాధ ఎటువంటిదో మనం ఊహించుకోవాలి" అన్నాడు బావ.

"నువ్వెంతైనా చెప్పవోయ్, దేహీ అని యాచిస్తే ఇవ్వనివాడే మన ధర్మం ప్రకారం పరమ పాతకుడు. ఉండి కూడా కూలి సరిగా ఇవ్వనివాడు పరమ ఛండాలుడనుకో. ఇదే కవి స్వరూపం. మూలకుడంటారు గాని, ఆ రష్యాలో పద్ధతే బాగుంది. ప్రతివాడికీ పనంటూ ఉందిట. ఎవరూ తిండికి మాడి చావరుట! ఇంకేంకావాలి? మనమాట ఎట్లా వున్నా పాటకపు జనానికి రష్యా అంటే స్వర్గమే" అన్నాడు నాన్న.

"నిండు ప్రాణాల్ని కాల్చి చంపటం ఏమిటర్రా? హత్యలు చేసేవాళ్ళని కూడా విచారణ జరిపి శాస్త్ర ప్రకారం ఉరి తీస్తారుగదా? పని చెయ్యనందుకు తుపాకులు బారుచేసి కాల్చుకుంటారా? ఇదేం రాక్షసం?" అన్నది అమ్మకూడా.

బావ స్నానానికి లేచాడు. అక్క లేచి బావ తువాలూ, సబ్బూ పట్టుకుని స్నానాల గదికేసి వెళ్ళి లాంతరు పట్టుకుని బావ కూడా వెనకడితే వెళ్ళాడు.

బయట బండి ఆగిన చప్పుడయింది. కాస్సేపట్లో సేతు మామయ్య లోపలికి వచ్చాడు.

"అమ్మోయ్, సేతు మామయ్యొచ్చాడేవ్!" అంటూ చిట్టి వంటింట్లోకి పరిగెత్తింది.

"ఏంరా సేతూ? ఏమిటి కబుర్లు? ఇదేనా రావటం? అంతా కులాసా?" అని నాన్న అడిగాడు.

"ఆ!" అన్నాడు సేతు మామయ్య కోపంగా. అయితే ఆ కోపం నాన్నమీద కాదు.

"ఏమిటి విశేషాలు?"

"ఆఁ, ఏం చెప్పేది? క్రిందటివారంలోనే ఇరవైమణుగుల పంచదార అందిస్తానన్నాడా లుచ్ఛాగాడు. ఇంతవరకు అతీపతీ లేదు. ఎంత నష్టమయిందనుకున్నావు?" అన్నాడు సేతుమామయ్య.

"పంచదారంటే జ్ఞాపకం వచ్చింది. నాలుగు వీసెలు పంపిస్తానంటివి కాదుట్రా?" అన్నది అమ్మ ఇవతలికివచ్చి.

"పాఁ, వాడికవతల అందిచావకపోతే వాడుమాత్రం ఏంచేస్తాడూ?" అన్నాడు నాన్న.

"ఒక వీశె తెచ్చాలే బెడ్డింగులో ఉంది" అన్నాడు సేతు మామయ్య.

"పోనీ బాబూ, బ్రతికించావు! ఛస్తున్నాం కొనలేక. ధరలెట్లా మండిపోతున్నయ్యో ఎరుగుదువా?" అన్నది అమ్మ.

"ఎవడ్రా వాడూ?" అన్నది అమ్మ.

"ఉన్నాడులే!" అన్నాడు సేతుమామయ్య.

"అంత చాతకాని వాజ ఇస్తానని ఎందుకనాలీ?" అన్నది అమ్మ.

"ఇంకా లాభసాటిగా ఎవరికన్నా ఇచ్చాడేమో?" అన్నాడు నాన్న.

"వాడంతవాడే అవును. కాసీ కోసం గడ్డి తింటాడు. ఇరవై మణుగులు! వీశె రూపాయిన్నరకి కళ్ళకద్దుకుంటు న్నారు. తలుచుకుంటే కళ్ళు తిరుగుతై. ఒక్క పూటలో ఎగిరిపోయి ఉండును! అసలు నాకీ నెల అన్నీ నష్టాలే! కూలీ లంజకొడుకులు సమ్మె చేస్తున్నారు. వినలా?"

"లేదురా, ఇదెప్పణ్ణించి?" అన్నాడు నాన్న.

"మూడు రోజులయింది. మొదటి రోజు నలుగురు పనిలోకి వచ్చారు. అందులో ఇద్దర్ని పట్టుకు చావగొట్టారు. రెండో రోజునుంచీ ఒక్క గాడిదకొడుకు పనిలోకి వస్తే ఒట్టూ! రోజుకు పదిహేను వందలు నష్టం! మంచి అదను! ఏం చెయ్యనూ? కరువు బత్తాలు చాలవుట గాడిద కొడుకు లకు! కాళ్ళు విరగ్గొట్టేవాళ్ళు లేక... వీళ్ళు మిల్లు ముందు పికెటింగు చెయ్యకపోతే వంద మంది కూలీలను తెద్దును. రెండు రోజులపాటు వడ్ల బస్తాలు వాకిట్లో పడివున్నై. ప్రాణం విసిగి వాళ్లూ వెళ్ళిపోయినారు... రోజుకు పదిహేనువందలు పోతున్నది కదా ఓ యాభై అధికంగా పారెయ్యమంటే పారెయ్యడా అని వాళ్ళ మాజం! వెధవలకి రోలీ ఇవ్వను" అన్నాడు సేతు మామయ్య.

"పోలీసుల్ని పిలిపించి పికెటింగు చేసేవాళ్లని మిల్లు ముందునుంచి వెళ్ళగొట్టించి కొత్త కూలీల్ని తెచ్చుకోక పోయినావా?" అన్నాడు నాన్న.

"సరేలే! నాకు దాపరించిన వాళ్ళంతా అంతేలే. ఆ పోలీసు వెధవతో రారా అంటే రాడు. కూలీలు అల్లరి చేస్తున్నారా నీసొత్తు ధ్వంసం చేస్తున్నారా అని అడిగాడు."

"ఇద్దర్ని కొట్టారంటివిగా?"

"మిల్లు దగ్గిర కొట్టారా? కాలవ గట్టున కొట్టారు. ఫలాని వాళ్ళు కొట్టారని సాక్ష్యమా? దెబ్బ తిన్న వెధవలే నిజం చెప్పకుండా ఉన్నారు. ఎన్నైనా చెప్పు బావా! కూలీ వెధవలంతా ఒకటే. జరక్క ఒకరిద్దరు వచ్చి ఏం లాభం?"

"పోనీ మీ—ఆ పోలీసు ఉద్యోగికి కాస్త చెయ్యి తడి—" అన్నాడు నాన్న.

"ఇంకా నయం. వీడుత్త కర్కోటకుడంటే! ఇదే పంతులయితే నాకిన్ని పాట్లుండేవా?" అన్నాడు సేతు మామయ్య నిట్టూరుస్తూ.

అమ్మ పెట్టున నిట్టూర్చి, "కాలం కలిసిరాకపోతే అన్నీ అట్లాగే జరుగుతయ్యిలే. స్నానంచేసి భోంచేతువుగాని. మీరుకూడా లేవండీ!" అన్నది నాన్నతో.

—o—

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | 1P/A102455 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 185 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | ci, 4, 182, Bci |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |